The Largest Circulated Telugu Monthly

# చతుర

అక్టోబరు 1995 * రూ. 6/-

# ఊరు

వసంతరావ్ దేశ్‌పాండే

కన్సొలేషన్ బహుమతి పొందిన నవల

# 'చతుర' ప్రపంచం

## దొంగల్ని పట్టే దొంగ

దొంగల్లోను, వారి దొంగతనాల్లోనూ చాలా రకాలున్నాయి. ఘరానా దొంగలు కొందరుంటే, పిరికిదొంగలు మరికొందరు. పట్టపగలు నిర్భయంగా మారణాయుధాలతో వచ్చే దొంగలు కొందరైతే, అర్ధరాత్రి పిల్లిలా వచ్చి దొంగతనం చేయబోయి, తీరా ఏదైనా చప్పుడు వినిపిస్తే దొంగిలించిన వస్తువులను అట్టే వదిలేసి ఇట్టే పారిపోయే దొంగలు కొందరు. ఇందులో చీటికీ మాటికీ పట్టుబడే దొంగలు కొందరయితే జీవితాంతం పట్టుబడకుండా దొంగతనమే వృత్తిగా బతికి, చివరికి దానికితగ్గ మరణాన్నే పొందే సాహసోపేతులు కూడా వుంటారు. ఇల్లా చెప్పుకుంటూపోతే దొంగల్లో ఎన్నో రకాలు కనిపిస్తారు.

ఇంతకీ దొంగలను పట్టుకుని శిక్షించాలనీ, దానికి ఓ పోలీసు ఫోర్సులాంటివి అవసరమనే ఆలోచన నెపోలియన్ పరిపాలనాకాలంలో మొదటిసారిగా ఆచరణలోకి వచ్చింది. ఆ రోజుల్లో ఫ్రాన్స్ అంతా ఎక్కడపడితే అక్కడ దొంగతనాలు పెచ్చుపెరిగిపోయి ప్రజల ధన, మాన, ప్రాణాలకు రక్షణ లేకుండాపోయింది. ప్రజలు దుర్భరమైన అభద్రతా వాతావరణంలో భయభ్రాంతులై బతికేవారు. ఆ సమయంలో కొందరు పెద్దలు నెపోలియన్ రక్షణమంత్రి హెన్రీని కలిసి ఈ దొంగతనాలని అరికట్టడానికి ఏదైనా పరిష్కారం ఆలోచించమన్నారు. ఆయన దీన్ని గురించి రాత్రింబవళ్లు ఆలోచించి తన సహాయకునితో చర్చించాడు.

ఆ చర్చల్లో పారిస్ మొత్తానికి భయంకరమైన దొంగగా పేరుమోసినవాడు విదోక్ అనే పేరుగల వ్యక్తి అని తెలిసింది. విదోక్... తాను దొంగతనం చెయ్యకుండా కొంతమందిచేత చేయిస్తాడనీ, వాళ్లు ఎప్పుడయినా చెప్పిన ప్రకారం చెయ్యకపోతే తనే వాళ్లని పోలీసులకు పట్టించే ఏర్పాటు చేస్తాడనీ, తను మాత్రం ఏ రుజువులు, సాక్ష్యాలూ దొరక్కుండా నిర్భయంగా తిరుగుతాడనీ తెలుసుకున్నాడు హెన్రీ. వెంటనే విదోక్‌ను రప్పించే ఏర్పాటుచేశాడు.

విదోక్‌ని ఎన్నో విషయాలమీద ప్రశ్నలు




వేసిన తరువాత.

"నువ్వే పోలీసు ఆఫీసరువి అయితే, ఈ దొంగలముఠాని ఎలా పట్టుకుంటావ్?" అని అడిగాడు.

"ఏముందీ? నేను కూడా వాళ్లతో కలిసినట్టు నటించి, అవకాశం రాగానే అరెస్ట్ చేస్తాన"న్నాడు.

"సరే అయితే, ఈ క్షణంనుంచే నిన్ను



పోలీసు ఆఫీసరుగా నియమిస్తున్నాను" అన్నాడు హెన్రీ.

దాన్ని ఛాలెంజ్‌గా తీసుకున్న విదోక్ నిజంగానే చిత్తశుద్ధితో పనిచేసి ఓ ప్లాన్ ప్రకారం తనకి సంబంధించని దొంగలందరినీ కూడా పట్టి బంధించి హెన్రీముందు తెచ్చిపడేశాడు.

అంతేకాదు ఆపైన ఎప్పుడూ దొంగతనం మాటెత్తకుండా బుద్ధిమంతుడు, సాహసి అయిన పోలీసు ఆఫీసరుగా పేరు తెచ్చుకున్నాడు.

---

## పత్రికలు చెప్పని కొత్త కబుర్లు

టూరిస్టు పత్రికలు చూస్తే కేరళ రాష్ట్రంలోని కోవలం బీచ్ అందాల్ని, తిరుచూరి ప్రాభవాన్ని చక్కగా చెబుతాయి. కానీ సాహిత్యానికి అందక తెరచాటున వుండి ఊరించే విషయా




లు ఇంకా ఎన్నో వున్నాయక్కడ అంటారు కొందరు. స్కూళ్లకి, కాలేజిలకు వెళ్లే విద్యార్థులంతా ధోతీలుగానీ, లుంగీలుగానీ ధరించి పైన ఓ మామూలు షర్ట్‌గానీ, బనీనుగానీ ధరిస్తారు. అమ్మాయిలు పరికిణీలు ధరించి చేతుల్లో వెదురుపుల్లలతో చేసిన గొడుగులు పుచ్చుకుని బయలుదేరతారు. పెళ్లయిన స్త్రీలలో చాలామంది నుదుట గంధంబొట్టు ధరిస్తారు. ఆర్టీసీ బస్సులను కేరళీయులు అనెవండీ అని పిలుస్తారు. అసలు ఆ పదానికి అర్థం ఎద్దులబండి అని. ఆ మాటకు తగ్గట్టుగానే బస్సులు కుంటినడక నడుస్తూ ఎద్దుబళ్లలా పోతూవుంటాయి. నిజంగా బస్‌డ్రైవింగ్ విషయంలో కేరళ డ్రైవర్లు స్థితప్రజ్ఞులని చెప్పక తప్పదు.

అక్కడి కొబ్బరి నూనెలో వేయించే నెన్ద్రంగాయ్ చిప్స్ చాలా రుచికరమైనవంటారు అందరూ.

ప్రతిచోటా రెండేసి బస్‌స్టాండులుంటాయక్కడ. ఒకటి ప్రైవేట్ బస్టాండు. మరోటి గవర్నమెంట్ బస్టాండు. ప్రతి బస్‌మీద అది వెళ్లే ప్రాంతం మళయాళంలోనే రాసివుంటుంది. ఆవిధంగా ఇతర రాష్ట్రాలనుంచి కేరళ వెళ్లేవారికి భాషరాని కారణంగా ఏ బస్సు ఎక్కడికి వెడుతుందో తెలుసుకోవడం కష్టమే.

పోతే... ఇంక... లిక్కర్‌షాపుల వద్ద నేమ్ బోర్డ్‌లన్నీ తమిళంలో రాసివుంటాయి. చాలా మంది తమిళులు మద్రాసునుంచి కేరళ వలసవచ్చి మద్యవ్యాపారస్థులై స్థిరపడ్డారని అంటారు.

అక్కడ హెూటళ్లలో ప్లేట్‌మీల్ అనీ, ఫుల్ మీల్ అనీ ఏమీలేవు. అన్నం, కూర, చట్నీ, సాంబారులతో రుచికరమైన భోజనం చవకలో దొరుకుతుంది. అయితే అక్కడున్న ఫైవ్‌స్టార్, త్రీస్టార్ హెూటల్స్‌కి ఈ రూలు వర్తించదనుకోండి. వాటి భోగం వాటిదే. హెూటళ్లలో ఫలహార ధరలు కూడా సామా





న్యులకు అందుబాటులోనే వుంటాయి. అన్ని హెూటళ్లలో రుచికరమైన నెస్‌డ్రాంగే చిప్స్ వడ్డించడం ఓ ప్రత్యేకత.

బార్లలో గిఫ్టులనిచ్చే పద్ధతి ఇంచుమించుగా కేరళలో తప్ప మరెక్కడా లేదని చెప్పచ్చు. ఓ బార్ "50 రూపాయల మద్యాన్ని సేవిస్తే ఓ కూపన్ ఉచితం. దాంతో మీ అదృష్టాన్ని పరీక్షించుకోండి. కలర్ టి.వి., హీరో హెూండాలాంటి విలువయిన బహుమతులు పొందండి'' అని ప్రకటిస్తే మరోబార్ మరో ధరకి మరోరకం ప్రైజులున్నాయని ప్రకటిస్తుంది. ఇలా కేరళ మొత్తం తిరిగితే మరెన్నో వింతలు బయటపడతాయని తెలుస్తోంది.

## మంత్రం ఖరీదు 'వంద'

'నిప్పు తొక్కిన కోతిలా గంతులేస్తున్నా'డంటూ వుంటాం, ఎవరైనా కోపంతో చిందులు తొక్కుతుంటే. కానీ ఈ నిప్పులు తొక్కడం, నిప్పులమీంచి నడవడం చాలా చోట్ల చాలామంది చేస్తూ వుంటారు. చిన్నగా వేడి గిన్నెను పట్టుకుంటే చెయ్యి కాలి, వేళ్లు ఊదుకుంటూ, సాయంత్రందాకా ఏ పనీ చెయ్యకుండా కూచుంటూ వుంటారు చాలా మంది. అలాంటివాళ్లు కూడా కొన్ని ప్రత్యేక పర్వదినాల్లో, పూజా సందర్భాల్లో నిప్పుల పక్కమీంచి నడుస్తారు. ముఖ్యంగా శ్రీలంకలోను, దక్షిణ భారతంలో తమిళనాడులోను ఈ నమ్మకాలు ఎక్కువగా కనిపిస్తాయి. సుబ్రహ్మణ్యేశ్వరుడికి సంబంధించిన పూజాదినం లేదా పండగదినం వస్తే ఎంతోమంది సాధువులు ఒళ్లంతా విబూది పూసుకుని కణకణలాడే నిప్పుల మీంచి నడుస్తారు. విపరీతమైన భక్తిభావావేశంలో అలాంటి పనిచేయగలుగుతారు వారు.

1989 ఆగస్ట్ 10వ తేదీన ఢిల్లీలోని కరోల్ బాగ్ ఏరియాలో ఓ విచిత్రం జరిగింది. డచ్ దేశానికి చెందిన ఎమిలెట్రాల్ బ్రాండ్ అనే ఆసామి 5 మీటర్ల పొడవున కణకణలాడే నిప్పులను పరిపించి, ఏదో మంత్రం చదువుతూ దానిమీద అటూఇటూ నడిచాడు. ఈ వింత చూడ్డానికి చుట్టూ మూగిన జనాలతో "మీ అందరికీ దీన్ని క్షణాల్లో నేర్పగలను, నే చెప్పే మంత్రాన్ని పఠిస్తూ దీనిమీంచి నడవగలరు. దానికోసం ఒక్కక్కరు వంద రూపాయలు ఇవ్వాల్సి వుంటుంది'' అన్నాడు. ఎగిరి గంతేశారు నగరవాసులు. అందరూ జేబుల్లోంచి వంద నోట్లు తీయబోయారు. అంతలో ఆ గుంపులోంచి ఓ వ్యక్తి బయటకువచ్చి "ఆగండి'' అని అరిచి కట్టుకున్న లుంగీ పైకి మడిచి కట్టాడు.




డచ్ ఆసామికేసి తిరిగి "ఏంటయ్యా ఆ మంత్రం! ఎవర్ని మోసం చేద్దామనుకుంటున్నావు! ఇలా నడిచేవాళ్లు మా దేశంలో బొచ్చెడుమంది. కావాలంటే చూడు'' అంటూ సదరు వ్యక్తిని తిట్టి ఆ నిప్పుల మీదకి దూకి అటూ ఇటూ పదిసార్లు నడిచి చూపించి మీసాలు మెలేశాడు. డచ్ వ్యక్తి మొహంలో నెత్తురుబొట్టు లేదు. 'అనువుగానిచోట అధికుల'మంటే వచ్చే తిప్పలవేమరి!








# జానీస్ "జూ"

రకరకాల సాధు, క్రూర జంతువులని మచ్చిక చేసుకోడంలో సిద్ధహస్తుడు బ్యాచ్‌లర్ జ్యానీ అనే ఆసామి. చాలా చిన్నవయసునుంచే జానీ గొప్ప వేటగాడని పేరుతెచ్చుకున్నాడు. ప్రస్తుతం అతడు తనకున్న వంద ఎకరాల స్థలంలో ఓ 'జూ' నిర్మించి అందులో రకరకాల జంతువులనుంచాడు. 'టూరిస్టలను ఆకర్షించడమే నా ధ్యేయం' అంటాడు జానీ. జంతువులకోసం బోనులు, పంజరాలు, గోతులు మొదలయిన పనులన్నీ స్వయంగా చేసుకున్న జానీ, 'జూ'కి తన పేరే పెట్టుకున్నాడు. 'జానీస్ జూ'లో గేదెలనుంచి మొసళ్ళదాకా ఎన్నో జంతువులున్నాయి. అవన్నీ నా స్నేహితులు' అంటాడతడు.

'అయినా ఏ జంతువునీ నమ్మకూడదనీ ప్రేమగా వున్నట్టే వుండి అదునుచూసి యజమానిని చంపడానికి వెనుకాడదని అంటాడు జానీ. 60 ఏళ్ళొచ్చినా మంచి బలంతో అబ్బాయిలా కనిపించే జానీ చిత్రకారుడు కూడా. అతడి 'జూ'లో జంతువులతోపాటు పెయింటింగ్స్ కూడా ఓ ప్రత్యేక ఆకర్షణ.




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**అక్టోబర్ చతుర నవల ఊరు ....................**

**సమీక్షకుని పేరు :** ..............................................

**చిరునామా :** ..............................................

..............................................

..............................................

..............................................



అప్పుడెప్పుడో (1982)లో వ్రాసిన 'అడవి' నవల ఇదే పత్రికలో 100వ సంచిక పూర్తయిన సందర్భంలో పెట్టిన పోటీలో ఉత్తమ ద్వితీయ నవలగా ఎన్నికయింది. 'అడవి' నవల చదివి స్పందించి ఉత్తరాలు వ్రాసిన వందలాది మంది పాఠకుల అభిప్రాయాలు చదివాక, పాఠకుల్లో ఎంత పరిపక్వత, ఎదిగినతనం ఉందో తెలుసుకున్నాక, అంత సులభంగా వెంటనే మరో నవల వ్రాయలేకపోయాను. పాఠకులు ఆశించిన అంచనాలు అందుకోలేనేమో అని భయం.

అందుకే 'అడవి'నుండి 'ఊరి'వరకు సుదీర్ఘమైన మౌనం.

ప్రస్తుత వ్యవస్థలో కనిపించని సంకెళ్లు ఎన్నో.

నిర్భయంగా ఉన్నది ఉన్నట్టు, అనుకున్నది అనుకున్నట్లు వ్రాయ వీలులేని చీకటి(?) రోజుల్లో బ్రతుకుతున్నాం.

లేనిది ఉన్నట్టు భ్రమింపజేసే రంగుల (★) నక్షత్రాల సంస్కృతికి బలయిపోతున్నవాళ్ళం. ఆ మహమ్మారి రంగుల డబ్బాను పదిరోజులు కట్టిపడేస్తేకాని యీ నవల వ్రాయలేకపోయాను. ఇప్పుడిప్పుడే ఈ రంగులడబ్బా మత్తునుండి కోలుకుంటున్నవాణ్ణి.

నవలకన్న పరిచయం పరువయిపోతున్నట్లుంది. అందుకని...

చిత్తుప్రతి వ్రాసి ఫెయిర్ రాయబద్ధకించే నాకు ఎంతో ఆప్యాయంగా ఫెయిర్‌కాపీ రాసి పెట్టే నా శ్రీమతి హరిప్రియ, ఈ నవల వ్రాస్తే ఎన్ని డబ్బులొస్తాయి అని లెక్కకట్టి పెదవి విరిచే (కూలీ కూడా గిట్టదని) మా పెద్దాడు బి. శ్రీకాంత్; అడవి, ఊరు అయ్యాయి... ఇక నగరంలోకి ప్రస్థానించమని 'ది సిటీ' వ్రాయమనే మా 'చిన్నా' బి. కార్తీక్, ఇదే నా చిన్న ప్రపంచం.

అప్పటి 'అడవి'నుండి 'ఊరి'వరకు గిరిజన ఉపాధ్యాయ శిక్షణ సంస్థలో గిరిజన ఉపాధ్యాయమిత్రులకు సబ్‌జైట్ ఉట్నూరులో పాఠాలు చెప్పడం వృత్తి. రాయాలని ఎంతో ఉన్నా రాయలేక నిరంతరం అస్థిమితంగా ఉండడం ప్రవృత్తి.

చిరునామా:

C/o శ్రినిలయం, ఇం.నం. 11-32, రాజీవ్‌నగర్, ఆదిలాబాదు 504 002.



# ఊరు

## వసంతరావ్ దేశ్‌పాండే

# చతుర

సంపుటి: 18 సంచిక: 9 అక్టోబర్ 1995

**ఊరంతా చీకటిబడిలో ప్రశాంతంగా నిద్రపోతోంది.**

ముసలివాళ్లు మాగన్నుగా కునుకు తీస్తుంటే... పసిపిల్లలు కళ్లు మూసుకునే తల్లి రొమ్ముకోసం పెదాలతో వెతుక్కుంటున్నారు.

పడుచుజంటలు వెచ్చదనం కోసం మరింత దగ్గరవుతున్న ఆ నీరవనిశీధిలో...

**హటాత్తుగా సెర్చిలైట్లు వెలిగాయి.**

**క్షణాల్లో పోలీసులు గుడిసెలపై... అందులోని మనుషులపై స్వైరవిహారం చేశారు.**

రక్తసిక్తమైన ఆ ప్రదేశం అరుణోదయకాంతుల్లో మరింత ఎర్రబడింది.

**వైజ్ఞానికంగాను, ఆర్థికంగాను... మరెన్నోవిధాల వెనుకబడిన అలాంటి ఊళ్ళు... అక్కడి అమాయకప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలు ఎలాంటివి?**

మనిషి ఆకాశపు హద్దులుదాటి సుదూరలోకాలను కూడా చుట్టిరాగలుగుతున్న నేటి వైజ్ఞానిక పురోగతిలో... ఇప్పటికీ కొందరు ఎందువలన భాగస్థులు కాలేకపోతున్నారు?

'చతుర' నవలల పోటీలో కన్సొలేషన్ బహుమతి రూ. 5,000/-పొందిన **వసంతరావ్ దేశపాండే** నవల "**ఊరు**" ఈ నెల 'చతుర' సమగ్రనవల.





ఊరు!... ఊరంతా చీకటి ఒడిలో ప్రశాంతంగా, తల్లి ఒడిలో పసిపాపలా ఆదమరచి నిదురపోతోంది.

ఆకాశంలో సప్తఋషులు పక్కకు వెళ్లిపోయారు.

పాలపుంత- మెలమెల్లగా పలచబడి, కనుమరుగవుతోన్న వేళ!

హఠాత్తుగా చీకటి రాత్రి, వెలుతురు వాంతి చేసుకున్నట్లుగా, ఊరు, ఊరంతా సెర్చిలైట్ల కాంతిలో పట్టపగలయింది!

కానీ ఊళ్లో అణువంతయినా అలికిడి లేదు!

చూస్తూండగానే ఊరి పొనాదికి ఫర్లాంగు దూరంలోనే పోలీసు వ్యానులు, జీపులు ఆగిపోయాయి.

ఆగిన వ్యానుల్లోంచి పోలీసులూ, బి.యస్.ఎఫ్. జవానులు బిలబిలమంటూ బయటపడి క్షణాల్లో ఊరిని చుట్టుముట్టారు.

అలా చూస్తోండగానే అల్లిగూడెం పోలీసుల దిగ్బంధంలో చిక్కుపడిపోయింది.

పోలీసుల కళ్లుగప్పి ఒక్క పులుగు కూడా ఊళ్లోంచి బయటకు గానీ, బయటనుండి ఊళ్లోకిగానీ వెళ్లడానికి వీలులేకుండా వుంది. గూడెంలో ఒక్క మనిషీ మెళకువతో లేడు! రోగులకు సహితం కన్నంటేవేళ అది!

ముసలివాళ్లు మాగన్నుతో ముడుచుకొని పడుకున్నారు. పసిపిల్లలు నిద్రలోనే తల్లి రొమ్ముకోసం కళ్లుమూసుకునే పెదాలతో వెదుకుతున్నారు.

ఏ గుడిసెలోనూ గుడ్డిదీపం కూడా వెలగడంలేదు!

పడుచు జంటలు యింకాస్త వెచ్చదనంకోసం నిదురలోనే మరింత దగ్గరవుతున్న వేళ గుడిసెలకడ్డంగా కట్టుకున్న చెక్క తలుపులూ- తడకలూ, పోలీసుల తుపాకీ మడమలతో, బూటు కాళ్లతో క్షణాల్లో తునాతునకలైపోయాయి.

పోలీసులు జబర్దస్తీగా గుడిసెల తలుపులు బద్దలుకొట్టి లోపలికి చొరబడితే తప్ప, గూడెం జనాలకు నిద్దురవదలలేదు.

పోలీసుల కంపనానికి గూడెం గుండెలు బీటలు వారాయి.

నిదురలో ఉన్న వారిని నిద్రలోనే కుళ్లబొడుస్తున్నారు.

పోలీసు దెబ్బలకు జడిసి, వాళ్లకాళ్లు పట్టుకుని బతిమిలాడే వాళ్లు కొందరు, తిన్న దెబ్బలు చాలని వెనక గుమ్మంలోంచి బయటపడి దొరికినదారిన పడి పారిపోయి దాక్కునేవారు కొందరు.

చిన్నాపెద్దా, ముసలీ ముతకా, పిల్లాజెల్లా, మగా ఆడ ఏమీ చూడ్డంలేదు! ఆ తుపాకీ మడమలు, ఆ లాఠీలు, ఆ బూటుకాళ్లు, మనుషులపై స్వైరవిహారం చేస్తున్నాయి.

పడుకున్న వాళ్లు మొదటి దెబ్బకు లేస్తున్నారు తల్లడిల్లి! కానీ పడుతున్న దెబ్బలు ఎవరు కొడుతున్నారు? ఎందుకు కొడుతున్నారు? అర్థం కావడంలేదు! ఏం జరుగుతున్నదీ, ఎవరు జరుపుతున్నారు మెదడుకు అందనంత వేగంగా ఏ ఆలోచనా రానీయనంత వేగంగా పడుతున్నాయి దెబ్బలు!

లాఠీల దెబ్బలు! తుపాకీ మడమల దెబ్బలు! ఇనుపనాడా బూటు కాళ్ల దెబ్బలు! దెబ్బలు!

దెబ్బల నేపథ్యంలో...

సి.ఆర్.పి. తెలుగుబూతులు!

బి.ఎస్.ఎఫ్.ల హిందీ బూతులు!

అటకలపై ఎవరన్నా దాక్కున్నారేమోనని తుపాకీ బ్యానట్‌లతో పొడిచి మరీ చూస్తున్నారు! ఖాళీ గుమ్ములను, గాదెలనూ కూడా పొడిచి పొడిచి చూస్తున్నారు. పాత బట్టల మూటలు సైతం తుపాకీ బ్యానట్‌ల పోట్లనుండి తప్పించుకోలేదు! తుపాకీ మడమ దెబ్బ కణతకి తగిలి దేవుబాయి స్పృహతప్పి పడిపోయింది. మేస్రం జంగుకు దెబ్బలు పడంగానే పరిస్థితి అర్థమ




యింది. వెంటనే మొహంతో భూమిని కరుచుకొని, తలపైనుండి రెండు చేతులూ ఉంచుకొని, వీపును అప్పగించి దెబ్బలను ఓర్చుకొంటున్నాడు.

తుకారాం కొంత నిరోధించబోయి పడిపోయాడు.

విషయం తెలియని బొజ్జుతల్లి హాహాకారాలు చేస్తూ బయటకు పరిగెత్తింది. పరిగెత్తే ముసలిదాని నడుంమీద బూటుకాలితో తంతే, బంతిలా దొర్లుతూ వెళ్లి అంతదూరంలో పడింది.

జైతు పరిగెత్తాలని ప్రయత్నించి చాలానే దెబ్బలు తిన్నాడు.

నిదురపట్టక సతమతమవుతూన్న కినాక బాలు తాత లౌక్యంగా తలుపు వెనకదాక్కొని, ఒక్క దెబ్బకూడా పడకుండా తప్పించుకున్నాడు.

ఫక్రు, మడావిరాము తిన్నంత దెబ్బలు తిని, యిక తాళలేమని బయటకు పరిగెత్తి చిక్కుడుచెట్ల పొదల్లో దాక్కున్నారు.

దొరికిన వారిని దొరికినట్లు చావబాదడమే వారి లక్ష్యంగా కనిపిస్తోంది!

గిరిజనుల గుండెల్లో ఇందర్‌వెల్లి గాయంమాని యిప్పుడిప్పుడే స్వస్థత చిక్కిందనుకుంటే మళ్లీ మరో గాయం. పాలను సహితం ఎరుపెక్కించిన గాయం ఇది! పాలుగారే బుగ్గలను సైతం ఎరుపెక్కించిన గాయం ఇది.

శాపగ్రస్తులై ఇన్నాళ్లూ క్యాంపుల్లో పెళ్లాం, పిల్లలకు దూరమై ఒళ్లు పెంచి మదమెక్కిన మానసిక సమతుల్యం నశించిన ఖాకీ మదగజాల పదఘట్టనమది.

ఈ ఘోరకరాళ నృత్యానికి కారణమేమిటో తెలియదు.

దొరికిన వారిని దొరికినట్లు కొడుతున్నారు.

ఒక మూలకు పడుకొనివున్న జంగు, దేవుబాయిల పిల్లలను నిదురలోనే పశువులను బాదినట్లు బాదారు. చిన్నపిల్లలు పారు, భోజు, భీములను పసిపిల్లలని కూడా చూడకుండా బూటు కాళ్లతోతన్నారు, తొక్కారు.

ఏం జరుగుతోందో, ఏమవుతోందో అర్థంగాక పిల్లలు భయభ్రాంతులయ్యారు.

ఏం జరుగుతోందో అర్థం చేసుకోవడానికి వీల్లేనంత వేగంగా, సర్వాంగాలపై జరుగుతున్న హింస అది.

కొట్టికొట్టి విసిగి పోయారేమో రాక్షసులు, అమూల్యమైన అమృతాన్ని వెదుకుతున్నట్లు, మంచంకిందా, అటకలపైనా , గుమ్ముల్లో, గాదెల్లో దేనికోసమో వెదుకుతున్నారు.

వెదుకులాటలో గుమ్ముల్లోని ధాన్యాన్ని, గాజల్లోని దినుసులనూ నేలపైపోసి కలగాపులగం చేస్తున్నారు.

ఎంతో కష్టపడి ప్రోగుచేసుకున్న గ్రాసమది!

అంతటి దెబ్బలకు తట్టుకున్న గిరిజనులకు ధాన్యం నేలపాలు కావడంతో మనసులో కలిచివేసినట్లయింది.

గింజగింజ ఏరి సొక్కం జేసుకున్న ధాన్యం నేలపాలయితే గిరిజనుడు చూడలేడు. గింజే దైవం! గింజే ప్రాణం! గింజ, కాయ, పండు ఏదైనా దేవుడి ప్రసాదం! అది తెలిసి తెలిసి నేలపాలు కావద్దు. కానీ ఏమీ చేయలేని అశక్తత!

ఖాకీలు చూస్తుండగానే, కొందరు గడ్డివాముల్లో, చొప్పగడ్డల్లో దాక్కుని తప్పించుకోజూడటంతో దాక్కున్న వారిని బయటకు లాగి గడ్డివాములకూ చొప్పగడ్డలకు నిప్పంటించారు.

చూస్తుండగానే మంటలు ఆకాశాన్నంటాయి. మంటలను చూసిన పశువులు గూటాలు పీక్కుని పోతాం అన్నట్లు అరుస్తున్నాయి. కోళ్లూ, మేకలూ ఒకటే హాహాకారాలు చేస్తున్నాయి. పైకెగసిన మంటలు గాలికి చెలరేగి పక్కకొట్టాలు అంటుకొని తగలబడిపోతున్నాయి. కొట్టాల్లోని పశువులు కట్లు

తెంపుకొని పారిపోతున్నాయి.

భద్రంగా దాచుకున్న ధాన్యం నేలపాల యింది. పశువులకోసం పోతం చేసుకున్న మేత బుగ్గిపాలయింది.

ఎందుకు కొట్టారు? అన్న ప్రశ్నకన్నా, ఇక ముందు బతుకెట్లా అన్న ప్రశ్న అందరి కళ్లల్లో స్పష్టంగా ప్రతిబింబిస్తోంది ఆ మంటల వెలుగుల్లో!

చూస్తుండగానే ఒక్కొక్కరిని లాక్కొచ్చి పీర్ల సావిడిలో నిలబెట్టారు వరుసగా. అందరూ రక్తసిక్తమై ఉన్నారు.

ఆ ఊళ్లో అరుణోదయం ఇంకా కాలేదు! కానీ సెర్చ్‌లైట్ల కాంతిలో జరిగిన ఈ నెత్తుటి యాగం అరుణిమ పరావర్తనం చెంది ఆకాశంలో ప్రతిబింబించినట్లు తూరుపు ఆకాశం అప్పుడప్పుడే ఎర్రబారుతోంది.

ఏ పోలీసు కళ్లల్లో చూసినా నెత్తుటి ఎర్రజీరలే! అందరి గుండెలూ ఆవేశంతో ఎగిసెగిసి పడుతున్నాయి.

ఇరవై నాలుగు గంటల క్రితం అల్లంపల్లి అడవుల్లో వందల ఎకరాల రిజర్వ్ ఫారెస్ట్‌ను కొట్టించిన అన్నలు ఈ ఊళ్లోనే ఉండి ఉంటారని వారికి సమాచారం అందింది. అందుకే ఈ హడావుడి! ఎటు చూసినా బూట్ల చప్పుడు!

ఎటు చూసినా తళాతళా నల్లగా మెరిసే తుపాకులు!

అంతలోకే ఒక గొంతు మెరుపులేని ఉరుములా ప్రతిధ్వనించింది!

"చెప్పండిరా! మీ అన్నలెక్కడ? అన్నం పెట్టి, ఆశ్రయం ఇస్తున్న అన్నల జాడచెప్పండి! మీలో మిలిటెంట్లు, కొరియర్‌లూ, ఇన్‌ఫార్మర్‌లెవరో ముందుకు రండి! ఎవరినీ ఏమీ అనం!

"మాకేం తెలవదు సార్!" అంటూ ఒకడుగు ముందుకువేశాడు మేస్రం జంగు.

"మీకు తెలవకుండా ఎట్లా ఉంటదిరా! లెక్క పెడితే సరిగ్గా గుప్పెడంత మందిలేరు మీ అన్నలు! మీ అండలేందే వాళ్లు ఈ అడవిల బతికి బట్టకడుతున్నారురా! వాళ్లకు మీరు చేసే పని చెప్పండి! మిమ్మల్నేమీ అనం!" అన్నాడు సి.ఐ.

"సత్తె ప్రమాణంగా చెప్తున్నాం సార్! ఈ వారం రోజులల్ల మాగూడెం దిక్కు ఎవ్వరు రాలేదు! మా పిల్లలమీద ఒట్టేసి చెప్తున్నాం నమ్మండి!" అన్నాడు. జంగు అందరిమాటగా!

"మా పెర్సపేన్‌మీద ఒట్టేసి చెప్తున్నాం సార్! మా గూడెం తాటికి ఎవరూ రాలేదు! మేం ఎవల్లకూ అన్నం పెట్టలేదు!" అన్నాడు అరవైయేళ్ల పెందూరి సోము.

"నిన్న మీ అన్నలు వంద ఎకరాల రిజర్వ్ ఫారెస్టును కొట్టించారు. వద్దన్న మా పోలీసులపై జులుం చేస్తరా! ఇంతదాకా వచ్చినంక మీ అన్నలు ఎంత దూరం పోతరో మేమూ చూస్తం!" అన్నాడు సి.ఐ.

యస్.ఐ. సందీప్ ఒక పక్కగా వెళ్లి హేట్‌తీసి రిలాక్సయి సిగరెట్ వెలిగించుకున్నాడు.

సెర్చ్‌లైట్లకాంతి మెల్లమెల్లగా పలచబడుతోంది.

వెయ్యి సెర్చ్‌లైట్లయినా వెలవెలబోయేలా తూర్పున సూర్యోదయమవుతోంది! అప్పుడే ఒక యువకుడు సైకిల్‌పై అక్కడికి చేరుకున్నాడు.

ఎవరంటున్నారో అర్థంకాని రీతిలో తుమ్మెదల రొదలా కీచురాళ్ల ధ్వనిలో 'డాక్టర్‌బాబు, డాక్టర్‌బాబు' అనే ధ్వని మంద్రస్థాయిలో ప్రతిధ్వనిస్తోంది.

సైకిల్ దిగిన సిద్ధార్థకు తనెక్కడికి వచ్చాడో ఒక్కక్షణం అర్థం కాలేదు! సెర్చ్‌లైట్లూ, పోలీసులూ, ఎంక్వయిరీ కౌంటర్లు, బాధితులూ ఇవన్నీ చూస్తుంటే అల్లిగూడెంలో ఏదైనా భూకంపం వచ్చివెళ్లిందా అన్నట్లుంది అక్కడి పరిస్థితి.






ఏం జరిగిందీ ఒక్కక్షణం ఆలోచించాడు సిద్ధార్థ! మరుక్షణం ఏం జరిగివుంటుందో అర్థమయిపోయింది.

సైకిల్‌స్టాండు వేసి నిలబడ్డాడు సిద్ధార్థ!

"నీవేనన్నమాట డాక్టర్ సిద్ధార్థవి. వీళ్ల దీనబంధువి! ఆపద్బాంధవుడివీ! యామ్ ఐ కరెక్ట్!" సి.ఐ అన్నాడు.

"ఓన్లీ సమ్ ఎక్సెప్టంట్. ఐయామ్ సిద్ధార్థ... డాక్టర్ సిద్ధార్థ. దీనబంధు వగైరా కేవలం వాళ్ల భావన! అంతే!"

"డాక్టర్ వేషంలో డాక్టర్ ముసుగేసుకున్న నక్సలైట్‌వంటాను నేను!"

"మీరు పోలీసులు! ఏమైనా అనొచ్చు! అనుకోవచ్చు!

"అంతేగానీ నక్సలైట్లకూ నీకూ ఎలాంటి సంబంధం లేదంటావు! అంతేనా!"

"లేదని ఎలా అంటాను! జనం మధ్య నిత్యం బతుకుతున్న వాడిని. సాంఘిక జీవనం గడుపుతున్నవాడిని. ఈ ప్రాంతంలో తిరిగే అధికారులకు తారసపడ్డట్లే వాళ్లు నాకూ తారసపడ్డారు. చాలాసార్లు యీ గిరిజనుల ఆరోగ్యంకోసం నాకు చేయూతనిచ్చారు. రెండు చేతులతో నేను చేయలేని పనికి తమ పదిచేతులు అందించి సహకరించారు. నేను ఇక్కడ డాక్టర్ని. ఈ గిరిజన ప్రజలు నా పేషంట్లు. వారి సేవకోసం ఎవరు ఏ సహాయమందించినా నేను స్వీకరిస్తాను. ఇంతే! నాకూ వారికీ ఉన్న సంబంధం! హింస, రక్తపాతం నా సిద్ధాంతంకాదు. వాటిని అడ్డుకోవడం నా సిద్ధాంతం"

"చాలా బాగా మాట్లాడతావు డాక్టర్ నువ్వు! గిరిజనులకు వైద్యమేనా లేక గిరిజనులకు వైద్యం పేరుతో అడవి అన్నలకు మా నుండి తగిలిన బుల్లెట్లను కూడా తీసివేస్తుంటావా?"

"తీశాను! చాలాసార్లు తీశాను. అడవి అన్నలకు తగిలిన బుల్లెట్లూ తీశాను. ఇంద్రవె

ల్లికాల్పుల్లో గాయపడిన గిరిజన సోదరుల బుల్లెట్లూ తీశాను. మీ ప్రభుత్వ డాక్టరు డ్యూటీ ఉండి ఎగనామం పెట్టినపుడు మీ పోలీసుల బుల్లెట్లూ తీశాను!"

"అలా బుల్లెట్లు తీయడం చట్టపరంగా నేరమని నీకు తెలియదా?" ఒక ప్రొబేషనరీ యస్.ఐ అడిగాడు.

"నాగరికత బలిసిమీరు చేసుకున్న చట్టాలకూ, న్యాయాలకూ నేను అతీతుణ్ణి. మంచి అని చెప్పే నా మనస్సాక్షే నా న్యాయం, నా చట్టం. దానికే నేను తలవంచుతాను. అందుకే ఏ చట్టాలూ, న్యాయాలూ తెలియని ఈ అడవిమనుషుల మధ్య నా జీవితం గడుపుతున్నాను''

"చట్టానికీ న్యాయానికీ నీవు అతీతుడివా!"

"మీ జనారణ్యంలో మీ చట్టాలూ, న్యాయాలూ ఉన్నోడికి చేయూతను, బలాన్నీ ఇచ్చి అనవసరకాలయాపన చేసేవేకదా! అయినా ఈ దేశ పౌరుడిగా చట్టాన్నీ, న్యాయాన్నీ ఆశించే స్థితి ఇంతవరకూ కలగలేదు. కలగదు కూడా. మీ చట్టాన్నీ న్యాయాన్నీ నమ్ముకుంటే, కాలకూట విషంతో ప్రాణం నిలుపుకోవాలని భ్రమపడటమే అవుతుంది''

"చట్టాలన్నా, న్యాయస్థానమన్నా అంత చిన్న చూపుందా నీకు? టాడా క్రింద అరెస్టు ఛేస్తే తెలుస్తుంది. చట్టమంటే ఏమిటో, పోలీసులంటే ఏమిటో!" అన్నాడు ప్రొబేషనరీ యస్.ఐ.

"విత్‌ప్లెజర్! ఈ చేతుల్లో సిరంజికీ, కలానికీ, కత్తికీ రోగాలతో పోరాడే శక్తివుంది! కానీ మీలాంటివాళ్లతో పోరాడే శక్తిలేదు! పోరాడ్డం కూడా వ్యర్థమే. నిరూపించబడని నేరాలకు పదేళ్లకు పైగా జైళ్లల్లో మ్రగ్గుతోన్న అనుమానితుల గురించి మీకు తెలియదా? అందులో నేనూ ఒకణ్ణి అవుతా! ఏనాడు ఈ దండకారణ్యంలో ఈ వృత్తిని చేపట్టి కాలు పెట్టానో ఆనాడే ప్రాణాలమీద తీపిపోయింది. నేను ఊహించనిది మీరేం చేయలేరు. మీరేం చేయగలరో నేను ఊహించగలను!" అంటూ మెడికల్ కిట్ తెరిచి దెబ్బలు తగిలిన పిల్లలకు కట్లుకట్టడానికి ఉద్యుక్తుడయ్యాడు.

"పోలీసుల చేతిలో గాయపడినవారికి, పోలీసుల అనుమతిలేనిదే వైద్యం చేస్తే ఏమవుతుందో నీకు తెలుసుగా!" అన్నాడు రెండు చుక్కల యస్.ఐ.

"వైద్యం చేయకుండా మీరు నన్ను ఆపలేరు. నేను వైద్యం చేస్తున్నందుకు మీరేం చేయగలరో అది చేసుకోవచ్చు'' అంటూ బూటు కాలిక్రింద నలిగిన ఒక పిల్లవాడి చేతిగాయానికి మందువేసి కట్టుకట్టాడు సిద్ధార్థ.

"అయినా ఈ దేశపౌరుడిగా, చదువుకున్న వ్యక్తిగా మీరు నమ్మే చట్టం, న్యాయం తెలిసిన వ్యక్తిగా నేను మిమ్మల్ని ఏమీ అడగలేదు. ఎందుకు కొట్టారు? వీళ్లు చేసిన నేరమేమి? అసలు ఏ నేరానికయినా కొట్టాల్సిన అవసరమేమిటి? అని నేను మిమ్మల్ని అడగలేదు. అడిగినా మీ దగ్గర జవాబులేదు! ఇదే సంఘటన మీ జనారణ్యంలో ఏ డాక్టర్లపైనో, లాయర్లపైనో, ఏ కాలేజీ విద్యార్థులపైనో లేదా స్త్రీలపైనో, కార్మికులపైనో చేసి చూడండి! ఏమవుతుందో మీకు తెలియదా? తెల్లారేసరికి ఎంక్వయిరీలు నలుగురి సస్పెన్షన్, బంద్‌లూ, రాస్తారోకోలు, దహనకాండ, లూటీలు... అవునా? ఇక్కడదేమీలేదు. వీరు నోరులేని అమాయకులు. పసిపిల్లల్లాంటివాళ్లు! వీళ్లమీదనా మీ జులుం!" అంటూంటే సిద్ధార్థ గొంతు, ఉద్వేగంతో దుఃఖంతో పూడుకుపోయింది.

"ఎంత ధైర్యంరా నీకు! ఏదో డాక్టర్‌వని ఊరుకుంటే మమ్మల్నే భయపెడ్తావా?"

"సత్యమైన వాక్కుకు ఉన్న శక్తి అది! సత్యవాక్కుకు భయపడనివాడెవడు. సత్యానికి, అహింసకు ఉన్న బలమే అది. అది మీకర్థంకాదు!" అంటూ గాయపడిన గిరిజనులకు కట్లుకట్టడంలో నిమగ్నమైపోయాడు




సిద్ధార్థ.

సిద్ధార్థ చూస్తుండగానే మేస్రం జంగు, కినాకబాలు తాత, తుకారాం, జైతు, షక్రు, మడావిరాము, మరికొంతమంది పడుచువాళ్ల నూ, నడి ఈడువాళ్లనూ వాళ్లూ వీళ్లూ అని చూడకుండా ఆడవాళ్లనూ, పసిపల్లలనూ తప్ప అందరినీ వ్యాన్‌లో ఎక్కించుకొని తీసుకుపోయారు.

ఒక పగలూ, ఒకరాత్రీ ఇంటరాగేషన్ పే రుతో నానా చిత్రహింసలు పెట్టి చివరికి ఎవరేమన్నారో తెలియదు, వదిలిపెట్టారు.

జీవితంలో ఒక్కసారైనా పోలీసు దెబ్బో, ఎక్సైజ్‌దెబ్బో, ఫారెస్ట్‌దెబ్బో, రెవెన్యూదెబ్బో తినని గిరిజనుడు ఉండడంటే ఆశ్చర్యపడే పనిలేదు.

ఎప్పుడూ ఎవరో ఒకరి దోపిడి, దౌర్జన్యాని కి బలియై బతుకుతున్న బతుకులు వాళ్లవి.



బస్సుకోసం ఎదురుచూస్తోన్న డాక్టర్ సిద్ధా ర్థకు దూరంగా బస్సు రావడం కన్పించింది. యశోధర రాసిన లెక్కప్రకారం 'ఈ బస్సుకే రావాలి!' అనుకుంటూ, కూర్చున్నవాడల్లా లేచి బస్‌స్టాప్ దగ్గరకు నడిచాడు. అతని వెంట కనీసం పదిమంది తెలిసిన గ్రామస్తులు న్నారు. డాక్టరుగారి బంధువులు వస్తున్నా రంటే వాళ్ళూ ఆగారు, డాక్టరుగారికి తోడుగా వుండొచ్చు, లగేజీ ఏమైనా ఎక్కువగా ఉంటే మోసుకుపోవచ్చనీ.

జైతు అయితే ఏకంగా ఎడ్లబండే కట్టుకొని వచ్చాడు. వచ్చిన చుట్టాన్ని బండిలో ఎక్కించుకునే పల్లెకు తీసుకుపోదామని.

ఆగిన బస్సులోంచి ప్రియాంక, ఆమె వెనుకే మరో మనిషి కూడా దిగారు. అతడి చేతిలో ఒక పెద్ద సూట్‌కేస్, ఒక ఎయిర్‌బ్యాగూ ఉన్నాయి.

ప్రియాంక చాలా సింపుల్‌గా షల్వార్-కమీజ్ పంజాబీ సూట్‌లో ఉంది. చేతిలో ఒక చిన్న ఎయిర్ బ్యాగ్ వుంది.

అసలు వస్తాడో రాడో, కలుస్తాడో లేదో, కలుసుకోగలనో లేదో, అని నానా సందేహా లతో సతమతమవుతూన్న ప్రియాంకకు సిద్ధా ర్థ కనిపించడం, ఒక్కసారి 'ప్రాణానికి 'హాయి' అన్పించింది. 'హాయ్ సిద్ధార్థ!' అంటూ పలకరించింది.

కళ్ళపైనుండి ముక్కుమీదకు జారిన కళ్ళ జోడును ఎడమచేయి మధ్యవేలితో సవ రించుకొని "హలో యశోధరా'' అంటూ పలక రించాడు.

ఆమె పేరు ప్రియాంక అయితే ఆమెను యశోధర అని సంబోధించడం, ప్రియాంక వెనుకగల భగీరథకు కొత్తగానూ, చిత్రంగానూ అన్పించింది.

"ఈయన భగీరథ! ఎం.ఏ. సోషియాలజీ. ఎం.ఫిల్. అయిపోయింది. ప్రస్తుతం పి. హెచ్ డి. చేస్తున్నారు. 'ఆదిలాబాద్ జిల్లా గిరిజను లు- స్థితిగతులు- జీవనవిధానం' ఈయన ప్రస్తుత టాపిక్!... మిస్టర్ భగీరథా! వీరు డాక్టర్ సిద్ధార్థ, ఎం.డి. జనరల్ ఫిజీషియన్. నాకన్నా నాలుగేళ్ళు సీనియర్. గత రెండు మూడేండ్లుగా ఇక్కడే వుండి ప్రాక్టీస్ చేస్తున్నా రు. అందరికీ నేను ప్రియాంకను. కానీ మా సిద్ధార్థకు నేను యశోధరను!" అంటూ భగీర థకు తన కొత్త పరిచయాన్ని కూడా యిచ్చే సింది.

బస్సులోనుంచి దిగిన ఇద్దరూ డాక్టరుగారి కి కావలసినవారని తెలుసుకున్నాక



ప్రియాంకనీ, భగీరథనీ డాక్టర్ సిద్ధార్థ చుట్టూ వున్న గ్రామస్తులు 'రాం!రాం!' అంటూ పలకరించారు. వారి పలకరింపుకు ఏం జవాబు చెప్పాలో తెలియక భగీరథ బిక్కమొహం వేశాడు. ప్రియాంక పలకరింపుగా నవ్వి చేతులు జోడించింది.

"ఎలా బయలుదేరుతారు! నాకైతే సైకిల్ వుంది! మీకు లగేజీ చాలానే వుంది కాబట్టి మీరు ఎడ్లబండిలో రండి!" అన్నాడు సిద్ధార్థ.

"నా లగేజీ ఎంత? ఈ చేతి సంచీ ఒక్కటేగా'' అని ఇంకా ప్రియాంక ఏదో అనబోతూంటే అందుకున్నాడు డాక్టర్.

"నీ సంగతి కాదు! భగీరథగారి సంగతి! మీరిద్దరూ హాయిగా బండెక్కి తీరిగ్గా రండి! నేను సైకిల్‌పై బయలుదేరుతాను!" అంటూ సిద్ధార్థ దూరంగా చెట్టుకింద పెట్టిన సైకిల్ తెచ్చుకున్నాడు. సిద్ధార్థ సైకిల్ కొంచెం విచిత్రంగా వుంది. కాశ్మీర్‌నుండి కన్యాకుమారి వరకు సైకిల్‌యాత్ర చేసే సైకిల్ మోడల్‌లా వుంది! దానికే ఒక సైకిల్‌పంపు అమర్చబడి వుంది. మధ్య బార్‌కు మెడికల్ కిట్ పెట్టేందుకు అనువుగా క్లిప్స్ వున్నాయి. వెనక, ముందూ ప్రత్యేకంగా అమర్చిన క్యారియర్స్- వున్నాయి. నేటి సైకిళ్ళకు అరుదుగా కన్పించే డైనమోలైటింగ్ కూడా వుంది.

ఎద్దులబండిలో సామానుపెట్టి కూర్చున్నారు ప్రియాంక, భగీరథ. జైతు బండి తోలుతున్నాడు.

"నీకు తెలుగు వచ్చా? ఏం పేరు నీది?" జైతునడిగింది ప్రియాంక.

"జైతు కినాకజైతు. తెలుగు అంతంతనే అస్తది. గొండబాస మాది.తెలుగు నేర్చుకున్నం. గోండి రానోల్లతోని తెల్గులనే మాట్లాడతం" అంటూ ఎడ్లతోక మెలిబెట్టి హుషారుగా బండి అదిలించాడు. బండి వేగంగా ముందుకు కదులుతోంది. బండి సిద్ధార్థ సైకిలును దాటి ముందుకు పోయింది.

భగీరథకు ఈ ప్రయాణం కొత్తగా, ఇబ్బందిగా అనిపించిది. ప్రియాంకకు కొత్తగానూ, సరదాగానూ అనిపించింది. దారిలో మధ్యమధ్య రాళ్ళు, గుంటలు వచ్చినపుడు కుదుపుకు ఒళ్ళు హూనమవుతోంది. భగీరథ ఇలాంటి బండి ప్రయాణం ఎప్పుడూ చేసి ఎరగడు.

దారి సరిగ్గాలేక బండి వేగం తగ్గింది. కాస్సేపట్లో సిద్ధార్థ బండిని చేరుకున్నాడు.

బండి బాట మధ్యలోనుంచి సైకిల్ నడుపుతున్నాడు సిద్ధార్థ. బండి బాట మధ్యలో సైకిల్ వెళ్ళేంత స్థలమే వుంది. తప్పితే అటూ ఇటూ గోతులే వున్నాయి. ఆ దారిలో సైకిల్ నడపడం కూడా ఒక కళే అన్పించింది, భగీరథకు.

బండి ప్రయాణం కాస్సేపటికే ప్రియాంకకీ ఇబ్బందిగా అనిపిస్తోంది. అదీగాక సిద్ధార్థతో సరదాగా గడుపుదామనివస్తే మధ్యలో ఈ బండి ప్రయాణం ఏమిటి? ఇద్దరూ కలిసి సరదాగా నడిచో, లేక సైకిల్‌మీదో వెళ్తే హాయిగా వుంటుందనిపిస్తోంది ప్రియాంకకి. వెంటనే బండిముందు కాస్త దూరంలో సైకిల్ నడుపుతూ వున్న సిద్ధార్థని కేకేసింది.

"ఏయ్! జెంటిల్‌మేన్! కాస్త ఆగుతావా? నేనూ వస్తాను నీతో!" అంటూ బండి దిగేసింది ప్రియాంక.

ప్రియాంకకు సిద్ధార్థతో చాలా చనువుంది. సిద్ధార్థతో కలిసి జీవించాలనీ, అతనితో జీవితం పంచుకోవాలనీ ఆమె అభిలాష. ఆమె తన అభీష్టాన్ని తెలిపి రెండు సంవత్సరాలవుతోంది. అయినా సిద్ధార్థ పడనీయడం లేదు. అదీగాక ఈ యేడే ప్రియాంక హౌస్‌సర్జన్ చేస్తోంది. ఇంకొక నాలుగు నెలల్లో అదికాస్తా అయిపోతే, సిద్ధార్థతోనే కలిసి ఈ గిరిజన ప్రాంతాల్లో అతడి తోడునే స్వర్గంగా గడుపుతూ బతకాలని ఆమె కోరిక.

సిద్ధార్థ ఒక నిశ్చల జలాశయం!

ప్రియాంక గలగలాపారే సెలయేరు!

ప్రియాంక ఒక్క సిద్ధార్థ సన్నిధిలోనే సెలయేరు. మామూలుగా వుంటే ఆమె గంభీరమైన మనిషే.

సిద్ధార్థను రకరకాల పేర్లు పెట్టి పిలుస్తుంది. అప్పుడే 'ఏమండీ' అంటుంది, అప్పుడే 'యంగ్‌మేన్' అంటుంది. బుచ్చిబాబు, బాబు, జెంటిల్‌మేన్, హేండ్‌సమ్ గై, బుద్ధుడు గారూ, ఇలా సమయానికి తగ్గట్లు అప్పటికప్పుడు అతనికో టైటిల్ ఇచ్చి మాట్లాడటం ప్రియాంక ప్రత్యేకత.

ప్రియాంక ఏమన్నా సిద్ధార్థ పట్టించుకోడు. సరదాగానే తీసుకుంటాడు. "నాకూ నీలాగే ఉండాలని ఉంటుంది యశోధరా! కాని నేనెందుకో ఉండలేను" అంటే-

"సర్లెండి! ఒకరు బొమ్మ, ఒకరు బొరుసు! ఒకరు అలా...! ఒకరు ఇలా...! ఉండాలి. లేకపోతే జోగీజోగీ... అయితే తెలుసుగా! అలా అవుతుంది. మీరు మీలాగే ఉండండి చాలు! అప్పట్లో ఆ యశోధర తెలిసీ తెలియక ఆ సిద్ధార్థుణ్ణి అంతఃపురంనుండి అడవుల పాలుకానిచ్చింది. కాని మీ యశోధర అడవుల్లో కూడా మిమ్మల్ని వెన్నంటే ఉంటుంది. మీకోసం ఈ యశోధర ఈ జనారణ్యాన్ని వదిలి దండకారణ్యం వస్తుంది'' అంటూ రెండేళ్ళక్రితమే భవిష్యత్తును విప్పి చెప్పింది.

"ఏమిటి యంగ్‌మేన్! ఆగమంటే, ఒకటే సైకిల్‌పై పరుగులు పెడుతున్నారు'' అంటూ సిద్ధార్థను చేరింది ప్రియాంక.

"బండిలో హాయిగా కూర్చోక, కాలినడకన ఎందుకు చెప్పు. అదీగాక మనం వెళ్ళే ఊరు ఇంకా చాలా దూరం వుంది. అంతదూరం నీవు నడవలేవు'' అన్నాడు.

"నడిచి ఎందుకు వెళ్ళడం. ఇద్దరమూ సైకిల్‌పైనే వెళ్దాం"

ప్రియాంక ముందురాడ్‌పై కూర్చుంది. ఇద్దరూ సైకిల్‌పై బయలుదేరారు. ప్రియాంక

తల సిద్ధార్థ ఛాతీకి తగులుతోంది. ప్రియాంకకు రెండువైపులా సిద్ధార్థ బలమైన చేతులు, ఉండీ లేనట్లు, తగిలీ తగలనట్లు, మధ్య తను. ఆ మాత్రం సాన్నిహిత్యానికే ప్రియాంక మనస్సు పులకించిపోయింది!

"మా అమ్మా నాన్న ఎలాగున్నారు!" హఠాత్తుగా అడిగాడు సిద్ధార్థ.

"రావడంతోనే చెప్దామనుకున్నాను. వాళ్ళు క్షేమమేనని! కాని నీకై నీవే అడగనిది చెప్పడం దేనికని, అదీగాక నువ్వు వారి గురించి అడుగుతావా లేదా అని ఇంతసేపూ చెప్పలేదు. నిన్న కూడా వెళ్ళి మీ అమ్మా, నాన్నగార్లను కలిసి మరీ వచ్చాను. మీ నాన్నగారు నీ వైద్యం ఖర్చులకని ఒక చెక్ ఇచ్చారు. మీ అమ్మగారేమో నిన్ను మచ్చిక చేసుకొని, మూడు ముళ్ళు వేయించుకోమని నన్ను పంపించారు''

"చూడు యశోధరా! నా జీవితలక్ష్యం నేను నిర్ణయించుకున్నాను. అందుకు కన్నవాళ్ళనే కాదని ఇక్కడకు వచ్చాను. ఈ రెండేళ్ళలో ఏక్షణంలోనైనా నా లక్ష్యంమీద నమ్మకం పోతే వెంటనే తిరిగిపోదామని అనుకున్నాను. కానీ ఏనాడూ అలాంటి పరిస్థితి రాలేదు. నేను చదివిన చదువు, నా వైద్యం ఈ గిరిజనులకు సంపూర్ణంగా అందించగలిగితే అదే నా జీవితంలో పెద్ద సంతృప్తి''

"ఇంత గొప్ప లక్ష్యం గల వ్యక్తి నా వాడంటే, ఆ లక్ష్యంలో పాలుపంచుకునే అవకాశం నాకూ వుందంటే, ఎంతో ఆనందంగా వుంటుంది'' అంటూ తల పైకెత్తి సిద్ధార్థ ముఖంలోకి చూడబోయిన ప్రియాంకకి అతని చుబుకం నుదుటిని తాకింది. మళ్ళీ తానే అందుకుంది,

"చదువు, డబ్బు, అందరికీ వుంటాయి. కానీ ఈ సేవాభావం లక్షల్లో ఒకరికి కూడా ఉండవు. అని గర్వంగా చెప్తుంది మీ అమ్మగారు! జీవితాంతం ఒక ఉన్నత లక్ష్యంతో ఇల్లు విడిచి వెళ్ళిన నా కొడుక్కి నీ చేయినందించి సహకరించు. ఆ అడవుల్లో నీ సాహచర్యం వాడికెంతో అవసరం. వీలయినంత తొందరగా వాణ్ణి ఒప్పించి, ఆ మూడు ముళ్ళూ వేయించుకో అంది మీ అమ్మ!" అంటూ ముగించింది ప్రియాంక.

ఇంత చెప్పినా సిద్ధార్థ ఏమీ మాట్లాడలేదు. సిద్ధార్థ తన చుబుకాన్ని ప్రియాంక తలపై ఒకింత ఆనించాడు. ప్రియాంక తన తలను వెనక్కి వాల్చి సిద్ధార్థ గుండెలకు ఆనించి కళ్ళు మూసుకుంది.

భగీరథ బండిలో కూర్చుని దారిలో కన్పించే ప్రతి పంటను అడిగి తెలుసుకుంటున్నాడు. అతడికి ఆసక్తి కలిగించిన దారికిరువైపులా గల చెట్ల పేర్లను కూడా అడిగి తెలుసుకుంటున్నాడు. ఏమీ మాట్లాడక మూగిగా కూర్చుంటే ప్రయాణం మహావిసుగ్గా ఉంటుంది.

"ఆ దూరంగా కన్పించే ఊరు పేరేంటి?" అడిగాడు భగీరథ.

"అది గూడా మా గోండు గూడెమే. పేరు పొర్సుగూడ"

చూస్తూండగానే బండి పొర్సుగూడా పక్కగుండా సాగిపోయింది. అన్నీ గడ్డిగుడిసెలే. గుడిసెలమీదకు పాకించిన రకరకాల చెట్ల పాదులు- బీర, సొరకాయ- రాచగుమ్మడి, బూడిద గుమ్మడి, అనపకాయ, చిక్కుడు, ఏ గుడిసెపై కూడా గడ్డి కనిపించడంలేదు. అన్ని గుడిసెలు చెట్ల ఆకులు, తీగలతో కప్పబడి ఆకుపచ్చగా ఉన్నాయి. అన్ని పాదుల్లో చిక్కుడు అనపపాదులు ఎక్కువ కన్పించాయి భగీరథకు.

"ఇన్ని కూరగాయల చెట్లు పెట్టారు. మార్కెట్‌కు పంపుతారా ఈ కూరగాయల్ని. పండ్ల చెట్టు ఒక్కటి గూడా కన్పించడంలేదు''

"అంగడికి పంపము సారూ! మాకు తినతందుకే మస్తయితయి. అంతగనం ఏము




న్నాయి సార్. గుమ్మడికాయలతోని బెల్లం కలిపి బజ్జీలు, పాసం చేసుకుంటం, ఇగ చిక్కుడు, అనపకాయ కూరకయితయి. అడీలకు పోయినపుడు నీళ్లకు బుంగలవుతాయి గీకాయలు. ఆ కొట్టంమీద సూడుండ్రి సార్! ఎన్ని ఆనకాయలున్నయో యిరగ కాసింది. ఆ కులమే అంత. కాస్తే జానెడు కొకకాయ కాస్తది, లేకుంటే ఉత్తదే!

"నీకెంత భూమి ఉన్నది జైతూ!" భగీరథ.

"నాకు భూమిలేదు సారూ! రెక్కల కష్టంమీదనే బతుకుడు. భూమి ఉండె ముందు. కాని మా అయ్య అంత పోగొట్టిండు. ఇప్పుడేం లేదు''

"మరి గీ బండీ, ఎద్దులూ... ఇవి నీవి కావా?"

"కావు సార్! మా జంగుదాదాయి! ఈ డాక్టర్ సాబ్ అంటే మా జంగు దాదాకు లావు ప్రేమ! ఇయ్యాళ బస్సుల మందుడబ్బాలు అచ్చేటియి. ఆ బస్సు మీకన్న ముందే అచ్చింది. మందులు రాలేదు ఎల్లిపోదమనుకున్న. డాక్టరుసాబు దోస్తులు అస్తున్నరని, బండిల తోల్కపోవచ్చని ఆగిన!" భగీరథ మిగతా విషయాల గురించి అడగకముందే సిద్ధార్థ గురించి చెప్తున్నాడు జైతు.

"డాక్టర్‌సాబ్ లావు మంచిమనిషి. మా ఒక్క ఊర్లేనేగాదు ఈ పట్టి మొత్తం డాక్టర్ సాబంటే ప్రాణమిస్తరు. ఆ అయ్య ఒక్క గీత గీసిండంటే సాలు, పానం బోయినా ఆ గీత దాటరు. అంత భరోసా మా మందికి. ఎవల్లకు ఏమైనా ఉరికస్తడు. దినం, రాత్రి, సూడడు! ఈ డాక్టర్ సాబచ్చినంకనే మా వోళ్ళందరికి ఏం రోగమచ్చినా బిన్‌ఫికరయింది. లేకుంటే పానం బోంగ నోరు దెరుసుకొని సూసుడే వుండె! మల్ల గింత జేసినా ఒక్క పైసదీస్కోడు. ఏ తల్లి గన్నదో గిసుంటి బిడ్డను. ఆ తల్లికి పొద్దుగాల్ల లేసి దండంబెట్టాల!" ఎంతో భక్తిగా, హృదయంలోంచి మాట్లాడుతున్నాడు జైతు.

జైతు మాటలతో సిద్ధార్థ అంటే ఏమిటో అర్థమయింది భగీరథకు. ప్రియాంక ప్రయాణం మధ్యలో చాలానే చెప్పింది సిద్ధార్థ గురించి, కాని ఆ పరిచయం సమగ్రం అనిపించలేదు భగీరథకు. ప్రియాంక సిద్ధార్థ ప్రేమికురాలిగా ఇప్పుడు జైతు చెప్పిన సంగతులేవీ చెప్పకపోవడం, ఒకరకంగా ఆమె గొప్పతనం అన్పించింది భగీరథకు. డాక్టర్ సిద్ధార్థ అంటే సిటీలో ప్రాక్టీసు నడవక, పల్లెల్లో దండిగా డబ్బు సంపాదించడానికి వచ్చిన మనిషేమో అనుకున్న భగీరథ సిగరెట్ త్రాగుతూ, తనకి తాను గిల్టీగా ఫీలవుతున్నాడు.

"అగో! ఆ గుట్ట దగ్గిర కన్పిస్తున్నది మా గూడెమే సారూ! అల్లిగూడెం అంటరు!" జైతు చూపించినవైపు చూశాడు భగీరథ.

"మరి ఆ గుట్ట దగ్గర, అక్కడ నాలుగు, ఇక్కడ నాలుగు గుడిశెలున్నాయి?"

"అన్నీ అల్లిగూడెం కిందనే లెక్క. మాది పెద్దగూడెం. మిగిలినయన్నీ దగ్గరి దగ్గరిగానే ఉన్నయిగదా! మా గూడెంల కేకగొడ్తే అన్ని గూడేలకు ఇనిపిస్తది. ఎక్కడ చేండ్లు ఉన్నోళ్ళు అక్కడ్నే నాలుగు గుడిసెలేస్తరు. అదొక గూడెమయితది''

"మరి ఆ గుట్టమీద పొలాలు కన్పిస్తున్నాయి. అవి గూడా మీవేనా?"

"ఆవు! మా తాత ముత్తాతలు గట్ల గుట్టల మీదనే ఎగుసాయం జేత్తుండ్రి! దాన్ని 'పోడు' ఎగుసాయమంటరు. పోడు ఎగుసాయం జేయతందుకు గీ ఎడ్లూ, నాగలి, పలుగూ పార ఏమీ పట్టయి. మూడు జానల ఇనుప కర్రు చేతుల వుంటే సాలు'' జైతు చెప్పేది వింతగా వింటున్నాడు భగీరథ.

"ఇప్పటికీ మావోల్లు అదే జేస్తరు. 'ఎస్కి' ఆనలు పడంగనే, అడివిలగా సెట్లునరికి, అగ్గివెట్టి కాలవెట్టేస్తరు. ఆ భూమిని యింత కర్రుతోని తవ్వేసి యిన్ని నువ్వులో, జొన్నలో,

మక్కల్లో, కందుల్లో ఏవో గిన్ని తిండిగింజలు ఏస్తరు!"

"మరి ఆ పంటకు కలుపూ, ఎరువులూ..."

"అవేం ఉండయిసారూ! అంతా ఆ దేవుడి దయనే! మల్లా కోతల యాళ్ళకు పోయి పంట తెచ్చుకునుడే వుంటది!"

"అలా చేస్తే పండుతుందా పంట! కాపలా గూడా అక్కర్లేదా!"

"పండుతది, పండిన కాడికి! లేకుంటే ఎండుతది! సెప్తున్నగది మా గొండదేవుడి సాధీనం. మామీద దేవుడికి కోపం లేకపోతే పంట యిరగపండుతది. పంట ఇరగబండిన సాలు దేవుడికి మల్లా బలి ఇయ్యవడ్తది''

"బలి ఇస్తారా? ఏ జంతువును బలిస్తారు? మేకలా? దున్నలా?"

"గా మేకలు, దున్నలు గాదుసార్! ఇస్తే మనిషినే బలిస్తరు. అయితేనే మా దేవుడు మల్ల అచ్చే సాలుకు దయ జూపిస్తడు! గాని గీ జమానల బలి ఇయ్యతందుకు మనుసులు యాడ దొర్కుతరు! అనుడేగానీ, కండ్లతోటి నేను గూడా జూల్లే!

"అంటే బలి బందయిపోయినట్లేగదా ఇప్పుడు''

"ఎక్కడ బందయింది, ఆడ ఆడ ఇన్పిస్తనే వుంటది. మొన్న పోయిన కార్తీకంల. ఇదే నార్యూనర్‌ల సేండ్లకుసుండి, బీడి తాగెటోన్ని, నలుగురు మనుషులొచ్చి, గోనెసంచిలేసి ఎత్కపోతందుకు జూసింద్రట! ఆడి కిస్మత్ మంచిగుండి బతికిపోయిండు!"

"ఎలా బతికిపోయాడు! బలి దగ్గర్నుంచి తప్పించుకున్నాడా?"

"ఆడు దప్పించుకోలే! దేవుడే గా కంకల రూపంల అచ్చి ఆన్ని బతికిచ్చిండు.

"కంకలంటే ఏంటి?" భగీరథకు అర్థంకా లేదు. జైతు నవ్వి అన్నాడు.

"ఆవ్! సయిమాటనే! మీకు దెల్వది గదా? గీ ఎడ్లు గొంచెం ముదిరిపోతేనేమో ఎడ్లంట రు. ఇది పడుసుదనం తోటి వుంటే కంక లంటరు! అయితే- ఆ మనిషిని పట్టి గోనె సంచిల ఏస్కొంగ బగ్గ-లొల్లివెట్టిండు. ఆడ మేస్తోన్న ఆ జీవరాసులకు ఎట్ల దెలిసిందో ఏమో, ఏమనుకున్నయో, ఒక్క దుమ్మున రెంకలు గొట్టుకుంట అచ్చి ఆ నలుగురిమీద పడ్డయ్యట! ఇగ జూసుకోండ్రి! పడుకుంట, లేసుకుంట ఉరుకుడు వెట్టింద్రట! నోరులేని బసవన్నలు- నలుగురిని ఎట్ల పారగొట్టి నయి! ఒక మనిషి పానం దక్కిచ్చినయి!" జైతు పారవశ్యంతో ఆ సంఘటనని వివరించా డు.

భగీరథ ఆలోచిస్తున్నాడు. ఈ ఆధునిక యుగంలో కూడా ఇంకా సాటి మనిషిని అమానుషంగా బలిచ్చే సంస్కృతి కొనసాగు తోందా?

"బలి ఇయ్యతందుకు గూడా ఓళ్ళనంటే ఆళ్ళను పట్టుకుపోరు సార్! ముసలోళ్ళు, కుంటోళ్ళు, గుడ్డోళ్ళు గిసుంటి మనుషుల్ని కాదు! మంచిగ హట్టకట్ట ఉండాల! అంటే నీతిరంగ, నాతిరంగ మంచిగుండాల! అయి తేనే మెచ్చుతరు!"

పరోక్షంగా 'నీవు బలికి పనికి వస్తావు' అని చెప్పినట్లయింది భగీరథకు! ఒళ్ళు గగుర్పొడి చింది! జైతుకు ఒక సిగరెట్టు వద్దంటున్నా ఇచ్చి, తనూ ఒకటి ముట్టించాడు!

డిసెంబరు నెల! పొద్దు పడమటిదిక్కు వాలిపోగానే, చల్లని గాలి వీయసాగింది!

బండి చిన్నచిన్న గూడేలు దాటుకొని, అల్లిగూడెం చేరింది. బండిలో నల్లకళ్ళద్దాలు పెట్టుకొని కూర్చున్న కొత్తమనిషిని చూడగా నే, అక్కడక్కడ వున్న పిల్లలు బండివెనక పరిగెత్తుకుంటూ కేకలు వేసుకుంటూ వస్తు న్నారు. ఇలాంటి మొహాలు వాళ్ళకి వింత! ఆ పిల్లల్లో సగంమంది పూర్తి దిగంబరంగానూ మరికొంతమంది నిక్కరులాంటిది తొడు క్కొని మరికొంత మంది పై అంగీ మాత్రమే వుండి నిక్కరులేని వాళ్ళూ ఉన్నారు. అందులో శరీరం నిండా పూర్తిగా బట్టలేసుకు






న్నవారు మాత్రం ఒక్కరూ లేరు!

భగీరథ బండిలోనుండే పరిసరాలను గమనిస్తున్నాడు. ఏ ఇంటిముందు చూసినా పెద్దపెద్ద వాకిళ్ళు. ఒక్కోవాకిట్లో పశువులను కట్టేసేందుకు పాతికవరకు గూటాలున్నాయి. వాకిళ్ళలోనే ఒక మూలగా వెదురు టేకు కర్రలతో ఆరడుగుల ఎత్తున వేసిన మంచె లాంటి దానిపై పొందికగా అమర్చిన గుమ్ము లు, గాదెలు ఉన్నాయి. గాదెల్లోని ధాన్యం తడవకుండా వేసిన గడ్డిపైకప్పు ఎంతో కళా త్మకంగా కన్పిస్తోంది భగీరథకు.

ఇంటి చూర్లకింద అరుగులు చింతబూడి దతో నున్నగా అలికి వున్నాయి. అందరి ఇళ్ళముందు వెదురుకంపతో నాటిన దడి ప్రహరీలు గజిబిజిగా ఉన్నాయి. ఓ ప్రక్కన దారికోసం గడులు గడులుగా వున్న తలుపు. పనగడి బిగించి వున్నాయి. అన్ని ఇళ్ళూ దాదాపు ఒక్కలాగే వున్నాయి. రాత్రిళ్ళు ఇంటిముందు రాజేసిన నెగళ్ళ తాలూకు బూడిద కుప్పలు. సగం కాలిన మొద్దులు. ఇంకా పొగవస్తున్నాయి. ఆ బూడిద కుప్పలో నుండి నిప్పురవ్వలను వెదికి, పిడకలమీద వేసుకొని, సాయంత్రం పొయ్యి రాజేయడానికి తీసుకువెళ్తున్నారు కొందరు స్త్రీలు.

గోధూళి వేళ! సంజ చీకట్లు ముసురుకోబో తున్నాయి. మేతకు వెళ్ళిన పశువుల మంద లు- గొర్రెలూ, మేకలూ బిలబిలమంటూ ఊళ్ళోకి పరుగెత్తుకొని వస్తూ బండికడ్డం పడుతున్నాయి.

కడుపునిండా మేసి ఇంటికి తిరిగిచ్చిన పశువులు, ఇక గూటాలముందు ఢకవేయడ మే తరవాయి అన్నట్లుగా, క్రమశిక్షణ గల సైనికుల్లా దేని గూటం ముందు అదే, నిలబ డ్డాయి. ఒక్కో ఇంటిముందు ఒక్కో దృశ్యం.

ఒక గడ్డి గుడిసెముందు జైతు బండి ఆపి, పగ్గాలు ముందుకు వేసి, ఎగిరి బండిదిగు తూ, "మన ఇల్లు ఇదేసార్! ఇంక మీరు

దిగుండ్రి!" అంటూ బండిలోగల పెట్టె, సంచీ అందుకొని గుడిసెలోనికి నడిచాడు.

బండి చప్పుడు విని, ప్రియాంక, సిద్ధార్థ బయటకువచ్చారు. అంతకుముందే వచ్చిన వాళ్ళు, మొహాలు కడుక్కొని ఫ్రెష్‌గా తయారయ్యారు.

"రండి! ఇలా వెళ్ళి ఆ గోలెంలో నీళ్ళున్నాయి. కాళ్ళు కడుక్కొని రండి!

మీకోసం వేడివేడి టీ తయారుగా వుంది!" టీని జైతుకు ఒకగ్లాసులో వంచిస్తూ అంది ప్రియాంక. టీ మాట వినేసరికి భగీరథకు ప్రాణం లేచివచ్చినట్లయింది. తొందరగా వెళ్ళి మొహం, కాళ్ళూ కడుక్కొని వచ్చి గ్లాసందుకున్నాడు.

  

ఉదయమే డాక్టర్ సిద్ధార్థ సైకిల్ వేసుకొని ఎటో వెళ్ళిపోయాడు. ప్రియాంక వంట ప్రయత్నంలో ఉంది. తక్కువ సామానుతో సుఖవంతమైన ప్రయాణం ఎలా చేయవచ్చునో ఆమెకు తెలుసు. కాని తక్కువ వెచ్చాలు, దినుసులతో, పాత్రలతో రుచికరమైన వంట ఎలా చేయాలో తెలియక ఆ చిన్న గుడిసెలో ఆమె తికమకపడుతోంది.

భగీరథకు రాత్రి మాంచి నిద్రతో అలసట పూర్తిగా తీరిపోయింది. వచ్చిన పని తొందరగా ముగించుకుంటే ఈ పరిసరాల్లోంచి తొందరగా వెళ్ళిపోవచ్చనే భావన వచ్చిన తెల్లారే వచ్చింది. అందుకని గబగబా అన్ని పనులూ ముగించుకొని, తను వచ్చిన పని ఎలా మొదలుపెట్టాలా అని ఆలోచిస్తోంటే ఎదురుగా జైతు వచ్చి నిలబడ్డాడు.

"రాంరాం సార్! డాక్టర్‌సాబ్ మిమ్మల్ని ఊళ్లెకు తీస్కపొమ్మన్నాడు. మీకు ఎవల్లగురించి కావాల్నంటే ఆల్లగురించి అన్ని సంగతులు జెప్పమన్నడు. మీరు పోదమంటే ఎల్దాము!" అన్నాడు జైతు.

"నీకోసమే అనుకుంటున్నా! నువ్వే వచ్చావు. ఊళ్లో గిరిజన కుటుంబాల గురించి పరిచయం చెయ్యి! పోదామా!" అంటూ బయలుదేరాడు.

పోదామన్నట్లుగా ముందుకు కదిలాడు జైతు.

భగీరథ జైతును అనుసరించాడు.

ఉన్నది ఊళ్లోనే కాబట్టి యాభయి గజాల దూరం వెళ్లేసరికి అక్కడ చుట్టుపక్కల ఇళ్లవాళ్లకు జైతు గోండీభాషలో ఏదో చెప్పాడు. చూస్తుండగానే నలుగురు అయిదుగురు మగవాళ్లు ఇండ్లలోంచి బయటకు వచ్చారు.

జైతు ఒక మంచం తెచ్చి భగీరథను కూర్చోబెట్టాడు. అక్కడికి వచ్చేవాళ్లంతా వస్తూ వస్తూ తలకి ఏదో ఒకటి చుట్టుకుంటూ వస్తున్నారు.

అతిథులకు తలమీద ఏమీ లేకుండా స్వాగతం పలకడం గోండుల సాంప్రదాయం కాదు! వచ్చింది డాక్టరుగారి బంధువని గుర్తించారు! అందుకని మర్యాదపూర్వకంగా రావడంతోటే భగీరథకు "రాంరాం" సార్ అంటూ దండంపెట్టారు.

జైతు కూడా అందరికీ "రాంరాం" అంటూ చేతులు జోడించాడు. భగీరథ కూడా తనకు తెలియకుండానే అందరికీ రాంరాం అంటూ చేతులు జోడించాడు.

తమ మగవాళ్లు ఇళ్లలోంచి బయటకు తలపాగాలు చుట్టుకొని రావడంతో విశేషమేమిటో అని ఆడవాళ్లు గుమ్మాల్లో నిలబడి కొందరు, దడుల వెనక నిలబడి కొందరు చూస్తున్నారు. పిల్లలు కూడా ఆసక్తిగా, కొత్త వ్యక్తిని పరికించి పరికించి ప్రతి కదలికను పరిశీలిస్తున్నారు. ఒక్కొక్కరి పరిచయాలయ్యాయి. అందరినీ జైతు భగీరథకు పరిచయం చేశాడు. అందరి పరిచయాలయ్యాక మేస్రం జంగు అక్కడికి వచ్చాడు.

"రాంరాం సార్! నాపేరు మేస్రం జంగు. ఇదే ఊల్లె ఉంటం. పొద్దుగాల జైతు చెప్పిండు! మీలు మా గురించి ఒక పుస్తకం




రాస్తున్నారని! రాయింఁడ్రి మాకు దెలిసింది జెప్తం!"

అంతవరకూ మౌనంగా తునికాకుల తంబాకు నింపుకుంటున్న కినాకబాలు మెల్లగా నోరెత్తాడు.

"కితాబు రాసుడు మాటనా ఇది! రాయింఁడ్రి... మామీద మస్తుమంది కితాబులు రాసింఁడ్రు. ఇనాములు పొందింఁడ్రు. మీరూ రాయింఁడ్రి! మీకూ ఏదన్నా ఇనాము దొర్కుతది. యెనకటికి హైమండారపు దొర కూడా గిట్లనే మామీద మస్తు కితాబులు రాసిండు. ఆ దొర గూడ గిట్లనే ఊరూరు తిరిగి, మందితోటి మాట్లాడి, అడిగి ఏమేమో రాస్కపోతుండెనట! అది ఇప్పుడా అప్పుడా నలభై ఐదేళ్ల కిందటి మాట! మల్లమల్ల రాసుడెందుకు. ఎందరు జెప్పినా, ఎన్నిమాట్ల చెప్పినా అదే మాట! అడివిల బుట్టి అడివిల బెరిగిన మా బతుకులు తమామ్ అన్యాయమైపోయినయ్''

భగీరథ కినాకబాలు మాటలను శ్రద్ధగా వింటున్నాడు. మిగతావారు కూడా నిశ్శబ్దంగా ఉండి బాలు చెప్పేదానికి అప్పుడప్పుడు వంతపలుకుతున్నారు.

"తుర్కరాజులకెల్లి మా కష్టాలు సురూ అయినయ్. అప్పట్నుంచి మాకు సుకమేలేదు. అడివిల ఉండుడు, అడివిమీద సెయ్యేసుడు 'ఖానూన్ ఖిలాఫ్' అన్నరు. ఇగ ఊర్లు వట్టినమ్. ఊల్లెగూడా అప్కారోల్ల, తాసీలోల్ల జులుంలు జూస్తిమి! సేట్ల, సౌకార్ల జులుం జూస్తిమి! జంగ్లతోల్ల జులుం జూస్తిమి! పోలీసోల్ల జులుం గూడా జూస్తిమి! మామీద జులుం చెయ్యనోడు ఎవడు? మమ్ములను సుఖంగా బతుకనిచ్చినోడు లేడు. గప్పుడెప్పుడో మా మందికాయి నిలబడి మాట్లాడిండని మా భీముని సుట్టుముట్టి సంపేసిరి. మొన్నగా ఇందర్‌వెల్లిల ఉత్తుత్తగనే అంగడినాడు చానామందిని పిట్టల్ని కొట్టి సంపినట్టు సంపేసిరి. ఇగ ఇప్పుడు! మాకేమన్నా మంచిగజేస్తమన్న గీ 'పొలగాండ్ల'ను వట్టుకొని మన్నుజెయ్యవట్టిరి. మాకిస్మతే ఖరాబున్నది'' కాసేపు ఆగి, తిరిగి అన్నాడు. "ఒకప్పుడు మేం ఎక్కడుంటే అక్కడ గొడ్లు, గోదా, భూములు, పంటలు, పండ్లు, కాయలు, పూలూ, నీళ్లూ దేనికీ తక్కలేకుండే! కరువు అన్నదే ఎర్కలేదు మాకు!

మరి ఇయ్యాల! ఇయ్యాల మాకేంలేదు! ఒక్క చెట్టుమీద 'సత్తా' లేదు. గుటికెడు సారా తాగుదామన్నా పైసలే! ఒక పండుగ లేదు, పబ్బంలేదు. ఏదో గిట్ల బతుకుతున్నం. రాస్కోండ్లి సార్! రాస్కోండ్లి! ఏ దయగల మారాజైనా చదివితే మా కష్టాలు తీర్తయేమో!" అంటూ తన డెబ్బైఏండ్ల జీవితంలోని చీకటి వెలుగులను ఒక్క ఊపులో చెప్పుకొచ్చాడు కినాకబాలు నిరాశగా.

"ఇప్పుడు మీలో ఎంతమందికి భూమి లేదు చెప్పండి!" అడిగాడు భగీరథ.

చాలా సామాన్యమైన ప్రశ్న వేశాడు భగీరథ. కానీ సామాన్యమైన ఆ ప్రశ్నకు అసామాన్యమైన ప్రశ్నను జవాబుగా చెప్పుకొచ్చాడు కినాకబాలు.

"సార్! గోండోన్ని! తెల్వక అడుగుతున్న. ఏమనుకోకండ్లి! మీలు మా మనిషని అడుగుతున్న. మనిషి భూమిని తల్లికడుపులకెల్లి తీస్కొని పుడతాడా? లేకుంటే ఆ పుట్టినోని తల్లికో, తండ్రికో భూముంటే అన్దయితదా! ఇదొక దొడ్డుమాట! ఇది అట్లా ఉండనీయండి!

ఈ ప్రపంచంల గింత భూమి ముందులేదు! మెల్లమెల్లగ అయిందట గదా! అట్లనే ముందుగాల్ల ఇంత భూమిలేదు! అంతా అడివే. మాలాంటోళ్లు అడివిల ఉండి, అడివిని నరికితే ఈ భూమి గిట్లయింది.

ఎక్కడన్నా భూమి గొండోనికో, కావోనికో, యింకోనికో - భూమ్మీద ఆరుగాలాలు కష్టపడిటోడి దయితది కానీ భూమి మీలాంటోళ్ల దెట్లయితది!

మీ తాత ముత్తాతల తాతలనుంచి మీ పనే యేరుగదా! అరకవట్టుడు, ఎద్దుగుద్ద

వొడుసుడు, పెంటదీసుడు మీకేం ఎరుక. మరి అసుంటప్పుడు ఇయ్యాల ఈ భూమి అంతా యీల్లదెట్టయితది!

ఎండల ఎండి ఆనకు తడిసి బురదనక, పెండనక బురదలపామ్మై, పెండలపురుగై బతికే మా భూమి మీ సేతులకెట్లచ్చింది?

ఇంకొక దొడ్డుమాట! సదువుకున్నోళ్లని అడుగుతాన్న! కొన్నొద్దులకు గట్లనే అయితది అంటే, సరే ఇనుకుంట! కొన్నొద్దులకు మా భూమి మీ సేతులకొస్తే మా సేతుల నాగలి, పలుగూ, పార మీ సేతులకు రాలేదెందుకని? ఒక్క భూమే మీ చేతులకచ్చింది ఎందుకో? భూమి ఒక్కటే మీది! మల్లా కష్టపడుడు మేమే'' చాలా నాటకీయంగా, హత్తుకునేట్లు గా చెప్తున్నాడు బాలు.

"అటు ఏడు తరాలు, ఇటు ఏడు తరాలు ఎన్నడూ బురదల కాలువెట్టనోడికి, ఎన్నడూ అరక వట్టనోడికీ ఏయిల ఎకరాల భూమి ఆన్ది కాకడేంది!

పుట్టి బుద్ధెరిగినప్పటినుండి, మన్నుల పుట్టి, మన్నుల పెరిగినోడికి నేడు భూమి లేకపోవుడేంది?

మా తాతల తండ్రులపుడు గిన్ని కానూన్ లు లేవు! ఇప్పుడంతా కానూన్ల బతుక యింది. ఆళ్లు అడివి హద్దుకే నీళ్లస్తలం జూసుకొని ఉండెటోళ్లు. అడీల దొరికిన కాయ, పండు, కసరు ఏది దొరికితే అది తిని బతికినమ్. అడివి మాది! అడివి అందరిదీ! గుట్టలమీద పోడుజేసుకొని బతికినమ్. అప్పుడు ఇంతకన్నా సుఖంగా వున్నం. ఇప్పుడు గొండోడు కాలు ముందుకు ఏస్తే కానూన్! చెట్టుమీద చెయ్యేస్తే కానూన్! నీయవ్వ! గీ కానూన్ల నోట్లె నా ఉచ్చ!" అంటూ తుపుక్కున ఉమ్మేశాడు కినాకబాలు!

భగీరథ ఏం జవాబు చెప్పాలో తెలియక సంధిగ్ధంలో పడ్డాడు.

"ఆ మాటకేందే తాతా! నువ్వు అన్నీ తెలిసి గిట్ల మాట్లాడుడేంది? మన కష్టాలు ఈ బాబుకు చెప్తే యీ బాబేం జేస్తడు. అయినా ఒకణ్ణి అడుక్కునేకాలం పోయింది!"

"ఉత్త మాటలల్లనేరోయ్! సూస్తనేవున్నం! ఇంక ఇప్పుడే సావను నేను! అదీ జూస్త! ఏం జేస్తరో!" అన్నాడు కినాకబాలు ముసలిరక్తం ఉడుకెత్తిపోతుంటే!

కినాకబాలు తాత మాట్లాడిన భూమి పుట్టుక, దాని సాగు, కర్తృత్వం యివన్నీ అంత సులభంగా తీసివేయదగిన ప్రశ్నలు కావు అనిపించింది భగీరథకు.

"ఇప్పుడు భూమి లేకుండా కూలికి నాలికి పోయేవాళ్లెవరున్నారిక్కడ!" అడిగాడు భగీరథ.

భూమిలేనివాళ్లంతా ముందుకొచ్చారు. కొట్నాక రఘు, సోము, మేస్రం సహదేవు, ఆత్రంకాశీరాం, కినాకభీము, ఇస్రు, తొడసంబలిరాం వీళ్లెవరికీ సెంటుభూమి లేదు.

"మీ ఎవ్వరికీ అసలు భూమిలేదా? ఉంటే ఎక్కడన్నా వదిలి పెట్టి వచ్చారా?"

"ఎప్పుడో మా తాతలప్పుడు ముప్పయి నలభై ఏండ్లకింద మాకు భూమి ఉండె. మా తండ్రులు జెప్తుండిరి. అంతా పోయింది. ఇప్పుడేంలేదు. రెక్కల కష్టంమీద బతుకుతున్నం!" చెప్పుకొచ్చాడు మేస్రం సహదేవు.

"నాకు బుద్ధి తెలిసినప్పుడు, మా భూమి ఉండె సుద్దగూడెంల. బాకీకింద తురుకోనికి ఇచ్చేసినం!" చెప్పాడు కినాక భీము.

"మా భూమిగూడా బాకీకింద, వడ్డీకింద కలుపుకున్నడు రాఘవులు సేఠ్!" అన్నాడు కినాకబలిరాం. ఇలా తలా ఒకరు తమ భూమి ఎలా అన్యాక్రాంతమయిందో వివరంగా చెప్పుకొచ్చారు.

"ఇప్పుడు భూమి మీ పేరుమీద ఉండి, దాన్ని మీరు గాక ఇంకొకరు సాగుచేయటం, అట్లా వుందా ఏమ్మైనా!" మరోకోణంలోనుండి భూమి సమస్యను తెలుసుకోడానికై అడిగాడు.





"అట్ల మస్తుమందిమే ఉన్నం ఇక్కడ. పరంపోగు, లావోణిఖాతా, గావరాన్ సాగుచే సినంక మా దగ్గరికెల్లి గుంజుకొని, పట్వారీలు భూమి యింకోళ్ల పేర్ల రాసి మా నోట్ల మన్నుగొట్టి మమ్మల్ని భూమిలేనోళ్లను జే సింగ్రు. కావాలంటే చూస్కోండ్లి సర్కార్ పహాణీల మా పేర్లు ఉంటయి అన్నాడు'' షక్రు.

"గంతెందుకు సార్! యీ ఇలాకల తురుకో ళ్ల భూమి అంతా మాదే! కోమటి సావుకార్ల భూమి అంతా మాదే! పటేల్ పట్వారీల భూమి అంతా మాదే! దేశ్‌ముఖ్ దేశపాండేల భూమి అంతా మాదే! ఒక్క మాటల జెప్పా లంటే తురుకోల్లు, కోమట్లు, బామ్మండ్ల భూమి అంతా ఎప్పుడో ఒకప్పుడు మాదేసార్! అయి తే మా భూమి మా చేతులల్ల కెల్లి ఎట్లవో యింది? ఎప్పుడు వోయింది? సెప్తే అదొక పెద్ద కథయితది! మా సదురానితనం, మాట్లా డరానితనం మమ్మల్ని ఇంటికి, పెంటకు కాకుండా జేసింది'' అన్నాడు కొన్నాళ్లు రాత్రి బడిలో చదివిన తెలంగరావు.

"మీకొక దొడ్డు లెక్క జెప్త సార్! అటు దక్షిణంకు, ఈడికెల్లి సురయితే గుడిహ త్నూర్ మీదికెల్లి, నిమ్మల షేక్‌సాబు బొరుసు దాక, ఇటు ఉత్తరంకుగా జైనధ్‌కెల్లి బేల, కొబ్బాయిదాక, ఇటు తూర్పుకు హస్నపు రంకెల్లి జనగామ, కొత్తపల్లి, రాజూరా, సిర్పూ రు, మళ్లగిటు, జన్నారందాక, అంతా గొండోని రాజ్యమే! అంతా గొండోని భూమే సార్! సయిమాట జెప్పాలంటే యీ జిల్లల నూటికి ఇరవైమంది మేమే ఉన్నం. మేమే అంటే గొండోళ్లు, కొలామోళ్లు, పరధాన్లు, నాయికపో డులు, తోటీలు, ఆందోళ్లు గిన్ని కులాలు. మా అందరిపనీ భూమి దున్ని బతుకుడే!" అన్నా డు తెలంగరావు. అతనికి గోండు చరిత్ర మొత్తం తెలుసు.

పెన్‌గంగకు దచ్చినంకు, పడమరకు మా గోండురాజ్యం అంటే గోండ్వానా రాజ్యం ఉండె! మా రాజులు ఐదునూరు ఏండ్లు ఈ భూమ్మీద రాజ్యం జేసింగ్రు. ఇరవై రెండు కోటలు కట్టింగ్రు. బల్లార్‌షా, చంద్రపూర్‌లల్ల ఉండి. మారాజులు రాజ్యం ఏలిండ్లు. భీమా, లోభా, కరన్‌షా, బాబాజీ, బల్లార్‌షా, దుండి యా, రాంషా, కృష్ణషా, బీల్‌షా, రాంషా, నీల్‌కంఠ్‌షా యీల్లంత మారాజులు సార్! ఆ రాజులు వొయిండ్లు! రాజ్యాలూ వొయినయి. కొత్తగా తురక రాజులొచ్చిండ్లు. వాళ్లతోని దేశ్‌ముఖ్‌లూ, పతన్‌దారులూ వచ్చింగ్రు! మా బతుకులు గిట్లా అయినయి!" గోండుల గత వైభవం మెల్లమెల్లగా భగీరథకు అవ గతం కాసాగింది. మళ్లీ కినాకబాలు అందుకు న్నాడు.

"మా చాందా రాజుల సంతతిల ఆకిరికి మిగిలినోడు యిప్పటికీ ఉట్నూర్‌ల వున్నడు. దేవ్‌షా! నిన్న మొన్నటిదాకా సర్కారుమని షే! సదువుకున్నోడే! మీరు పోయి కలు వుంగ్రి! మేం ఎట్ల బతికినోళ్లమో! మారాజులు ఎసుంటోళ్లో, మీకు యింకా తెలుస్తుంది! నాయి అన్నీ సదూరాని అన్నాడి మాటలు!" అంటూ ముగించాడు.

భగీరథ వారి మాటలు వింటూ సిగరెట్ మీద సిగరెట్ తాగుతున్నాడు. చుట్టూ మూ గిన కొందరు పిల్లలూ, పెద్దవారు భగీరథ సిగరెట్ తాగే పద్ధతిని తదేకంగా చూస్తూ, ఆ రుచిని అంచనా వేస్తున్నారు.

"తురక రాజుతోని మా కష్టాలు సురయి నయి. తురకరాజు వోయిండు. ఇక మనకేం ఫికరనుకుంటే అంతకన్న కష్టాలొచ్చే మన మందితోని. ఇప్పుడైతే బతుకుడు తమామ్ ముష్కిలయిపోయింది!" అన్నాడు షక్రు.

"మా అందరి కష్టాలూ ఒక్కటే సారూ! భూమి లేనోడికేమో లేకపోయే అని కష్టం. ఉన్నోడికేమో భూమిమీద కబ్జా లేక కోర్టు కచేరీల సుట్టు తిరుగుడాయె! ఆళ్లు ఉన్నోళ్లు. కాలికంటే మెడకూ, మెడకంటే కాలికెయ్యావ ట్టేరి. తిరుగుడుకే మనుషులు సగమవుతున్న రు. ఇగ మాలసుంటోళ్లకు భూమి ఉన్నది,

మా పేరనే పట్టా ఉన్నది, కబ్జా ఉన్నది. కానీ ఒక యేడు పండితే మరోయేడు ఎండె. పండితే ధర రాకపాయె. ఉన్నదంతా సావుకారుకు అప్పుజెప్పి మల్ల ఏందంటే ఉత్త చేతుల ముండా! ఊరుకోవే రండా! అన్నట్లు అయితున్ది మా గతి'' నవ్వుతూ అన్నాడు జంగు. ఇంత విషాదమున్నా వారి బతుకులోంచి ఇంకా ఆ నవ్వు దూరంకాలేదు!

అక్కడ జమయినవాళ్లంతా తలా ఒక మాట అంటూవుంటే, పిల్లలు తమాషాగా వింటూ నిలుచున్నారు. సుమారు నలభై మంది పిల్లల వరకున్నారు. ఆటపాటలన్నీ మరిచి యిదేదో వింతగా పంచాయతీలా గుందని వింటూ నిలుచున్నారు. అప్పటికి పొద్దు బాగానే పైకి ఎగబాకింది.

"పిల్లలందరూ ఇక్కడే ఉన్నారు. స్కూలుకి వెళ్లరా వీళ్లు! వీళ్లకు టీచర్ ఉన్నాడా?" పిల్లలను చూస్తూ టాపిక్ మార్చుదామని అడిగాడు భగీరథ.

"మా వూళ్లె బడిలేదు సారు! అగ్గో ఆ సుద్దగూడెంల ఉన్నది. గాని అక్కడికి గూడా ఆ పంతులు సరిగ అస్తలేడు. ఆయింత పొయిటోళ్లు కూడా బందయిపోయి, ఇగో గిట్ల సూర్లపొంటి ఆగం దిరుగుతున్నరు!" అని సమాచారం చెప్పాడు జంగు. అప్పటివరకూ మౌనంగా వీళ్ల మాటలని వింటోన్న దేవుబాయి జంగుభార్య అందుకున్నది.

"ఎందుకు? దిక్కులేక ఆ బడి! లేందే మంచిగయింది. ఆ బడి ఉండి ఒగ పనికా? పాటకా? సదువుకున్నోళ్లు ఏం ఒరగవెట్టిండ్లని ఇంకా ఈ పోరగాండ్లు సదవాల? రెక్కలు ముక్కలు జేసుకొని సదివించిన కొడుకులు ఇటు సేను పనికి పనికిరాకపోయిరి, అటు సర్కారు జీతమా దొరకక నడిమిట్లనే ఉండిపోయిరి. ఇప్పుడు మా ఇద్దరు పోరగాండ్లు ఇందర్‌వెల్లిల బట్టల దుకాణంల ఒకడు, కిరాన దుకాణంల ఒకడు, మున్నూర్రూపాలకు జీతమున్నరు. ఇన్ని పంచాదులు గీ సదువుకు నుదు తోటేగదా! నా సిన్నకొడుకు ఏం జదుకోలే! గాని పెండదీస్తడు, అరక వడ్తడు. ఏకాలంల ఆ పని జేస్తడు. కష్టం జేసుక బతుకతడు ఎన్నటికైనా! గీ సదువుకున్నోళ్లకు గిసుంటి బరువు పనులు సాతగాకపాయె! ఆ!... మీ బడి సదువులు బతుకతందుకా! సెడిపోతందుకా?" అంటూ చదువులని ఈసడిస్తూ మాట్లాడింది.

జంగు భార్య, దేవుబాయి, పసిపిల్లేం కాదు! అనుభవంతోనే మాట్లాడింది. నిజం కూడా అదే అన్పించింది భగీరథకు.

దేవుబాయి మాటలు శాస్త్రీయ విద్యావిధానం కావాలని అడిగినట్లు అనిపించింది భగీరథకు. దేవుబాయిని ఒక ప్రశ్న అడగాలనిపించింది.

"మరి అమ్మా! ఈ చదువు గనక రాకపోతే చిన్నచిన్న జమా ఖర్చులూ, ఉత్తరాలూ, లెక్కలూ ఇవి మీకెట్లా తెలుస్తాయి? చదువుంటే మనిషికి ఎంతో జ్ఞానం వస్తుంది. చదువు లేకనేగదా మీరు ఇన్నాళ్లుగా మోసపోయారు. సావుకార్లు వంద ఇచ్చి, వెయ్యి అని రాసుకున్నా మీకు తెల్వదు కదా!" ఏం జవాబు చెప్తుందోనని ఆతురతగా చూశాడు భగీరథ.

"అందుకు పదేండ్లు సద్దిగట్టుకొని, యిన్నేసి పైసలు పెట్టి, పొరుగూరికి వోయి సదువుకునేదేంది. అంతదానికి రాత్రి బడి చాలు. బతకనీకి అచ్చినోడు రానోనికి అప్పుడింత ఇప్పుడింత జెప్పుకుంటే, బతకతందుకు గాయింత సదు జాలు!' అని తడుముకోకుండా చెప్పింది దేవుబాయి.

ఏ ప్రశ్నకైనా టక్కున జవాబు చెప్పగలనన్నట్లు మెరుస్తున్నాయి ఆమె కళ్లు. ఆ కళ్లల్లో విశ్వాసం ఉంది. జీవితాన్ని కాచి వడబోసిన నిశ్చలత్వం ఉంది. వయసు నలభైకి దగ్గర ఉండొచ్చు. కానీ ఆరోగ్యంగా ఉండటంతో అంత వయసనిపించదు.

ఆమె మాట్లాడుతూవుంటే మిగతా ఆడవా




ళ్లు ముసిముసిగా నవ్వుతున్నారు. సిగ్గుపడుతున్నారు. పడుచుపిల్లలైతే ఒకరి వెనుక యింకొకరు దాక్కొని ముందున్నవారి భుజాలపైనుండి చూపు సారించి చూస్తూ వింటున్నారు. మా అందరి ప్రతినిధి దేవుబాయే అన్నట్లున్నాయి వాళ్ల చూపులు.

పడుచు పిల్లల్లో ముగ్ధత్వం ఉంది.

వయసు స్త్రీలలో జంకు ఉంది.

ఈడు దాటుతున్నవాళ్లలో నిర్భీతి ఉంది.

దేవుబాయిలో అన్నీ కలగలిసి వున్నట్లనిపించింది భగీరథకు.

పలుచగా, దిద్దినట్లున్న కనుబొమ్మలు, నొక్కుల జుట్టు, గుండెలపైనుండి బిగించి తీసిన పైటకట్టు, మోకాళ్లపైనుండి వెనుకకు పూసిన చీరకట్టు. ముక్కుకు పెద్ద ముక్కెరతో పక్కనే ఉన్న గోండుపిల్లను ఆసరా చేసుకొని మాట్లాడటం, ఆ పక్కనే ఒక వెదురు కర్ర ఉండటం ఆమెకు ఒక కాలు మోకాలుకింద సగం లేకపోవడం గమనించాడు భగీరథ.

భగీరథ చూపులు గమనించిన దేవుబాయి భర్త "ఇందర్‌వెల్లి ఫైరింగ్‌ల బందూకు గోలి తగిలితే, సర్కారోల్లే సగం కాలు తీసేసిండ్లు!" అంటూ చెప్పాడు జంగు.

అప్పుడెప్పుడో పత్రికల్లో చదివాడు ఒక గోండు స్త్రీ, ఇంద్రవెల్లి సభలో పోలీసులపై తిరగబడి, ఒక పోలీసును నేలకూల్చిందని. ఆ స్త్రీ దేవుబాయే అని ఇప్పుడు తెలిసింది. ఆమెని అలాగే చూస్తుండిపోయాడు భగీరథ కాస్సేపు.

చూస్తుండగానే వాతావరణం బరువెక్కినట్లనిపించింది. విషయం మార్చాలన్నట్లు, "ఇంకా మీ గోండు, ప్రధాను, నాయకపోడులు కాకుండా, లంబాడాలు ఎవరూ లేరా యిక్కడ!" భగీరథ అన్నాడు.

"లంబాడోళ్లు మా గూడెంల ఉండరు సార్! వాళ్లు ఉండేది తండాలల్ల! మాయి గోండు గూడాలు! ఆళ్ళయి లంబడి తండాలు. మా గూడెంల లంబడోలు లేరుగానీ మరాఠోల్లు ఉన్నరు. ఒకరిద్దరు కాపోల్లు కూడా ఉన్నరు. అగో ఆ అంగరక ఏసుకొని, తిరుమని బొట్టు పెట్టుకొన్న భోజన్న కాపోడే! ఇంకా రాందాసు, యశ్వంతరావు, సుఖారామ్, మరాటోల్లు చేన్ల పనులకు పోయింగ్రు, లేరు ఆల్లు'' అన్నాడు జైతు.

"మరాఠీలకు, కాపులకు ఇక్కడ భూమి ఎట్లా దొరికింది!" అన్నాడు భగీరథ.

"కొనుక్కున్నారు. మా గోండోల్లే పైసల కింద భూమి ఇచ్చిండ్లు!" అన్నాడు జైతు.

"మాది ఎదులాపురం దగ్గర బెల్లూరి. మాకున్నదంతా బండభూమి. బగ్గ ఆనలు వస్తే జౌకు వస్తది. ఇటుదిక్కు భూములు బంగారం అని అక్కడ అమ్మి ఇక్కడ కొనుక్కున్నం సార్! అక్కడ ఆ జౌకుభూమి అమ్మితే ఏమచ్చింది! ఏమీ రాలే! ఇక్కడచ్చి కైకిలజేసి, కష్టపడి నాలుగు పైసలు జమజేసి ఈ భూమి కొనుక్కుంటి. భూమి బంగారమే గాని కాలమే కలిసిరాకుడు లేదు. పంటలు పండుడులేదు. పంటలకు కొత్త కొత్త యిపరీతమైన రోగాలతో పరేషాన్‌గున్నం. కైకిలి చేసుకున్నప్పుడే సుఖంగా వుంటిమి. ఈ భూములకు, ఎవయాసంకు ఎంత బెట్టినా తక్కువనే అవుతున్నది. ఒక్క పైస మిగులుడు లేదు! కడుపునిండ తినుడులేదు, కంటినిండ నిదుర లేదు!" అంటూ తన గతం, వర్తమానాన్ని భగీరథకు చెప్పుకొచ్చాడు కాపోల్ల భోజన్న.

ఎవరిని కదిలించినా ఒకే కథ దొరుకుతుంది.

అందరి కథలో కన్పించేది భూమే! అన్ని సమస్యలకు భూమే కేంద్రం.

మానవ పరిణామదశలో భూమిపై మనిషి వ్యవసాయం చేయడం ఒక గొప్ప పరిణామదశ. ఆ పరిణామదశలో భూమిని సాగుచేయడంలో నిష్ణాతుడైనవాడే రైతు. వాడికే భూమిమీద హక్కు. సారవంతమైన భూమిని ఆశించే గిరిజనుడు ప్రకృతి వైపరీత్యాలకూ, క్రూరమృగాలకూ భయపడే గిరిజ

నుడూ, తను సాగుచేసిన భూమిపై ఏనాడూ హక్కు ఆశించలేదు! ఒక రెండేండ్లు ఇక్కడైతే మరో నాలుగేండ్లు ఇంకెక్కడో!

కొండవాలునూ సారవంతమైన భూమిని, తాగునీటి వసతిని కోరి, గిరిజనుడు ఎక్కడి భూమిని అక్కడే వదిలి తను మరో మజిలీని వెదుక్కోవడం వాడి అలవాటు.

ఇలా ఎన్ని వేల, లక్షల ఎకరాల భూమిని గిరిజనుడు సాగుయోగ్యంగా పదిలంచేసి, చేసినన్నాళ్లూ చేసి వదిలి వెళ్లాడో!

నేడు ఆ గిరిజనుడికే భూమిలేదు!

భగీరథ అల్లిగూడెం తర్వాత సుద్దగూడెం, మార్కాపురం, హీరాపురం ఇలా అనేక గిరిజన గూడేలనూ, లంబాడీ తండాలను తిరుగుతూ, అక్కడ వ్యక్తులతో ఇంటర్వ్యూలు తీసుకుంటూ విరామం లేకుండా ఉన్నాడు.

ప్రియాంకకు వచ్చినప్పటినుండీ అల్లిగూడెమే సరిగా చూడ్డం పడలేదు. సిద్ధార్థ పొద్దున వెడితే ఎప్పుడో సాయంత్రం వస్తాడు అలిసిపోయి. ప్రియాంక ఒక్కర్తే వుంటుంది గుడిసెలో. సిద్ధార్థ ఇన్నాళ్లూ సేకరించిన సాహిత్యం బోలెడంతవుంది. వాటిని తిరగేస్తూ కాలం గడుపుతోంది ప్రియాంక!

ఆఫ్రికన్ నవల 'రూట్స్', మహాశ్వేతాదేవి 'ఎవరిదీ అడవి!' గోపీనాధ్ మహంతి ఒరియా నవల 'అమృతసంతానం', అల్లం రాజయ్య, సాహుల 'కొమరం భీమ్', ప్రఖ్యాత మానవ పరిణామ శాస్త్రవేత్త హైమన్‌డార్ఫ్ 'టూర్‌డైరీలు', 'రాజ్‌గోండ్స్', బస్తర్ గిరిజనులపై మనోహర్‌సింగ్ రాసిన 'హిరణి నయనియా', తెలుగులో వచ్చిన 'వసంతరాత్రి', 'రాగో', 'అడవిలో వెన్నెల', 'నేలతల్లి విముక్తికోసం', 'అడవిలో అన్నలు', ఇంకా గిరిజన జీవన విధానంపై వచ్చిన అనేక వ్యాసాల కటింగ్స్, బులెటిన్స్ వీటన్నింటినీ చదువుతూ గిరిజనుల జీవితాల గురించి నాలుగు గోడలమధ్యే ఉండి ఒక అవగాహనను ఏర్పరచుకొంది ప్రియాంక.

ఆ పుస్తకాలు చదువుతుంటే మనిషి మనిషిని ఎలా దోచుకుంటున్నాడో అర్థమయింది. తనకి తెలియని కొత్త ప్రపంచం చాలా వుందనిపించింది.

సిద్ధార్థ అందరినీ వదులుకొని అన్ని సుఖాలనూ కాలదన్ని ఎందుకు ఇక్కడ ఉంటున్నాడో ఆ పుస్తకాలు చదివితే స్పష్టంగా అర్థమయింది. రేపే తమ ప్రయాణం! వెళ్లేలోగా ఇంకా ఏమేం పుస్తకాలున్నాయని చూస్తోంది ప్రియాంక. పుస్తకాల్లో లీనమయి ఉన్న ప్రియాంక సాయంత్రం నాలుగయిన సంగతి కూడా గమనించలేదు. అప్పుడే సిద్ధార్థ వచ్చి బట్టలు మార్చుకుంటున్నాడు. అదీ గమనించలేదు ప్రియాంక!

సిద్ధార్థ ప్రియాంక వచ్చినప్పటినుండీ బిజీగా ఉన్నాడు. వారంరోజులుగా ఆ ప్రాంతమంతా అతిసార వ్యాధి, వైరస్ జ్వరాలతో తీవ్రంగా ఉంది. డాక్టర్ సిద్ధార్థ ఉన్న కారణంగా అల్లిగూడెంలో ఏ ఒక్కరికీ అతిసారంగానీ, జ్వరంగానీ ఇంతవరకూ రాలేదు. వచ్చిన అతిథులు కూడా ఎక్కడ మంచం ఎక్కుతారో అని అనుకుంటే భగీరథకు వచ్చిన పనికోసం తిరగక తప్పడంలేదు. అయినా బాగానే ఉన్నాడు.

"ఏమిటి! అమ్మాయిగారు ఈ లోకంలోనే లేరు! వారంరోజులనుండీ చూస్తున్నావు ఆ పుస్తకాలు! వచ్చింది మొదలు ఆ పుస్తకాలకే అంకితమైపోయావు. కావాలంటే ఆ పుస్తకాలను నీవెంట తీసుకెళ్లు. కాస్త బయట తిరిగి చూడు? ఆ పుస్తకాలలోకన్నా అద్భుతమైన వ్యక్తులు, జీవితం కనిపిస్తుంది'' అన్నాడు సిద్ధార్థ.

"వచ్చి వారంరోజులయి, ఇక రేపు వెళతాననగా ఇప్పుడు గుర్తొచ్చాననన్నమాట నేను! యూ ఆర్ వెరీ స్మార్ట్ జెంటిల్‌మేన్. విత్ సమ్‌థింగ్ స్పెషల్. చివరి క్షణంలో ఈ వారంరోజులు మమ్మల్ని నిర్లక్ష్యం చేసిన తప్పిదాన్ని క్షణంలో ఒక్క డైలాగ్‌తో బోల్తా కొట్టించావ్! అంతగా నీ ఉత్తరాల్లో ఊరించి






రాసే రేలనైనా పరిచయం చెయ్యవా?"

"సారీ యశో! ఐయామ్ వెరీ సారీ! నాది బిజీ షెడ్యూల్! రోజూ యిలాగే ఉంటుంది. ఈసారి వచ్చినపుడు సరదాగా ఈ ప్రాంత మంతా కలిసి తిరుగుదాం. నువ్వు తొందరగా బయలుదేరతానంటే ఊళ్లో ఒక రౌండ్ వేసి వద్దాం! లేకపోతే ఎవరో ఆడచుట్టం వచ్చింది! బురఖా వేసి, వారంరోజులు ఇంట్లోంచి బయటకే రానీయలేదంటుందీ గూ డెం! పద! పద!" అంటూ నిమిషాల్లో ప్రియాంకను వెంటబెట్టుకొని బయలుదేరాడు సిద్ధార్థ.

ఇద్దరూ పక్కపక్కనే నడుస్తున్నారు. ప్రియాంక చేయి సిద్ధార్థ చేతిలో వుంది. ప్రియాంక అన్నీ పరిశీలనగా చూస్తూ నడుస్తోంది!

ప్రియాంక కళ్లు ఒకచోట ఆగిపోయాయి.

అక్కడ గుడిసెముందు ఒక స్త్రీ రోకటి బండముందు కూర్చొని నువ్వులను కలియబెడ్తోంది. రోకలి ఒక అడ్డుకర్రకు నిలువునా బిగించబడివుంది. ఆ అడ్డుకర్రను ఒక ఎల్ల కిందకీ పైకీ ఆడిస్తూవుంది. అలా ఆడటానికి ఆధారంగా మధ్యలో ఒక గుంజ పాతబడి వుంది.

"అలా కచ్చాపిచ్చగా దంచిన నువ్వులను ఒక గుడ్డపీలికలో వడగట్టి నూనె తీస్తారు వీళ్లు. మిగిలిన ఆ నువ్వులపిండిని అలాగే కూరలో వేస్తారు" అంటూ ఆ నూనె తీసే పద్ధతి గురించి వివరించాడు సిద్ధార్థ.

" ఈ గిరిజన గూడేల్లో గానుగలు ఉండవు. వీళ్లకి నువ్వుల పంట పుష్కలం కాబట్టి ఇలా దంచి నూనె తీసి వాడుకుంటారు. అలాగే వడ్లు కూడా దంచుకొని బియ్యాన్ని వాడుకుంటారు. మరొకవిషయం పశు సంపద, పాడి సమృద్ధిగా వున్నా టీ డికాక్షన్ అంటేనే ప్రీతి వీళ్లకు" సిద్ధార్థ చెప్పినవన్నీ ఆశ్చర్యంగా వింటోంది ప్రియాంక.

"ఈ గుడిసె చూడు యశూ!" అంటూ ఒక గుడిసెను చూపించాడు సిద్ధార్థ. గుడిసె మామూలుగా రెల్లు గడ్డితో కప్పివుంది. చుట్టూ కొడిసె తడకలు కట్టి, మేడెలు కొట్టి నున్నగా మట్టితో మెత్తివుంది. గుడిసెలోపల నేల కూడా చదునుగా ఉండి, అలికివుంది. ఆ గుడిసెలో ముగ్గురు ఆడపిల్లలు కూర్చొని పులి-మేక ఆట ఆడుకుంటున్నారు. పక్కనే గచ్చకాయలు పడివున్నాయి. గచ్చకాయలు ఆడి పక్కన పడేసి, అప్పుడే పులీ-మేక ఆటకు మార్చుకున్నట్లున్నారు.

గుడిసె అరుగులపై పగిలిపోయిన పింగాణీ చాయ్‌కప్పుల ముక్కలతో ముగ్గులు వేసివున్నాయి. ఎంతో కళాత్మకంగా గుమ్మాలకు పగిలిపోయిన రంగు రంగుల గాజుముక్కలను వేడిచేసి అతికించిన తోరణాలు న్నాయి.

"ఈ అమ్మాయిలు మెన్‌సెస్ పీరియడ్‌లో వున్నవాళ్లు. ఈ అయిదు రోజులూ వీళ్లు ఈ ప్రత్యేకమైన గుడిసెలో వుంటారు. తమ కుటుంబ సభ్యులతో కలవరు. ఈ విషయంలో వీళ్లకు పట్టింపు ఎక్కువ. గూడెంలో ఏ స్త్రీ బహిష్టు అయినా ఈ గుడిసెలోనే విశ్రాంతిగా ఉంటారు. భోజనమూ అవీ ఇక్కడికే పంపిస్తారు. ఈ రకంగా వీరికి ఈ ఐదురోజులు పూర్తి విశ్రాంతి దొరుకుతుంది.

గిరిజన సాంప్రదాయంలో రుతుమతులైన స్త్రీల విశ్రాంతికి ముందుచూపుతో ఇంత ఏర్పాటు చేయబడి వుండటం ప్రియాంకకు ఆశ్చర్యమనిపించింది. నిజానికి ఆ ఐదు రోజులూ స్త్రీ శారీరకంగా, మానసికంగా విశ్రాంతిగా వుంటే ఎంతో మంచిదన్న విషయాన్ని వీరు గుర్తించి ఈ రూపంగా అమలు పెడ్తున్నందున ప్రియాంక పదేపదే ఆశ్చర్యపోయింది.

డాక్టరుగారినీ, ప్రియాంకనూ చూసి ఆ పడుచుపిల్లలు సిగ్గుతో పక్కకు, గోడలవైపు పరిగెత్తిపోయి నక్కారు.

సిద్ధార్థ నవ్వుకుంటూ ముందుకు కదిలాడు. ప్రియాంక అతన్ని అనుసరించింది. ఎదురుగా ఒక ముప్పయి సంవత్సరాల యువకుడు భూమ్మీద దేకుతూ వస్తున్నాడు. అతడి కాళ్లు పడిపోయాయి. పక్షవాతంతో నోరు పడిపోయింది. చూపు కూడా సరిగ్గా నిలవడంలేదు. చొంగ కారుస్తున్నాడు. ఆ స్థితిలో కూడా డాక్టరును గుర్తించి చేతులెత్తి నమస్కారం చేస్తూ గోండీలో ఏదో అంటున్నాడు.

"ఈతడి పేరు సుధామ. 1981 ఏప్రిల్ 20న జరిగిన ఇందర్‌వెల్లి కాల్పుల్లో గాయపడ్డాడు. అప్పట్లో పోలీసులకు భయపడి తుంటిలో దిగిన తూటాను తీయించుకొనక సరియైన వైద్యం చేయించుకోలేదు. చాలారోజుల తర్వాత మా మెడికల్ కాలేజీ టీమ్ వచ్చినపుడు ఈయన్ని ఉస్మానియా ఆస్పత్రికి తీసుకెళ్లి ఆపరేషన్ చేసి తూటాని తీసివేశాం. కాని అప్పటికే వెన్నుపూస చాలా దెబ్బతింది. ఆ కారణంగా ఒక్కొక్క అవయవం స్వాధీనం కోల్పోయి చివరకు మృత్యువాత పడ్తాడని తెలుసుకున్నాం. ఇప్పుడు కాళ్లు చేతులు స్వాధీనం కోల్పోయాయి. చూపు కూడా మందగించింది. నడుం పడిపోయింది. ఇంక ఎక్కువ రోజులు బతకడు!" అని చెప్తుంటే డాక్టర్ అయినా ప్రియాంక హృదయం కదిలిపోయింది.

"మనమేమీ చేయలేం. చూస్తూ వుండిపోవడం తప్ప!" అంటుంటే దూరంగా తమవైపే బుడిబుడి నడకలతో నడిచివస్తూన్న రేల కన్పించింది.

"నా ఉత్తరాల్లో ఎప్పుడూ చోటుచేసుకునే రేల! అదిగో నువ్వు గూడెం వదిలి వెళ్ళేలోగా చూడాలనుకున్న రేల!" అంటూండగా రేల దగ్గరికి రానేవచ్చింది.

నాలుగేండ్ల రేల బొద్దుగా, బొమ్మలా వుంది. కినాకబాలు తాత గారాలపట్టి రేల. రేల గౌనులో మడిచి ఏదో తెచ్చింది. చూస్తే పూలు! తెల్ల గోరింటలు! గులాబిరంగు గో




రింటలు!

"రేలను రెండ్రోజుల క్రితమే చూశాను. చిన్న మట్టికుండలో గడ్డపెరుగు తీసుకొని తాత వేలు పట్టుకొని మరీ వచ్చింది. అప్పుడే చూశాను ఈ రేలను. ఈ వెన్నెల రెమ్మను'' అంటూ రేలను ఎత్తుకొని బుగ్గపై ముద్దుపెట్టుకొంది ప్రియాంక!

తన జడలో గల పూలదండను తీసి రేల జడలో తురిమింది.

"సిద్ధార్థా! నీ ఉత్తరాలు చదివి రేలను చూడాలనిపించింది. ఇప్పుడు ఆ సీతక్కను అదే పంచపూలను చూడాలనిపిస్తోంది''

"ఇప్పట్లో అది సాధ్యపడదు! అదీగాక నువ్వు రేపే వెడుతున్నావు! మళ్లీ ఎప్పుడైనా వీలయితే చూద్దాం!" అంటూ ముందుకు నడిచాడు సిద్ధార్థ.

"బుల్లెట్ శరీరంలో ఉండిపోయి ఆ తర్వాత తీసినా కూడా జీవచ్ఛవమైన సుధాకరను చూశావు. ఇప్పుడు 1981 నుండీ నేటివరకూ బుల్లెట్‌ను ఇంకా తన శరీరంలోనే ఉంచుకున్న వ్యక్తిని చూద్దువుగానీ'' అంటూ ఒక గుడిసెముందు నిలబడి కిషన్ అంటూ పిలిచాడు.

పాతిక సంవత్సరాల వయసు, పూర్తి ఆరోగ్యంతో వున్న యువకుడొకడు బయటకు వచ్చాడు. ప్రియాంకకూ, డాక్టర్‌గారికి చేతులు జోడించి నమస్కరించాడు.

"నీ భుజంలో ఉన్న బందూకు గోలి ఈ అమ్మకు చూపించు'' అనగానే నవ్వుతూ భుజం పక్కన శరీరంలో ఉన్న బుల్లెట్‌ను పట్టి చూపించాడు.

ప్రియాంక కూడా చేత్తో తాకి చూసింది. నిజమే! బుల్లెట్టే!

"ఆశ్చర్యంగా ఉంది. ఇది సాధ్యమా? అయినా మీరు ఈ బుల్లెట్‌ని ఎందుకు తీయలేదు ఇన్నాళ్లు?" అంటూ సిద్ధార్థను అడిగింది ప్రియాంక.

"నేనే వద్దన్నా అమ్మా! కష్టమేం లేదు నాకు! అప్పట్ల గోలి తలిగింది! ఏవో మందులు పెట్టినమ్! గాయం తక్కయింది. నాకేం కష్టంగాలే! మల్ల జూస్తే గోలి అట్లనే వున్నది. ఉండనియ్యానుకున్నా! ఇగ ఉండిపోయింది'' అంటూ వివరించాడు.

ప్రియాంక చేతుల్లోని రేలను సిద్ధార్థ ఎత్తుకున్నాడు.

కనిపించిన వారిని పలకరిస్తూ ఊరంతా తిరిగారు. చూస్తుండగానే పొద్దు కుంగింది. ఇంతసేపు రేల వారితోనే ఉంది.

ప్రియాంక, సిద్ధార్థలమధ్య రేల. రెండు చేతుల్లో ఇద్దరి చేతులు పట్టుకొని నడుస్తోంది రేల.

ముగ్గురూ కలిసి ముందుకు సాగుతున్నారు.



**తొ**లకరి వర్షాలకోసం పల్లె ప్రజలంతా ఎదురు చూస్తున్నవేళ, ఎండాకాలం రెండు దుక్కులు అడ్డం, నిలువు అయిపోయాయి. ఒక తొలకరి వర్షం పడి, పెల్ల కరిగితే, దారలు కట్టి భూమి చదును చేసి, విత్తనాలు వేసుకుందామని చూస్తున్నవేళ.

ఉదయంవేళ చేలల్లో పెద్దగా పని లేకపోవడంతో అందరూ ఎవరి ఇండ్లలో వాళ్లు తీరిగ్గా పనులు చేసుకుంటున్నారు.

హఠాత్తుగా అన్నలొచ్చారనే వార్త క్షణంలో అల్లిగూడెం అంతా తెలిసిపోయింది. అన్నలు

మీటింగు పెడుతున్నారట. ఏదో ముఖ్యమైన విషయం పంచాయితీ పెడ్తారట. అని తెలియగానే ఆడా మగా, పిల్లా పాపా, ముసలి ముతకా అందరూ ఒక అరగంటలో అల్లిగూడెంలోని మూడుతొవ్వల కాడ గుమిగూడారు.

అప్పటికే చాలామంది పోగయ్యారు. అన్నలు మంచాల్లో కూర్చొని వాళ్లలో వాళ్లు ఏదో మాట్లాడుకుంటున్నారు.

ఇద్దరు వ్యక్తులు సెంట్రీ డ్యూటీలో ఉండి. అప్రమత్తులై కాపలా కాస్తున్నారు. మరో ఇద్దరు ఊరికి గల మూడు దార్ల చూస్తూ పహారా ఇస్తున్నారు.

కినాకబాలు తాత, మెస్రం జంగు, జైతు, జంగు, ఫక్రు, బొజ్జు, భోజన్న అందరూ కూడారు.

ఊళ్లో వాళ్లందరూ వచ్చారని నిర్ధారణ చేసుకున్నాక మీటింగ్ మొదలయింది.

అంతసేపు తర్జనభర్జనలు చేసుకొని చివరకు ఒక నిర్ణయానికి వచ్చినట్లు దళ కమాండర్ నారాయణ లేచి నిలబడ్డాడు. అతడి పక్కనే సీతక్క, మరో ఇద్దరు ఉన్నారు.

"సందీర్ రాం! రాం!" అంటూ అందరికీ అభివాదం చేశాడు నారాయణ.

అందరూ "రాం! రాం" అన్నారు.

తర్వాత ఊళ్లోని ప్రముఖులు అనుకున్నవాళ్లని, పరిచయస్థులను పేరుపేరున పలకరించాడు నారాయణ.

"ఎన్నో దినాలుగ మనం ఎదురు చూస్తున్న రోజు రేపు రాబోతోంది. భూమి ఎవడు దున్నుతడో వాందే భూమి. పట్టాదార్ ఎవరుంటే కబ్జాదార్ వాడే ఉండాల. ఈ 'గొండ్వానాల' ఎంతోమంది వేలిముద్రలు వేసి, తక్కువ డబ్బు తీసుకొని, ఎక్కువకు నోటు రాసి యిచ్చి, ఎన్నో ఏండ్లు వడ్డీ కట్టిండ్లు. ఆఖర్న అసలు కింద భూమిని యిచ్చేసిండ్లు మీరు. మీరు తీసుకున్న బాకీ మీరు కట్టిన వడ్డీకే చెల్లవుతది. కాని యీ సేట్లు, షావుకార్లు అట్లా కానీయలేదు.

వడ్డీకి వడ్డీ వేసి, తప్పుడు లెక్కలు రాసుకొని, చివరకు నిన్ను నీ భూమినుండె బేదఖల్ చేసిండ్లు. భూమి పోయిన ఊరు వదిలి, గూడెం వదిలి, మీరు మీ ఇష్టమొచ్చిన ఊర్లకు వలస వచ్చిండ్లు. మేం అన్ని ఊళ్ల లెక్కలు తీసినమ్. ఈ ఊల్లె ఆట్లా భూమి పోగొట్టుకొని బేదఖల్ అయి వచ్చినోల్లు యిరవై మందిదాకా ఉన్నరు. ఈ ఊల్లె భూమి మీద కబ్జా పోగొట్టుకొని చుట్టుముట్టు పల్లెల్లో ఉన్నోల్లు యిరవై నాలుగుమంది ఉన్నరు'' అంటూ కాగితాలు తిరగేస్తూ లెక్క చెప్పాడు.

బొజ్జు వాళ్ల పక్కనే నిలబడి లెక్కల కాగితాలు అందిస్తున్నాడు.

"ఇప్పుడు మల్లా ఎవరి భూమి వాళ్లకు యిప్పిస్తం. అందుకని రేపు మనం ఎవరి భూమిమీద ఆల్లు కబ్జ తీసుకోవాలి. భూమి మీద యిప్పుడున్న కబ్జాదార్ రేపు మన జోలికి రాడు. భూమి రేపటినుంచి మనది.

"దున్నేవాడికే భూమి ఉండాలిగాని దూర మీద నిలబడి నడుంమీద చేతులు పెట్టుకొని కైకిలిపెట్టి, పని చేపించేటోడికి భూమి ఎందుకు?"

మొదట కబ్జా వుండి, పట్టా లేనివారి భూమి తీసుకొని, ఆ పట్టేదార్‌కు యిప్పిస్తాం. మల్ల రెండోసారి ఇట్లా భూములేసుకున్న యీ సేఠ్‌ల, షావుకార్ల పేర ఎంత భూమి ఉందో చూసి భూమి లేనివాళ్లకు కబ్జా యిప్పిస్తాం. ఈ అల్లిగూడెం షివార్ల 'దావూద్‌సేఠ్‌కు' మూడు వందల ఎకరాల భూమి ఉన్నదని మా లెక్కలు చెప్తున్నాయి. ఆ భూమిని రేపు మన కబ్జాలో తీసుకుందాం.

ఆ మూడు వందల ఎకరాల భూమి మన కబ్జాలోనికి వచ్చినంక ఎవరు దావూద్ సేఠ్‌కు, ఆ భూమి అప్పజెప్పిండ్లో ఆల్లు దాన్ని దున్నుకోవచ్చు. రేపటినుంచి ఆ భూమి ఆల్లదే అవుతుంది.




గిరిజనుల భూములను యింకోల్లు కొనుడుగాని, కాస్తు చేసుడుగాని, కబ్జాలో ఉంచుకునుడుగాని కానున్ ఖిలాఫ్. అందుకని మీరెవరూ ఏమి భయపడకుండ్లి.

గొండ్వానాలో యింకొకడు భూమి కొన్నా, అది ఆని పేర్న రిజిష్ట్రీ కాదని అందరికీ తెలిసిందే. కాని తెల్వంది మీకే. ఉండీ లేని తెలినితో మీరు మోసపోయిండ్లు. అందుకని అందరు అరకలు కట్టి, దావూద్ సేఠ్ భూమి మీద రేపు కబ్జ చేసుకుందాం" అంటూ ముగించాడు నారాయణ.

"బొంతల పట్టికి శంకరన్న దళం, రవి దళం యిట్లా ఎన్నో నూర్ల ఎకరాల భూమిని గోండులకు కబ్జా యిప్పించిండ్లు. అట్లా కబ్జా యిప్పించిన భూమిలల్ల ఆ పాత కాస్తు కార్ మల్లా యిప్పటికీ కాలు పెట్టలేదు. ఇట్లా భూమి గుంజుకునుడు మనతోనే మొదలుకాదు. ఇసుంటియి దేశంల మస్తు జర్గుతున్నయి. అందుకని ఎవరూ ఏం భయపడే పని లేదు'' అంది సీతక్క.

డ్యూటీలో వున్న సెంట్రీలు యివేమీ గమనించడంలేదు. చూపంతా బయటి దిక్కే. ఏమాత్రం అనుమానం వచ్చినా వాళ్ల చేతుల్లోని తుపాకులు పేలటానికి సిద్ధంగా ఉన్నాయి.

భూమి ఆక్రమణ గురించి వాళ్ల మనసులో రకరకాల అనుమానాలున్నాయి. మేస్రం జంగు, "దావూద్ దగ్గరున్న మున్నూరు ఎకరాల భూమి ఈ ఊరిదే. కాని ఆ మున్నూరు ఎకరాల పట్టాదార్లు అందరూ లేరు. భూమి పోయెనని పొట్ట చేత పట్టుకొని ఎటెటో పోయిండ్లు. మా అయితే ముగ్గురు నలుగురు మంది ఈ ఊల్లెనే ఉన్నరు. కబ్జ చేసుకున్నంక ఆ మున్నూరెకరాల భూమి చేసుడు యిాల్ల తరమైతదా. అదీగాక ఉన్న ఈ ముగ్గురు కైకిలి జేసి, బతకవట్టిరి. కబ్జా చేసుకున్న భూమిని మల్ల సొంతం పోతం జేసుడెట్ల?" అన్నాడు.

"ముందు భూమి మన కబ్జాలకు రానీ. భూమి కబ్జాలకస్తే మీరంతా లేరా! ఒక యేడు మనిషొక చెయ్యేసి చెయ్యరాదా! అప్పటిదాక యీ సంగతి అందరికీ తెలుస్తది. ఆ పోయినోల్లు కూడా తిరిగి అస్తరు. అప్పుడు అందరూ ముందటితీరు, ఎవల్ల భూమిల ఆల్లు కష్టం జేసుకొని బతుకొచ్చు'' అంది సీతక్క.

"రేపు పొద్దు పొడవక ముందు అందరూ అరకలు కట్టుకొని ఊరు ఊరంతా దావూద్ చేన్ల ఉండాలి. ఇదొక పండుగనుకోండ్లి. మల్ల రేపు పొద్దుగాల్ల దావూద్ చేన్ల కలుద్దాం" అని నిమిషాల్లో నిష్క్రమించారు.

అన్నలు పోయిన చాలా సేపటివరకు ఊరిజనం అక్కడే వుండి యిదే విషయమై తర్జన భర్జనలు చేసుకున్నారు. మళ్లీ ఒకసారి అందరూ పొద్దున్నే కలిసికట్టుగా అరకలు కట్టుకొని పోవాలనే నిర్ణయించుకున్నారు.

తూర్పున పొద్దు పొడిచీ పొడవకముందే, అల్లిగూడెం నుండి ఇరవై నాగండ్లు, దావూద్ కబ్జాభూమివైపు కదిలాయి.

దావూద్ ఆదిలాబాద్‌లో కమీషన్ ఏజెంట్. ఇంకా ఇతర వ్యాపారాలు చూసుకుంటూ ఉంటాడు. అతడి నౌకర్లు అల్లిగూడెం పక్కన గల రాగాపూర్‌నుండి వచ్చి భూమి సాగుచేస్తారు. మధ్యమధ్యన దావూద్ గుమాస్తా వచ్చి పనులు చూసి పోతూ ఉంటాడు. దావూద్ ఎప్పుడో రెండు మూడు నెలలకొకసారి వచ్చి వెళ్తాడు. ఇలా గోండులకబ్జా భూములు దావూద్‌కు రెండు మూడు పల్లెల్లో వున్నాయి.

దావూద్ ఒకప్పుడు ఈ ప్రాంతంలోనే వుండి, రకరకాల వ్యాపారాలుచేసి ఎదిగిన మనిషి. పెద్ద ఎత్తున కమీషన్ వ్యాపారం ప్రారంభించి, ప్రస్తుతం ఆదిలాబాద్‌లోనే స్థిరపడ్డాడు.

భూమికబ్జా తంతు చూడ్డానికి అల్లిగూడెం జనంతోపాటు అటు దిక్కున్న పది ఇరవై గ్రామాల ప్రజలు ఆసక్తిగా వచ్చారు భూమికబ్జా ఎట్లా జరుగుతుందో చూద్దామని.

పోయిన భూములను అన్నలు తిరిగి యిప్పిస్తున్నారనే వార్త అటు దిక్కు అన్ని గిరిజన గూడాలకు, లంబాడి తాండాలకు తెలిసిపోయింది.

ఆ వార్త కొందరికి కొత్త ఆశలు కలిగిస్తే మరికొందరికి గుండెల్లో గుబులు రేపింది. ఒక్క మాటలో చెప్పాలంటే, గిరిజనుల గుండెల్లో ఆశల్ని, గిరిజనేతరుల గుండెల్లో దిగులుని కలిగించాయి.

కొందరికైతే పోయిన రాత్రే విషయం తెలిసి, ముద్ద మింగుడు పడలేదు.

దున్నే వానికే భూమి అనుడే కాని యిప్పించింది లేదు. ఈ మాట గత పదేండ్ల నుండి వింటున్నారు గిరిజనులు. అన్నలొచ్చినంక భూస్వాముల, పెత్తందార్ల, సేఠ్‌ల, షావుకార్ల జులుంలకు కొంత కళ్లెం వేసినట్లయింది. అంతేగాని పూర్తిగా తుడిచిపెట్టుకుపోలేదు. అన్నలొచ్చి మొదటినుంచి చెప్పుతున్న మాటనే 'దున్నే వానికే భూమి' అని. ఆ రోజు ఎన్నడొస్తుందా? అని గిరిజనులు, వ్యవసాయదారులు, వేయికళ్లతో ఎదురు చూస్తున్నారు.

అజ్ఞానంతో చేసిన చిన్నచిన్న పొరపాట్లకు వాళ్ల భూమి వాళ్ల చేతుల్లో నుండి పోయింది. భూమి పోయినప్పట్నించి, వాళ్ల కష్టాలు మొదలయ్యాయి. భూమి చేతుల్లో ఉన్నప్పుడు, దాని విలువ తెలియలేదు. భూమి పోయాక, భూమి అంటే ఏంటో తెలిసొచ్చింది. అప్పట్నించి తిరిగి దాన్ని పొందటానికి, ఎంత కష్టాన్నైనా, ఎదురుకోటానికి సిద్ధంగా వున్నారు.

అందుకే భూమికబ్జా అని తెలియగానే అంతమంది జనం, యింత పొద్దున్నే పోగయ్యారు.

ఆ శివారమంతా మనుషులతో నిండిపోయింది. స్త్రీలు- పురుషులు పిల్లలు, పెద్దలతో ఆ శివారమంతా నేల ఈనినట్టయింది. చూసే వారికి సభనో, సంతనో, జాతరనో ఉందన్న భ్రమ కలిగేలా వున్నారు.

గోండులు, ప్రధానులు, కొలాములు, నాయకపోళ్లు అందరూ ఆసక్తిగా, ఆశగా జరగబోయేదాన్ని చూడ్డానికి వచ్చారు.

కాపులు, లంబాడాలు, మధురాలు, మరాఠోల్లు, చిన్నచిన్న సేఠ్‌లు, షావుకార్లు, భయంభయంగా, గుబులు గుబులుగా కొంతదూరంనుండే ఏమవుతుందో, ఎట్లాగవుతుందోనని చూద్దాం అని వచ్చారు.

రెడ్లు, రావులు, రావు సాహెబులు, సాహెబులు, దేశ్‌ముఖ్‌లు, దేశపాండేలు కూడా ఎక్కడెక్కడినుండో, మోటారు సైకిళ్లేసుకొని వచ్చారు. కాని అసలు వ్యక్తి దావూద్‌గాని, దావూద్ ఇంటివాళ్లుగాని ఎవరూ రాలేదు.

దావూద్ నౌకర్లు, గుమాస్తా మాత్రం ఉన్నారక్కడ. కొన్ని జతల కళ్లు వచ్చిన వాళ్లను గమనిస్తున్నాయి. వచ్చిన వాళ్లు ఎవరో, అంచనా వేస్తున్నాయి. అన్నలు ఊహించిన దానికంటే ఎక్కువే స్పందన వచ్చింది అక్కడ.

భూమిపట్ల గొండుకు, రైతుకు ఉన్న ప్రేమ, అనుబంధం అలాంటిదిమరి.

చూస్తుండగానే నారాయణ జనం మధ్య ప్రత్యక్షమయ్యాడు. నారాయణ ఒక్కడే ఉన్నాడు. భుజానికి స్టెన్‌గన్ వేలాడుతోంది. వారం రోజులుగా తీయని గడ్డం, నిదుర లేక జ్యోతుల్లా వెలుగుతున్న కళ్లతో నారాయణ ఒక్కసారి నలుదిక్కులా కలియజూశాడు.

ఇంకా దళంలోని సీతక్క, విఠోభా, పైకు భామి, నర్సయ్య, కమలాకర్ వాళ్లెవరూ అతడి పక్కన కనిపించలేదు.

నారాయణ ఆదేశాల మేరకు, యిరవై నాగండ్లు, వరుసగా నిలబెట్టబడ్డాయి. బొజ్జూ దావూద్ ఆక్రమించి, కబ్జాలో ఉంచుకున్న భూమిలో నాలుగు దిక్కుల, నాలుగు ఎర్ర జెండాలు పాతిపెట్టాడు.

ఏ పనైనా పసుపు కుంకుమలతో కొబ్బరి




కాయతో మొదలు పెట్టాలనే గిరిజనుల సెంటిమెంట్‌కు బలాన్నిస్తూ కినాకబాలు తాత, అక్కడున్న వారందరి నుదుట తిలకం పెట్టాడు. నాగళ్లకు కుంకుమ పెట్టి పసుపు రాసి, యిరవై నాగళ్లకు ఇరవై కొబ్బరి కాయలు కొట్టారు.

"డియర్ కామ్రేడ్స్ అందరికి రాం రాం. మనం కలలుగన్న భూ పోరాటం నేడు నిజమైంది. నేటి రోజు రైతాంగ పోరాట చరిత్రలో మరిచిపోని రోజు. ఒక కామందును మట్టుబెట్టొచ్చు, ఒక పెత్తందారు పేరు లేకుండా చేయొచ్చు. ఒక భూస్వామిని భూమిలో పాతెయ్యొచ్చు మనం. కాని అవేవి నా దృష్టిలో గొప్ప సంఘటనలు కావు. మన పోరాటం జులుం మీద, మన పోరాటం భూమికోసం. నేడు మనం అది సాధించుకున్నాం. ఒక రకంగా జులుం చేసి లాక్కున్న భూమిని నేడు మనం తిరిగి అదే జులుంతో స్వాధీనం చేసుకుంటున్నాం.

దున్నేవాడిదే భూమి, అనే మన నినాదం నేడు నిజమైంది. రైతన్న దశాబ్దాల కల నేడు ఫలించింది. ఈ రైతన్నల కలలు పండటానికి మేం ఎంతో కొంత పనికొచ్చినమ్ అనే తృప్తి చాలు మాకు ఈ జన్మకు. అమూల్యమైన ఈ క్షణం కోసం, ఎన్నాళ్లనుంచో మేము ఎదురు చూస్తున్నాము'' అంటుంటే నారాయణ గొంతు గద్గదమైంది.

నారాయణ కళ్లల్లో నీళ్లు తిరిగి ఒక కన్నీటి చుక్క నేల రాలింది, తొలకరి చినుకులా.

నారాయణతోపాటు అక్కడక్కడ వున్న కొన్ని జతల కళ్లు ఒక్కక్షణం, అన్నీ మరిచిపోయి, అలా చూస్తుండిపోయారు. ఆనందంతో ఉప్పొంగిన వారి హృదయాలు సాగరమై పొంగాయి. ఉవ్వెత్తున లేచిన సాగర కెరటాలు గుండెలోంచి, గొంతులోంచి తన్నుకొని కళ్ల చెలియలికట్టలు తెంచుకొని ప్రవహించాయి.

పొంగిన నీరు సముద్రానికే అన్నట్టు, ఆనవాలు పట్టటానికి వీలుగా పెదవులపై జారిన ఈ నీరు కూడా ఉప్పుగానే ఉంది.

జనం మధ్య, అక్కడక్కడ మామూలు మనుషుల్లా, భుజం చుట్టూ, ముతక బట్టలు వేసుకున్న సీతక్క, నర్సయ్య, పైకు, విఠోబా, కమలాకర్ అందరి కళ్లలో ఒకే కన్నీరు.

ఇన్నాళ్ల శ్రమ, ఇన్నాళ్ల యాతన, యిన్నాళ్ల నిరీక్షణ అన్నీ ఆ రెండు కన్నీటి చుక్కల ముందు కొట్టుకుపోయాయి. సై అంటే సై అంటూ, నాగళ్లు కదిలాయి. గ్రీష్మతాపాలకు వేడెక్కిన నేల, నాగటి కర్రుకు, దాసోహమని, యింతంత మట్టి బెడ్డలులేచి పోతున్నాయి. ఇరవై అరకలు వరుసగా, ఒక్క తీరుగ నడుస్తున్నాయి.

బొజ్జూ పాతిన ఎర్రజెండాలు, ఎండలో రెపరెపలాడుతున్నాయి.

ఏదో ప్రళయం జరుగుతుందని చోద్యం చూడొచ్చని వచ్చిన జనులకు నిరాశే మిగిలింది. అనుకున్నది ఏమీ జరుగలేదు.

పోలీసులు వస్తారు. లాఠీలు ఝుళిపిస్తారు. తుపాకులు ఎక్కు పెడ్తారు. గిరిజనులు పిట్టల్లాగ నేల కొరుగుతారు.

కబ్జా భూమిని, తిరిగి ఆక్రమించుకోవాలని వచ్చిన గిరిజనుల రక్తంతో కబ్జా భూమి తడిసి, యింకా సారవంతమౌతుందని, ఎక్కడెక్కడి నుండో వచ్చిన వాళ్లు ఊహించుకున్నారు. అలాంటిదేం జరుగక పోయేసరికి, కనీసం ఒక్క పోలీసు కూడా కనిపించక పోయేసరికి చాలా మందికి నిరాశ కలిగింది.

నారాయణ దుక్కి భూమిలో నిలబడి, గిరిజనులతో మాట్లాడుతున్నాడు. అంతలో ముగ్గురు గిరిజనులు వచ్చి, నారాయణను చుట్టుముట్టి, అమాంతం కాళ్లమీదపడి, గట్టిగా కాళ్లు పట్టుకున్నారు.

"నీ కాళ్లు మొక్కుతం కొడుక. నా పేరు సుంగు. జైనూరు దగ్గర లేండిగూడ మాది. మా భూమి కూడా గిట్లనే, యింకొల్ల కబ్జల ఉన్నది, ఎట్లన్న జేసి, యిప్పించుండ్రి. పిల్లా జెల్లా గలోన్ని. ఉన్న భూమి పోగొట్టు

కొని, ఏ ఆదరమానం లేక, తమాం తిండికి, బట్టకు పరేషాన్ గున్నం. ఎట్లన్నజేసి, మీరే నా భూమి నా కిప్పిచ్చుండ్రి. మీరు యిప్పిస్త రని, దయగల మారాజులని, మస్తు దూరంకె ల్లి అచ్చినమ్'' అన్నాడు ఎంతో దూరం జైనూర్‌నుండి వచ్చిన కొట్నాక సుంగు.

"కాగితాల మీద మా ఏల్ల నిషానీలు తీసుకొని, మా మొకం మీద యిన్ని పైసలు, యిన్ని గింజలు పడేసి మా భూమి మాకు కాకుండా చేసిండ్రు. భూమినుండి మమ్మల్ని పాపిండ్రు. అప్పట్నించి ఏ దిక్కులేక, పిసకోతుల తీరు బతుకుతున్నం. మీరచ్చి మాకు న్యాయం జేయుండ్రి. అట్లజేస్తె మీ రుణంల ఉండిపోతం" అంటూ కాళ్లు పట్టుకున్నాడు కొడిమెత జిత్రు.

"ఇదేం పని కాళ్లుపట్టుడు. లేచి నిలబడుండ్రి. ఇది మన మొదటి గెలుపు. అందరూ చూసిండ్రు గద. అందరూ ఇనుకొండ్రి. గట్టు లోపల వున్న రైతుల్లారా! గొండ అన్నలారా! గట్టు బయటున్న వాళ్లు కూడా ఇనుకొండ్రి.

ఇప్పుడు జరిగింది కానూన్ ఖిలాప్ పని కాదు. ఈ జిల్లాలో యీ గోండ్వానాలో భూమి అంతా గొండులది, ప్రధానులది, నాయక పోడులది. ఎవడు అరక పట్టి, చెమటోడ్చి కష్టపడి, ఆరు గాలాలు భూమిమీద పని చేస్తడో, ఆ భూమి ఆన్దే.

నువ్వు డబ్బిచ్చి కొన్నా మీ సర్కార్ దగ్గర కూడా, అది చెల్లదు. గిరిజనుడి భూమి, గిరిజనుడు కానివాడుకొంటే చెల్లదని మీ సర్కారే కానూన్ చేసింది.

భూమి పట్టేదార్ ఎవడుంటే, కబ్జాదార్ వాడేవుండాలి.

కబ్జా ఇడిసిపెట్టిన, మీ నీ భూములను మీ ఊళ్లకు వెళ్లినంక కబ్జ చేసుకొండి. ఎవడు అడ్డం వస్తాడో చూద్దాం. మనిషికింత భూమి అని మీ సర్కార్ నిర్ణయించింది. అంతే ఉంచుకోండి. మిగిలింది మాది. మా రైతు లది. ఆ భూమి కూడా నువ్వు దున్నుకుంటేనే నీది. కాకుంటే ఆ దున్నేవాడిదే అవుతుంది.

దున్నేవాడికే భూమి యిప్పించడం మా లక్ష్యం.

భూమిని నమ్మి, భూమి మీద కష్టపడి, చెమటోడ్చే వాడెవడైనా సరే గిరిజనుడైనా కాకున్నా వాళ్లందరికి దున్నుకోడానికి భూమి యిప్పించే వరకు మా యీ ఉద్యమం ఆగదు'' అంటూ గొంతెత్తి చెప్పాడు నారాయణ.

ఆవేశం ఆగని బొజ్జు, గట్టిగా రెండు వేళ్లు నోట్లో పెట్టి, ఈల వేశాడు. మరుక్షణం ఆ ప్రదేశం అంతా ఈలలతో చప్పట్లతో మారుమోగిపోయింది.

చోద్యం చూద్దామని వచ్చిన వారికి తల తీసేసి నట్టయింది. ముఖంమీద ఊసినట్టయింది. ఇలాఖా అంతా ఎప్పుడో ఒకప్పుడు, ఎట్లనో అట్ల లడాయి గొడాయి చేసి ఇది యిచ్చి అది యిచ్చి మొత్తానికి గిరిజనుడి భూమి కాజేసిన వాళ్లే. అట్లా కాజేసిన భూమికి తమ పేరున ఎలాంటి పట్టా కాగితం, ఎవరి దగ్గరా లేదు. సర్కారు పహనీల వాళ్ల పేర్లు లేవు.

పట్టేదార్ గొండొడే వున్నాడు. కబ్జాదార్‌గా వాళ్ల పేర్లున్నాయి. అది చెల్లదని వాళ్లకూ తెలుసు.

ఇప్పుడిదంతా చూస్తుంటే, అందరి రక్తం సలసలకాగి పొంగుతోంది. ఉత్తుత్తగానే చెమటలు పోస్తున్నాయి. గుండెలు ఎగిరెగిరి పడుతున్నాయి. చేతులు కాళ్లు వణుకుతున్నాయి. తమ కాళ్లక్రింది భూమినెవరో చాపలాగ లాగే సినట్లనిపించి, ఉలిక్కి పడుతున్నారు గట్టు మీద ఉన్నవాళ్లు.

మనసు కాల్తుంటే మనిషొక మాట అంటున్నారు, "థూ! నీ అవ్వ! గొండు సర్కారొచ్చింది. మొగతనమే లేదు. తుపాకులు ఎక్కుపెట్టి దోచుకునే రోజులొచ్చె'' అన్నాడొక పెద్దమనిషి.






"ఈడ గింత జరుగుతున్నా గా జాలీసో ల్లకు యింత ఖబరు కూడా లేకపోయెనా ఏంది!"

"అన్ని తెలిసే ఉంటయి. గిట్ల జరుగు తుందని రెండురోజులముందే మనకు తెలిసే ఆల్లకు తెల్వక పాయేనా ఏంది!"

"నడుండ్లి, యింక చూసేదేముంది. కండ్ల సంబరం యింకా తీరలేదా. ఇయ్యాల్ల దావూద్‌సేర్ పంతయింది. రేపు నా వంతు. ఎల్లుండి రాఘవులు సేర్‌ది. ఆ ఎల్లుండి విఠల్ సేర్‌ది నడుండ్లి, నడుండ్లి ఇక్కడికెల్లి. ఇంటికి పోతే ఇత్‌మినాన్‌కాదు. మనుసు మనుసుల రాదు'' అంటూ ముందుకు కదిలాడు ఒకాయన.

"కంట్లె నలుసు పడ్తె తీసుకోవచ్చు. తలుపుల చేయిరికితే తీస్కోచ్చు, పంటికింద రాయొస్తే తీసెయొచ్చు. ఈ బందూక్ నా పొరగాండ్లు మన గుండెల్లనే రాయేసిరి. గునపాలు దించిరి. ఇక బతుకు డెట్ల'' అంటూ వచ్చిన వాళ్లు వచ్చినట్లే తమతమ ఇళ్లకు వెళ్లిపోయారు.

★ ★ ★

అల్లిగూడెంలో భూ ఆక్రమణ, అన్ని పత్రికల్లోనూ ప్రముఖంగా చోటు చేసుకుంది. గిరిజన ప్రాంతాల్లో స్థిరనివాసం ఏర్పరచుకొని, స్థిర చరాస్తులు సంపాదించుకున్న గిరిజనేతరుల ముఖాలు కళలు తప్పాయి. కంటికి నిదుర, నోటికి అన్నం రుచించకుండా పోయాయి. ఎంత మనసును సముదాయించుకోవాలని ప్రయత్నించినా, మనసు మనసులో ఉండడం లేదు ఎవరికి.

చివరకు అందరూ కలిసి, ఒక మీటింగు లాంటిది పెట్టుకొని తమలాగే భూమి, పుట్రా అనేకం సంపాదించుకున్న రాఘవుల్ని తమ నాయకుడిగా ఎన్నుకొని, అందరూ కలిసి దావూద్ సేర్ దగ్గరకు ఆదిలాబాద్‌కు వెళ్లారు.

దావూద్ సేర్‌ను కలిసిన వారికి అతడి

నుండి పెద్ద వ్యతిరేకత ఏమీ రాకపోవడంతో అప్పటికి ఊరకుండి పోయారు.

అల్లిగూడెం భూ ఆక్రమణ తర్వాత, వరుసగా రోజూఎక్కడో ఒకచోట భూమి ఆక్రమించుకోవడం మామూలైపోయింది.

ఒకవైపు భూమిని పొందిన గిరిజనుల్లో వ్యవసాయ రైతుల్లో వెల్లివిరుస్తున్న ఆనందం, మరోవైపు భూమిని పోగొట్టుకున్న గిరిజనేతరుల్లో, వ్యాపారుల్లో ఆందోళన కలకలం.

అన్నల అండతో గిరిజనుల భూ ఆక్రమణ జరగడంతో పోలీసులు ఈ చర్యను ఒక కవ్వింపుగా వ్యక్తిగత ప్రతిష్టగా భావించారు.

భూమి పోయిందని ఎవరూ కూడా ఏ పోలీసుస్టేషన్లో కూడా ఎఫ్.ఐ.ఆర్. నమోదు చేయించుకోలేదు. అందరూ తేలుకుట్టిన దొంగల్లా, మిన్నకుండిపోయారు. లాయర్లను కలిసి సలహా తీసుకున్నాడు దావూద్ సేఠ్. ఏమీ చేయలేమని, అదీగాక విషయం గిరిజనులతోనే అయితే ఎలాగో వ్యవహారం నడపవచ్చు. కాని వెనుకవున్న తీవ్రవాదులను చూసి ఏమీ జరగనట్లే ఉండిపోవడం మంచిదనే సలహాను దావూద్ అక్షరాలా పాటించి ఒకప్పుడు అల్లిగూడెంలో మూడు వందల ఎకరాల భూమి ఉండేదనే సంగతే మరిచిపోయాడు.

దావూద్ వేయి కాళ్ల జెర్రి. ఒక కాలు పోతే ఎంత? ఉంటే ఎంత?

భూములు వదులుకొని పొట్టచేత్తో పట్టుకొని ఎటెటో వలస పోయిన వాళ్లందరికి పోయిన తమ భూములు తిరిగి, దొరకుతాయని తెలిసింది. చేయవల్సిందల్లా మళ్లీ పాత ఊరికి వెళ్లి తమ భూమిపై తాము కబ్జచేసుకోవచ్చని తెలిసి చాలామంది ఎక్కడెక్కడో చేస్తున్న జీతాలను, కూలీ పనిని విడిచిపెట్టి, మళ్లీ తమ పాత ఊరివైపు ప్రస్థానం మొదలుపెట్టారు.

అలా అల్లిగూడెం వైపు కదిలివచ్చే కుటుంబాలు తొమ్మిదున్నాయి.

ఒక్కొక్క కుటుంబమే వచ్చి చేరుతోంది.

మార్కాపురంనుండిపోవటానికి తన పెట్టె, బేడ, ముల్లె, మూటా, చేట బొంత అన్నీ సర్దుకొని బిగారికిబండి మాట్లాడుకొని, అల్లిగూడెం వైపు బండి నదిలించాడు అత్రం సోనేరావు.

భార్య, పిల్లాజెల్లా బండెనక నడిచి వస్తున్నారు.

మిట్ట మధ్యాహ్నం వేళ బండి అల్లిగూడెం చేరింది.

పుట్టి పెరిగిన ఊరు, పాత పరిచయాలు, పాత సంబంధాల మధ్య సోనేరావు మళ్లీ వచ్చిన నాలుగ్గంటల్లోనే పాతబడ్డాడు.

అత్రం సోనేరావు తర్వాత, భీము, నాగోరావు, గోవిందు, మడావి బలిరాం, అత్రం రాజు, కొడిమెత రాంజి, కొమరం రాజు, కినాక లచ్చు రెండు రోజుల వ్యవధిలో దావూద్‌కు భూమి యిచ్చి పోయినవాళ్లంతా వచ్చారు.

వీళ్లంతా ఊరు చేరిన రాత్రే, తొలకరి జల్లు పెద్దగానే పడింది. దుక్కికి లేచిన మట్టిబెడ్డలు కరిగిపోయాయి. వ్యవసాయం ఎట్లా చేయడం అనే ప్రశ్న అందరి మనసుల్లో ముల్లులా మెదులుతోంది.

'మన యెవరి దగ్గర యవుసాయానికి కావలసినయి ఏమీ లేవు. ఒక యేడు ఎట్లానైనా కష్టపడదాం. మందిని బతిమాలుదాం. ఐ.టి.డి.ఎ.లో ఏమైన ఇత్తనాలు, ఎరువులు యిస్తే తెచ్చుకొని, చేసుకుందాం ఏమంటారు?" అన్నాడు సోనేరావు.

"ఎట్లయితే అట్లయితది. పోయిన భూమి యిప్పించిన దేవుడు, ముందు ముందు ఆడే దారి జూపుతడు. మన పని మనం చేసుకుంటపోదాం. పెల్ల ఎట్లా కరిగింది. పసి ఏరుడ్లు ఏరుకుంటే భూమి సొక్కమౌతది'' అన్నాడు కొమరురాజు.




"నిన్న రాంగ రాంగ జూసిన మన భూమిని, తురుకోడు భూమిని నాశనం జేసిండు. కట్టకింద శివారుల, పొదలకు పొదలే చెట్లు పెంచిండు. అవన్ని కొట్టి సాపు జేసుకోవాల. నడుండ్లి. ఇంట్ల ఉంటే, ఏమస్తది'' అంటూ లేచాడు మడాలి బలిరాం.

అందరూ ఏదో యింత తిని యింత కట్టుకొని, చేనువైపు కదిలారు.

ఇంట్లో ఉండి చేసేదేమని, ఆడవాళ్ళు వచ్చారు. అక్కడైతే యింత తుక్కు ఏరవచ్చని.

ఆడవాళ్ళతోపాటు, పిల్లలు కదిలారు.

ఆడ- మగా పిల్లలు పెద్దలు అందరూ, పని ఏరుడ్లు ఏరుతున్నారు. దుక్కిలో మట్టిబెడ్డకు అంటుకొని ఉన్న పుల్లా పుడక, మట్టిబెడ్డ కరిగి, చెత్తంతా భూమిపై పేరుకుపోతుంది. అలా పేరుకుపోయిన చెత్తని ఏరితే, భూమి నల్లగా నిగనిగలాడుతూ కనిపిస్తుంది.

చేనుకు నాలుగు దిక్కుల వారంరోజుల క్రితం పాతిన ఎర్రజెండాలు, యింకా అలాగే ఉన్నాయి.

కొందరు అడ్డందిడ్డంగా పెరిగిన దూర మీది చెట్లను నరుకుతున్నారు.

కొందరు చేలమధ్యలో పెరిగిన పరికి, తుమ్మ, దంతెలాంటి కంప చెట్లను నరుకుతున్నారు.

ఆడవాళ్ళు పిల్లలు భూమిపైన ఉన్న తుక్కుకట్టె ఏరుతున్నారు.

హఠాత్తుగా ఇంతలోనే రెండు పోలీసుజీపులు, ఒక వ్యాను దుమ్ము రేపుకుంటూ ఊళ్లోకి వచ్చి ఆగాయి. మరికాసేపట్లో దుమ్మురేపుకుంటూ ఆక్రమిత భూములవైపు పరిగెత్తాయి.

జీపులవెనక పడి ఊరి జనం కూడా ఉరికి వచ్చారు.

జీపుల్లోని జవానులు దిగడంతోటే, చేలలో పనిచేస్తున్న మగవాళ్ళను, ఆడవాళ్ళను లాఠీలతో కొట్టసాగారు.

వచ్చింది యిరవైమంది- అక్కడుంది తక్కువమంది.

కొట్టినచోట కొట్టకుండ కొడుతున్నారు.

ఎక్కడపడితే అక్కడ, ఎలా పడితే అలా కొడుతున్నారు.

జెండాలు పీకి, జీపులో పడేశారు.

కొట్టినంతవరకు తుక్కురేగ కొట్టి, "భూమి ఆక్రమిస్తార్రా భూమి, ఎవడికి పుట్టిన బుద్ధిరా ఇది. యెనక, అన్నల అండ చూసుకునే గద యీ నీలుగుడు. ఏది రమ్మను మీ అన్నలను వచ్చి కాపాడమను. చూస్తాం" అంటూ, కొడ్తూనే మగవాళ్ళను ఒక్కొక్కరిని వ్యాన్‌లో ఎక్కించారు.

పిల్లలు-ఆడవాళ్ళు ఏడుస్తున్నారు. శోకాలు పెడుతున్నారు.

కాసేపట్లో ఆ ప్రదేశమంతా, ఏడుపులు, పెడబొబ్బలతో నిండిపోయింది.

ఊరి వాళ్ళందరూ అలాగే చోద్యం చూస్తూ నిలబడ్డారు.

"అప్పుడు తినటానికి, తాగటానికి డబ్బులు తీసుకొని దానికింద భూమి యిచ్చేసి, యిప్పుడు, యిన్నేళ్ళ తరువాత, యీ నక్సలైట్లను చూసుకొని, వాళ్ళ అండతోని మల్లా భూమి కబ్జా చేస్తారా! మళ్ళీ యింకొకసారి, యింకొక్క మాటు యిలాంటి పనులు జేస్తే అక్కడే ఎన్‌కౌంటర్ చేస్తం. ఏమనుకున్నారో" అంటూ రెండు జీపులు, ఒక వ్యాను, గిరిజన యువకులతోపాటు కదిలిపోయాయి.

ఇదంతా చూసిన బొజ్జు, వెంటనే అల్లిగూడెం వెనుక, అడవి లోపలకు పరుగందుకున్నాడు.

★ ★ ★

ఊళ్లో ఏమన్న జరిగితే, చెప్పమన్నరు అన్నలు. ఏమ్మైనా జరుగుతదా? ఎప్పుడు చెప్తామా? అని బొజ్జూ మనసు ఉరకలు వేస్తోంది.

బొజ్జూ ఐదవ తరగతి చదివి మానేసాడు.

ఇంట్లో బొజ్జూకు ఎవరూ లేరు ఒక్క తల్లి తప్ప. భొజ్జు తండ్రి భొజ్జూ పుట్టకముందే పోయాడు. బొజ్జూ అంటే ఇసుబాయికి పంచ ప్రాణాలు. ఒక్క క్షణం కొడుకు కనుమరుగైతే తట్టుకోలేదు.

పొరుగూరు బడికిపోయి, చదువుకుంటా నంటే, ఒప్పుకునేది కాదు. రోజూ తల్లీ కొడుకుల పోరే. ఎలాగో తల్లిని ఒప్పించి, ఫక్కూళ్లో ఐదవతరగతి వరకు చదివి మానేశా డు. ఇంకా పైకి చదవాలంటే, తల్లి తనను వదిలి ఉండదని బొజ్జూకు తెలుసు. అందుకే చదువు పూర్తిగా మానేసి, తల్లికి తోడుగా ఉంటున్నాడు.

అంతో యింతో చదివిన బొజ్జుకు అన్నల న్నా, అన్నలు పాడే పాటలన్నా, వాళ్ళిచ్చే పుస్తకాలన్నా చాలా ఇష్టం.

ఎప్పుడు అన్నలొచ్చినా, వాళ్ళను ఎంతో ఆదరంగా చూసుకుంటాడు. తమ యింట్లో వున్న కలో గంజో పోసి, అంబలి రొట్టే ఏది ఉంటే అది పెడ్తాడు. భొజ్జు తల్లి ఇసూబాయి కి యివేమీ తెలియవు. ఆమె ఉట్టి అమాయ కురాలు. కొడుకు సుఖం తప్ప, యింకోటి తెలియని పిచ్చితల్లి.

రెండేసి రోజులు తను ఉపవాసం వుండి, కొడుకుకు సద్దికట్టి బడికి పంపిన రోజులు న్నాయి.

అలాంటి బొజ్జూ, నేడు అడవిలపడి, బరికా ళ్ళతో పరుగెత్తుతున్నాడు. అర్జంటుగా అన్నల ను కలవాల. అన్నలెక్కడుంటారో బొజ్జూకు బాగా ఎరికె.

అల్లిగూడెం గుట్టలవెనుక, ఒక నాలుగు పరధాను, రెండు కొలాము గుడిసె లుంటాయి. వాళ్ళు యాడాది పొడుగుతా ఆ గట్టుమీద పశువులు మేపుకుంటూ బతుకుతా రు.

పల్లెలో వర్షాకాలం రాగానే పాలివ్వని సూడుతో ఉన్న పశువులను గుట్టకు కొట్టిస్తా రు. అలా గుట్టకు కొట్టిచ్చిన పశువుల బాధ్య తను, యీ ఆరు కుటుంబాల పరధానులు, కొలాములు తీసుకుంటరు. దినమంతా పశు వులను గుట్టమీద మేపి, రాత్రి తెచ్చి గుడిసె ముందు కట్టేసుకుంటారు.

ఇలా పశువులను మేపి, భద్రంగా చూసు కున్నందుకు పల్లెజనం పశువుకు యింత అని, ధాన్యం కొలుస్తారు. ఆ ధాన్యమే వాళ్ళ జీవనాధారం. బతుకంతా ఆ గుట్టలపైనే. సంవత్సరానికి ఒకసారి, పాకలో పశువులు వేసిన పెంటను అమ్ముకుంటారు. ఆ డబ్బే వాళ్ళకు మిగులు.

ఆ గుట్టమీద పశువులపాకలు అన్నల స్థావరం. అది బొజ్జూకు తప్ప యింకొకరికి తెలియదు. భొజ్జు ఎవరికి చెప్పలేదుకూడా.

కాని, ఎన్నడో ఒకనాడు యీ ముసలితల్లి కాస్తా హరీ అంటే భొజ్జు ఎప్పటికైనా వాళ్ళతో నే కలిసే మనిషి అని ఊళ్లో ఇద్దరు ముగ్గురికి తెలుసు.

అరగంటపైనే పరుగెత్తి, భొజ్జూ గుట్టమీద గూడెం చేరాడు. కాని అక్కడ అన్నలు లేరు. అంతదూరం నుంచి, పరుగెత్తు కొచ్చిన శ్ర మంతా వృథా అయినట్లనిపించింది.

తల్లి అంగట్లో అమ్మి, డబ్బులు తెమ్మన్న మూటను కూడా అన్నలకే ఇద్దామనుకున్నా డు. తల్లి యిచ్చిన ఆ మూటలో బొజ్జుకు పెరట్లో పండిన కూరగాయలవీ ఉంటాయని తెలుసు.

అన్నలను ఎలాగైనా కలవాలని భొజ్జూ ప్రయత్నం. అక్కణ్ణించి బయలుదేరి, నడు స్తూ, అడ్డదారిన పడి, అన్నల యింకో స్థావ రంవైపు కదిలాడు.

రెండు గంటలు కష్టపడి నడిచి, అన్న లుండేస్థావరానికి దగ్గరయ్యాడు. వాగు దాటి తే ఫర్లాంగు దూరంలోనే అన్నల స్థావరం.

భొజ్జు అడ్డంపడి వచ్చాడు. అతడు నడి చింది అసలు ఓ దారి తెన్నూలేని, అడవి మధ్యలో వుండే గడ్డిమైదానం. రాళ్ళ మైదా నంలో పడి రావడంతో కాళ్ళన్నీ చిమచిమలా




డుతున్నాయి. వెంటనే వాగులోకి దిగి, నీళ్లలోకి నడుస్తున్నాడు. చల్లటి నీళ్ళు కాళ్ళకు తగిలి ప్రాణానికి హాయి అనిపించింది.

నీళ్ళలో నడుస్తున్న భొజ్జూకు రెండుదిక్కులా మృత్యువుపొంచి ఉన్న సంగతి తెల్వదు.

రెండు గంటలనుంచి నారాయణ దళానికి, పోలీసులకు హెూరాహెూరిన, కాల్పులు జరుగుతున్న సంగతి భొజ్జుకు తెల్వదు.

భొజ్జూకు గాలివాటం వ్యతిరేకంగా ఉండటంతో ఒక్క తుపాకి చప్పుడూ వినిపించలేదు. వాగులోపడి నడిచి హఠాత్తుగా మధ్యలో కొచ్చిన భొజ్జూపై. అటు పోలీసుల దృష్టి, ఇటు నారాయణ దళం దృష్టి ఒకేసారి పడింది.

పోలీసులకు భొజ్జూ మధ్యలో రావడం కన్నా, భొజ్జూ భుజాన ఉన్న మూట వాళ్ళను కలవరపరచింది. ఒక్కక్షణం ఆ భుజాన వున్నవి ఏ బాంబులో అని అనుమానించారు. వెంటనే ఒక తూటా భొజ్జూ శరీరంలోంచి దూసుకుపోయింది. తూటా వెనకనించి రావడంతో భొజ్జూ అరుస్తూ ముందుకు పరిగెత్తాడు. భొజ్జూ వెనక తూటాల వర్షమే కురిసింది. కానీ మళ్ళీ ఒక్క తూటా కూడా, భొజ్జూ శరీరాన్ని తాకలేదు.

నారాయణ కళ్ళముందే, చూస్తుండగానే, ఒక అమాయకుడు రక్తసిక్తమై, స్పృహ తప్పి పడిపోయాడు.

తూటా దెబ్బతిని వెనుకడుగు వేయక, మెరుపువేగంతో పరిగెత్తి నారాయణ దళంలో కలిసిన భొజ్జూను చూసి, పోలీసులు, అటుదిక్కు చేరినవి నాటు బాంబులో ఏమో! వాటి శక్తి ఎంతో తెలియక ఒక అడుగు వెనక్కి వేశారు. అదే అదనుగా తీసుకొని అన్నలు కాల్పులు ఆపి తప్పించుకున్నారు.

ఊపిరాడుతున్న భొజ్జూను నారాయణ భుజాన వేసుకొన్నాడు. ఇంకా ఎన్‌కౌంటర్‌లో గాయపడిన మరో నలుగుర్ని కూడాతీసుకొని నారాయణ బృందం గూడెంవైపు కదిలారు.



అంగడికి వెళ్ళిన కొడుకు జాడకోసం దూరంగా కనిపించే మట్టిబాటవైపు మాటిమాటికీ చూపు సారిస్తోంది ఇస్రూబాయి. ఆమె ప్రాణాలన్నీ అంగడికెళ్ళిన కొడుకుమీదనే. కడుపున పడ్డవాళ్లందరూ ఏడాది తిరక్కుండానే కన్ను మూస్తే యీ బతికున్న కొడుకును కడుపున వేసి తాను కాటికెళ్ళాడు మొగుడు. మొగుడు పోయాక పంచప్రాణాలూ కొడుకుపైనే పెట్టుకుని బతుకుతోంది ఇస్రూబాయి. వస్తున్న సమయానికి కొడుకు రాకపోతే ఆ తల్లికి ఇంకేమీ తోచదు. వాడికోసం ఎదురుచూడ్డంతోనే సరిపోతోంది. కొడుకు అడవికి కట్టెలకెళ్ళినా, గడ్డికెళ్లినా, ఇప్పపువ్వుకెళ్ళినా అడవినుండి కొడుకు తిరిగివచ్చేవరకు ఆ తల్లి మనసు మనసులో ఉండదు.

కొడుకు కదలికల్ని అనుక్షణం వూహించుకుంటా వుంటుంది ఆ తల్లి మనసు. తన కొడుకు యీపాటికి ఇంద్రవెల్లి అంగడినుండి బయలుదేరి ముత్‌నూర్ వరకు వచ్చి వుంటాడు. అక్కడినుండి ఎంతలేదన్నా నాలుగు మైళ్ళు... ఓ గంటలో వచ్చేస్తాడు.

పెరట్లో పండిన కూరగాయలు, మిరపకాయలూ, పత్తీ- అవీ అంగడికి పట్టుకొని పోయాడు. అవి అమ్మితే ఎంతలేదన్నా పది రూపాయలు వస్తాయి. వాటితో వారానికి

సరిపడా దీపాలకు మంచినూనె, చాయపత్త బెల్లం తెస్తాడు. తేగానే పత్త బెల్లంవేసి డికాషన్ చాయ్ చేసుకొని తాగాల. చాయ్ తాగి ఎన్నాళ్ళయింది! బెల్లంవేసి రాచగుమ్మడి కాయ బజ్జీలు చేయాలి. భొజ్జూకు గుమ్మడి కాయ, బెల్లం బజ్జీలంటే ఎంతో యిష్టం.

"పొద్దు అప్పుడే అడ్డం పడింది. పొద్దున నంగ యింత సద్దికూడు తినిపోయిండు కొడుకు. ఇంకా రాకపాయే! ఆడు వచ్చేవరకు ఇంత వుడికేద్దం" అనుకున్న యిస్రూబాయి ఒక పిడక తీసుకొని గబగబా పక్కింటికెళ్ళి నాలుగు నిప్పురవ్వలు తెచ్చి పొయ్యి అంటించిది. అంటుకున్న పొయ్యిమీద ఎసరుపడేసింది. పెరట్లోకెళ్ళి యిన్ని చిక్కుడు కాయలు తుంచుకొచ్చి మళ్ళీ దూరంగా కనిపించే బాటవైపు చూస్తూ చిక్కుడుకాయలు గిల్ల సాగింది.

బాటకేసి చూస్తూన్న యిస్రూబాయికి సుడిగాలి రేపిన దుమ్ము మూలంగా ఏమీ కనిపించక సుడిగాలిని మనసులోనే తిట్టుకుంది. గిల్లిన చిక్కుడుకాయలనుపక్కన పడేసి, ఒక చారెడు నువ్వులు తెచ్చి రోట్లో పోసి, యిన్ని నీళ్ళు చల్లి కచ్చపిచ్చగా దంచి ఒక గుడ్డలో వేసి గిన్నెలోకి వడగట్టి పిండింది. నూనె చమురు చుక్కలు చుక్కలుగా గిన్నెలోకి జారింది.

నూనెగిన్నె పట్టుకొని మరోమారు దూరానికి చూపు సారించింది. సూర్యుడు కళ్ళకు అడ్డంపడి చూపు ఆనడంలేదు. ఎండకు చేయి అడ్డం పెట్టి మరీ చూసింది. ఎక్కడా మనిషి జాడే లేదు.

గటకను మరుగుతున్న ఎసట్లోపోసి కలియబెట్టి, నాలుగు మిరపకాయలు నిప్పుల్లో పడేసింది. నిప్పుల్లో కాలిన మిరపకాయలంటే భొజ్జూకు చాలా యిష్టం. ఎంతో కారంగా వున్నా "ఉష్... ఉష్'' అని వూదుకుంటూ ముద్దలు ముద్దలుగా జొన్న గటకను మింగే కొడుకు రూపం గుర్తొచ్చి, "పిచ్చి తండ్రి'' అనుకొంటూ మనసులోనే మురిసిపోయింది. ఎంత మనసులో మురిసినా, ఆ మురిపెం తాలూకు కాంతి ఆ తల్లి ముఖంలో, కళ్ళల్లో మెరవకపోలేదు.

అంతలోనే దూరంనించి వస్తూన్న వో మనిషి కనిపించాడు. దూరంనించే అయినా గ్రహించింది, వచ్చేది భొజ్జూ కాదని. వచ్చే మనిషిని దగ్గరదాకా రానిచ్చి పలకరించింది. అతను కొడిమెత బద్రు.

"ఎక్కన్నించి రాకడ? ఇంద్రవెల్లి అంగడికెళ్లేనా?" అనడిగింది. ముసలాయన భుజాన వున్న చిన్న మూటను చూసి, అంగడినుంచే వస్తున్నాడనుకొని.

"ఇంద్రవెల్లి పోలే ఇక్కడ్నే ముత్నూర్ల సడకుమీద కొనుక్కొస్తున్న సామాన్లు. ఇయ్యాల అటు అడీల పెద్ద జంగ్ అయితందట. ఇంద్రవెల్లికి పోయినోల్లందరిని పోలీసులు పట్టుకుంటుండ్లట, మంది అనుకుంటుండ్లు. బస్సులు సుగసరిగ నడుస్తలేవు. అందుకనే ఈడనే మన సడకమీద... పోతెపాయె నాల్గు . పైసలెక్కువని సామాన్లు గొనుక్కొని రావట్నె!" అంటూ ఇంటి చూరుక్రింద గద్దెమీద కూర్చొని, తలపాగా విప్పి ముఖానికి, చేతులకు పట్టిన చెమటను తుడుచుకుని,

"కొన్ని తాగేటీల్లియ్యవ్వ, నోరెండిపోయింది. సడకుమీద వోటల్ల నీల్లడిగితె 'చాయ్ దాగితెనే నీల్లిచ్చేది లేకుంటే యియ్యమ'ని! గా యెండల నీల్లకోసం చాయ్ దాగుడేందని తాగలే. పైసలు గూడ లేకుండెగని! కలికాలం! మంది పైసలకు మరిగిండ్రు, తాగేనీళ్ల గ్గూడ పైసలడుగవట్టిరి!" అంటూ చెప్పుకుపోతున్నాడు. ఇంట్లోకెళ్ళి కుండలోంచి ముంతతో ముంచి నీళ్ళు తెచ్చియిచ్చింది యిస్రూబాయి.

బాగా దప్పిమీదున్నాడేమో ముసలాయన. గటగటా నీళ్ళు తాగుతూండడం చూసి, "జర మెల్లెగ దాగు! ఎండనబడి వొస్తివి, ఆత్రంగా దాగితే ఎండదెబ్బ గొడ్తది'' అనడంతో ముసలాయన నిజమేనన్నట్లు




తలూపి ముంత పక్కనబెట్టి కొంచెం దమ్ము తీసుకున్నాడు.

తాగిన నీళ్ళు తాగినట్లే చెమట రూపంలో బయటకు రాసాగాయి. వేడిగా వీస్తున్నగాలి, ముసలాడి శరీరానికి శీతల పవనంలా తోచి ప్రాణం తెరిపిన పడ్డట్లు అనుభూతి చెందాడు.

"ముత్నూరుదాక పొయినవు గదా! మా భొజ్జూగిన గనపడ్డడా? పొద్దుననంగ వొయిండు యిందర వెల్లి అంగటికని. ఇంక రాకపాయె! ఎంతాకలిగొన్నడో యేమొ'' అని అడిగింది యిస్రూబాయి.

"భొజ్జూ గనపడ్లేదుగని బాయి, ఆ పెటో ఆడీల రాతిరినుంచి పోలీసులకు అన్నలకు జంగ్ నడుస్తాందట. ఆల్లూ-యిల్లూ అను కుంటుంటే యినవడె! ఇంద్రవెల్లి వూర్లగూడ అంతట పోలీసులేనట! వూర్ల అంగట్లకు మన గోండ్లను, కొలాంలను, నాయికపోండ్లను ఎవ్వాల్ని రానిస్తలేరంట! యెందుకో- ఆల్లకేం రోగమో!" అన్నాడు బద్రు రహస్యం చెప్తున్న ట్టుగా.

అది విన్న యిస్రూబాయి మనసు పరిపరి విధాల కొట్టుకోసాగింది. పొయ్యిమీది గటక మాడువాసన వేయడంతో "గట్క మాడ్తున ట్టుంది గదా!" అన్న వృద్ధుడి మాటలకు తేరుకొని, అన్యమనస్కంగానే లోపలికి వెళ్ళి గటక కూడా పొయ్యిమీదినుంచి దించి, దాని స్థానంలో వో సత్తుగిన్నె పొయ్యిమీద పడేసి, నువ్వులు దంచి తీసిన నూనెపోసి యాంత్రి కంగానే పోపు సామాన్లు వేసి అందులో గిల్లిన చిక్కుడుకాయలు వేసి, కలిపి మూత పడే సింది. ఈ పన్లన్నీ చేస్తున్నప్పుడు కూడా ఆ తల్లి మనస్సు కొడుకును గూర్చి ఆలో చించడం మానలేకపోయింది.

"ఇంద్రవెల్లికి మా మందిని ఎందుకు రాని స్తలేరో! మరి భొజ్జు ఎక్కడ వొయిండో! వూర్లెకు వాల్లు రానియ్యకపోతే ఎనిక్కి దిరిగి యిప్పడికే యింటికొచ్చేదుండె! యింటికి రా కుండా యింతసేపు ఎక్కడ దిరుగుతున్నడో! యెందుకు దిరుగుతున్నడో! యింటికాడ నేనె దురుసూస్తున్ననని అనుకుంటలేడా? నన్ను మర్సిపోయిండా యెట్లా?" అన్న భావం రాగానే ఆమె మనస్సు ఉలికిపడింది! "ఇ దేంది! నేను నా కన్నతండ్రిమీద గిట్లెట్ల అనుకుంటున్న! సీ! ఆడెంత కష్టంల వున్న డో!" అనుకొని క్షణకాలం తనసుతనే అస హ్యించుకొని, కొడుకుని క్షేమంగా యిల్లు చేర్చమని తమ ముప్పైమూడు కళ్ళాల దేవ తలనూ మనస్సులోనే ప్రార్థించుకుంది.

బాగా అలసిపోయిన కారణంగా ఇవేవీ పట్టించుకోకుండా ఓ కోడికునుకు తీసిన చూ రుకింది వృద్ధుడు చటుక్కున మెలకువ రావ డంతో ప్రొద్దుకుంకుతుండడం గ్రహించి "యి స్రుబాయీ! యిగ నేను వోతున్న! వూరుజేరేట ప్పడికి సీకటయ్యేటట్లుంది, మనాదిపెట్టు కోకు, అంగడికి పోయిన కొడుకు రాకపోత డా!" అని ఆమె సమాధానానికి కూడా ఎదురుచూడకుండా భుజంమీది మూట సర్దు కొని బయల్దేరాడు.

వృద్ధుడి మాటల్తో ఇహంలోకి వచ్చిన యిస్రుబాయి మనసు అతను వెళ్ళిపోగానే, అంతకు మునుపు వృద్ధుడు చెప్పిన 'జంగ్' సంగతి జ్ఞాపకంవచ్చి, గతంలోకి, తన చిన్న నాటి విషయాల్లోకి జారుతోంది. ఏవేవో చేదు జ్ఞాపకాలు మెదడు పొరల్లోంచి పైకి తన్నుకు వస్తూంటే.

అప్పుడెప్పుడో తను సమర్తాడి మూలన కూర్చున్న రోజుల్లో విన్నది. పట్నంలో వుండే తురక రాజుకు గోండ్లకు నడుమ 'జంగ్' జరిగిందని! 'జోడెన్‌గాట్'ల జరిగిన ఆ 'జంగ్'లో తురకరాజు బందూకులతో పంపిన .మంది కొన్ని నూర్లగోండ్లను, కొలాములను, నాయిక పోల్లను, పిట్టల మెరం కాల్సి సంపిండ్లట! కొమురం భీము కూడా ఆ లడాయిల్నే సచ్చిండట! ఘరిగ అప్పట్నుండి జంగులు, లడాయిలు ఏం లేకుండెగని మల్ల పదేండ్లకింద ఇంద్రవెల్లిల జంగ్లై శనామంది సచ్చిరి. ఇగ అకాడికెల్లి సిన్నదో పెద్దదో

ఎదోవొగ లొల్లి అయితనేవుంది. పానాలు పిడికిట్ల వట్టుకొని బతుకుడైతున్నది.

మల్ల అడీల ఏందో జంగ్ జరుగుతున్న దట. మరిగ యిప్పుడెన్ని నూర్లమంది పానా లు బోతయో! ఏదేమయిన "కొడుకు భొజ్జూ సల్లంగ యిల్లు జేరితే వొచ్చేయేడుకు కే స్లాపూర్ నాగోబ దేవునికి కోడిపెట్టనిచ్చి బోనంయేస్త'' అని మనసులోనే మొక్కు కుంది. "ఏ దిక్కులేక పానాలన్ని కొడుకుమీ న్నే పెట్టుకొని బతుకుతున్న యీ ముసలితల్లి కడుపుల మంటవెట్టకు'' మని పెద్ద దేవుడు "పేరక పెర్స''కు కూడా మొక్కుకుంది.

"మనకిష్టమైంది దేవుని పేర్న యిడిసిపె డితే దేవుడు కోరిక తప్పక తీరుస్తా''డని భొజ్జూ గనుక సల్లంగా యిల్లుచేరితే బతికిన న్ని రోజులు దేవుని పేర్న తనకెంతో యిష్ట మైన "చాయ్'' తాగడం మానేయాలని కూడా గట్టిగా నిర్ణయించుకుంది.

కొడుకు క్షేమంగా రావాలి. సల్లంగా వుండాలి! అందుకేమైనా చేస్తానంటుంది, ఆ ముసలితల్లి మనసు.

చూస్తూండగానే పొద్దు కొండల చాటుకు దిగిపోయింది. యుద్ధం ముగిశాక రక్తంతో ఎర్రబడ్డ యుద్ధభూమిలా ఆకాశం ఎర్రబ డింది. ఏడు గంటలైనా ఇంకా చీకట్లు ముసు రుకోలేదు. కొడుకుమీది ఆలోచనల్తో సతమత మౌతున్న ఇస్రుబాయి పొయ్యిమీది శూర మాడిపోవడంగానీ కట్టెలు ఎగదోయకపోవ డంతో మంట ఆరిపోవడంగానీ గమనించలే దు.

మనస్సు ఉండబట్టలేక ఇరుగుపొరుగు ఇండ్లకు వెళ్లి సమాచారం సేకరించింది. ఇంద్రవెల్లి అంగడికి తన కొడుకేగాక తమ గూడెంనుండి ఇంకా చాలామంది వెళ్లినట్లు తెలిసి కొంచెం ఊరడిల్లింది.

ఆ వూరికి పదకొండు గూడేలున్నాయి. ఇక్కడ పది, అక్కడ పది యిండ్ల చొప్పున ఎక్కడ అనుకూలంగా వుంటే అక్కడ గూడే ల్ని ఏర్పాటు చేసుకుంటారు గిరిజనులు. తమ చేలకు దగ్గరగా వుండొచ్చునని కాపలా కూడా సులభమౌతుందని వాళ్ల ఉద్దేశం.

తిరిగి ఇల్లు చేరిన యిస్రుబాయికి ఇల్లు చీకటి గుహలా కనిపించింది. వారంరోజులు గా ఇంట్లో కిరోసిన్ లేదు గనుక దీపంలేదు. అయినా చీకటి ఆమెను భయపెట్టలేకపో యేది. కాని ఇవ్వాళ అదే చీకటి మృత్యుదూత లా కనిపిస్తూ ఆమె మనోధైర్యాన్ని దెబ్బతీ స్తోంది.

ఆదరాబాదరా ఇంటి వెనక్కి వెళ్లి ఇన్ని బుదుగులు పుంటికర్ర, నువ్వుకర్ర తెచ్చి పొయ్యిలో కొనప్రాణాల్తో వున్న నిప్పురవ్వల సాయంతో మంటేసింది.

నిలువెత్తు మంట చీకటిని మింగేసి దిక్కు లకు వెలుగుల్ని వెదజల్లడంతో కొండంత ధైర్యం వచ్చినట్లయింది. కాని అంతెత్తు మంట పది నిముషాల్లో కూలి బూడిదై మళ్లీ చీకటి పొరలు కమ్ముకున్నాయి. ఇస్రూబాయి ఒక ఇప్ప మొద్దు తెచ్చి మంటలో పడేసింది. మొద్దు చిటమటమంటూ మెల్లగా అంటు కొంటోంది. కాలం భారంగా గడుస్తోంది.

ఇంట్లోకెళ్లేందుకు ధైర్యం చాలక అక్కడే మంట దగ్గర కొంగు పరుచుకొని నడుం వాల్చింది. మధ్యాహ్నంనుంచి ఆలోచనలతో సతమతమౌతున్న ఇస్రూబాయికి మెల్లగా కన్నంటుకుంది.

పెద్దగా చప్పుడు కావడంతో ఉలిక్కిపడి లేచింది ఇస్రూబాయి. దూరంగా గంటల చప్పుడుతో వేగంగా పరుగెత్తి వస్తూన్న బండ్ల చప్పుడుతో నిద్రమత్తు పూర్తిగా వదిలిపో యింది.

క్షణాల్లో గూడెం చేరుకున్నాయి బండ్లు. ఒక బండి ఇస్రూబాయి దగ్గరగా వచ్చి ఆగింది. బండిలోంచి ఒక ఆకారాన్ని చేతుల మీద మోసుకొచ్చి ఇస్రూబాయి ముందు నిలబెడుతూ చెప్తున్నారెవరో.

"అడీల పెద్ద లడాయి జర్గింది. బొజ్జుకు




బందూకు గోలి తగిలింది. ఇంట్లకు దీస్కపో! మేము యింకా యీల్లందరిని ఎవరింట్ల వాల్లను దించి మల్లొచ్చి సూస్తం" అంటూంటే ఆమె గుండె ఒక్కక్షణం ఆగి పోయి కొడుకుకోసం మళ్లీ కొట్టుకోసాగింది.

"బొజ్జూ! నా కొడుకా!" అంటూ ఘొల్లు మంది.

"ముందుగ ఆన్ని లోపలిగ్గొండవో" అంటూ తామే బొజ్జును మోసుకెళ్లి ఇంట్లో ఈతచాప పరిచి పడుకోబెట్టారు వచ్చినవా ళ్లు. బొజ్జుకు స్పృహ లేదు. చిన్నగా మూలు గుతున్నాడు.

"ఇన్ని మంచినీల్లు దాపు" అని ఎవరో అంటే ఏడుస్తూనే ముంతతో నీళ్లు తెచ్చి కొడుకు నోటికందించింది. బొజ్జు నీళ్లు తాగ లేక చొంగలా కార్చాడు.

"అయ్యో కొడకా! ఎట్లయితివిరా? పొద్దున మంచిగుంటివి. గింతలకే గిట్లయితివేమిరా! వోరి బొజ్జూ! ఒక్కసారి కండ్లు దెరిసి సూ డరా! మాట్లాడరా!" అంటూ కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూంది ఇస్రూబాయి.

ఇంకా తూటాలు తగిలి పడిపోయినవా రూ, ప్రాణాలు పోయిన వాళ్లూ బళ్లనిండా వున్నారు. ఒకటే మూలుగులు! గాయాల్లోంచి కారిన రక్తంతో బండ్లన్నీ తడిసిపోయి వున్నాయి. వాళ్ల రక్తంతో తడిసిన నేల ఆ చీకట్లో మరీ నల్లగా కనిపిస్తోంది.

ఇంద్రవెల్లినుంచి గూడెంవరకు ఏకబిగిన ఉరికి రావడంతో ఎద్దులు దమ్ముతో గసపోస్తు న్నాయి. క్షణంక్రింతదాకా ప్రళయనాట్యం చే స్తూన్న రుద్రుడి గంటల్లా మోగిన ఎద్దుల మెడలోని గంటలు ఇప్పుడు మూగబో యాయి. ప్రకృతి స్థంభించినట్లు, కాలగమనం ఆగిపోయినట్లు భయంకర స్థబ్దత! ఎద్దులు గసపోస్తూన్న కదలిక తప్పితే, అవీ శిలాప్రతి మల్లాగే ఉన్నాయి. వాటి దేహాలమీది చెమట ధారలు, భూమిపై పడిన రక్తాన్ని పల్చబరు స్తున్నాయి.

"బందూకు దెబ్బలు ఎక్కడెక్కడ దగిలి నైరా?" అని అడిగింది ఇస్రూబాయి కొడుకు వొళ్లంతా సున్నితంగా తడుముతూ. బొజ్జు శరీరమంతా రక్తసిక్తమై వుండడంతో ఆ చీక ట్లో తూటా దెబ్బలు ఎక్కడ తగిలిందీ తెలుసుకోవడం సాధ్యపడడం లేదు ఆ తల్లికి.

"ఒక గోలి ఛాతిల తగిలింది. ఇంకోటి చెంపకు తగిలి బైటకెల్లింది" అంటూ వివ రించాడో గోండు యువకుడు.

"యెనిక్కెల్లి పోలీసోల్లొస్తున్నరు. తలుపు లు దగ్గెరికేసుకో! ఏడుసుడు, మొత్తుకునుడు జేయకు! మేం యీల్లందరిని ఎవరిండ్లల్ల వాల్లను జేర్పిచ్చి మల్ల వస్తం!" అంటూ హడావుడిగా వెనుదిరిగారు వచ్చినవాళ్లు.

మళ్లీ బండ్లు ముందుకు కదిలాయి. ఒక సారి వీపుపై చరిచి, తోకలు మెలిపెట్టి తిప్పి వదిలేసరికి మళ్లీ పరుగు లంకించుకున్నాయి ఎద్దులు. చూస్తూండగానే గంటలమోత ఉధృ తమై మరికాసేపట్లోనే దూరమైపోయింది.

ఈతకమ్మల చాపపై చింకి బొంతలో పడుకుని ఉన్న బొజ్జుకు స్పృహలేదు. ఉండీ ఉండీ మూలుగుతున్నాడు. బాధను తట్టుకో లేక ఒళ్లు విరుస్తున్నాడు. పళ్లు గిట్టగరుస్తున్నా డు.

దీపం ముట్టించి వెలుగులో కొడుకును చూసుకోవడానికి ఆ గుడిసెలో గరిటెడు నూనె లేదు. బయటికి వెళ్లి నాలుగు కర్రలు, ఇంత పుంటికట్టె తెచ్చి నట్టింట్లో మంట రాజేసింది ఇస్రూబాయి.

ఇంతలో బిలబిలమని ఒకర్నొకరు తోసు కొంటూ పోగయ్యారు గూడెం జనం. ఎవరికి తోచిన సహాయం వాళ్లు చేస్తున్నారు. ఒకరు ఏ గుడిసెలోంచో యింత యిప్ప పరక నూనె తెచ్చి దీపం వెలిగించారు.

ఒకరు బొజ్జు శరీరం చల్లబడుతుండడం గ్రహించి అరికాళ్లు, అరిచేతులు రుద్దసాగారు. వీళ్లందరి రాకతో కొంత తేరుకున్నా తానేం

చేయాలో తోచక కొడుకు తలను వొళ్లో పెట్టుకుని ప్రేమగా నిమురుతూ ఏడుస్తోంది ఇస్రూబాయి. కాసిన్ని నీళ్లు కడుపులో పడితే రక్తస్రావం ఆగిపోతుందని నీళ్లు తాపేందుకు ప్రయత్నించారు. కాని విశ్వప్రయత్నం చేసినా ఒక్క చుక్క నీళ్లు కూడా బొజ్జు గొంతులోకి దిగలేదు.

"నాగసరం తీగ, బంతి ఆకులు నూరి గాయాలమీద గట్టుంగ్రిరా జెల్ది'' అన్న ఓ వృద్ధుని మాట వినగానే ఒక యువకుడు బాణంలా పరుగెత్తి తమ లోగిల్లోని నాగసరం ఆకులు, బంతి యాకులు తెచ్చి యిచ్చాడు. లచ్చు ఆ రెంటినీ రోట్లో వేసి దంచసాగాడు.

ఇలా ఎవరికి తోచింది వాళ్లు చేస్తూ బొజ్జును కాపాడేందుకు శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. కాని బొజ్జు శరీరం పూర్తిగా చల్లబడింది. మనిషి పోయినట్లే వున్నాడు. అయినా వాళ్లెవరూ ఈ సంగతి గమనించినట్లు లేదు.

అంతలోనే పక్క గూడెంనించి ఇద్దరు యువకులు గసపోస్తూ పరుగెత్తుకుంటూ వచ్చి "పోలీసులు, బందూకు దెబ్బల్దిని తప్పిచ్చుకున్న మందికోసం యీ పక్క గూడేలన్నిట్లా లెంకుతున్నరట. మార్కాపురం దనుక వచ్చిండ్లట. జర బద్రంగుడుండ్లి'' అని చెప్పి అక్కడ తమ పనయిపోయిందన్నట్లుగా మరోగూడెంవైపు పరుగు లంకించుకున్నారు.

క్షణకాలం నివ్వెరపోయి తేరుకున్నారు అక్కడున్నవాళ్లంతా. "ఇగిప్పుడేం జేద్దం! బొజ్జు జాడ దెలిస్తే పోలీసోల్లు ఆన్నేగాదు మనల్ను గూడ యిడిసిపెట్టరు. వాల్ల చేతుల్ల జిక్కితె రానా సుట్టు దిరుగుడు, కోరట్లు... కేసులు... గియ్యన్ని మనతోటి గాని పన్లు. అందుకే గడిసేపటికోసం బొజ్జును 'ఎక్కడన్న దాయాలె. మల్ల సంగతి మల్ల జూసుకోవచ్చు'' అన్నాడొక అనుభవజ్ఞుడు.

"ఎక్కడ దాసుడు? ఎట్ల జేసుడు? మనిసి మన ఖ్యాల్లనే లేడు. అసలు వున్నడో వూడిండో గూడ ఏర్పడుతలేదు'' అన్నారింకొకరు.

"గట్లంటె యెట్ల! ఏదో వొకటి జెయ్యాలె. మన మనిసిని మనం మనిసేంది - పీనుగయినాగని దక్కిచ్చుకోవాలె. లేకుంటె ఆ పోలీసుల సేతుల్ల మనందరం పీనుగుల మైతం" అన్నాడు తను పొందిన పోలీసు సత్కారాలు జ్ఞప్తికి వచ్చి వెన్నుపూస వణికిన మరో అనుభవజ్ఞుడు.

అంతవరకు బొజ్జు నాడి పట్టి చూస్తున్న లచ్చు గొల్లుమంటూ "అయిపోయింది. బొజ్జు ఇగ మనిసిగాదు. మనల్నిడిసిపెట్టి పోయిండు. పానంబోయి వుట్టి కట్టె మిగిలింది'' అనడమే ఆలస్యం.

ఇంతమంది యిన్ని రకాలుగా ప్రయత్నిస్తూంటే చూసి తన కొడుక్కు ఏం కాదని కొంచెం ధైర్యంగా వున్న ఇస్రూబాయి "నా కొడుకో! నన్నిడిసిపెట్టి పోయినావురా! నీవు లేకుండ నేనెట్ల బతుకుదురా! యీ దేవుడు నన్ను గొండబోక నిన్నెందుకు దీస్కపోయిండురా!" అంటూ తల నేలకేసి బాదుకొంటూ ఏడవసాగింది. నుదురు చిట్లి రక్తం ధారగా కారుతోంది.

అక్కడున్న వాళ్లందరికీ ఇస్రూబాయి జీవిత విషాద గాథ తెలిసిందే. ఉన్న ఒక్క కొడుకూ పోయిన దుఃఖాన్ని ఆ ముసలి తల్లి తట్టుకోలేదనీ తెలుసు. అయినా ఎవరికి తోచినట్లుగా వాళ్లు ఆమెను ఊరడించడానికి ప్రయత్నిస్తున్నారు. పోలీసుల రాకను గూర్చిన భయం వారి మనసుల్లో తాత్కాలికంగా అడుగున పడిపోయింది.

ఇస్రూబాయి తల నేలకు బాదుకోకుండా వొడిసి పట్టుకున్నారొకరు.

"నా కొడుకో! నన్నెవరి బరోసామీద యిడిసి పెట్టి పోతివిరా! నా కొడుకా! నీ అచ్చట ముచ్చట నేను కండ్లజూడకపోయితి గదరా! నా కడుపుల యింత పెద్ద మంటవెట్టి పోతివిరా కొడుకా! నానోట్ల మన్నువోసి పోతి





వేందిరా కొడుకా! నన్ను దిక్కులేని పచ్చిని జేసి పోతివిగద కొడుకా! నేనిగ ఎవర్ని జూసుకునెటందుకు బతుకాల్రల కొడుకా!" అంటూ ఎదల్ని బాదుకొని ఏడవసాగింది.

"వూకుండు యిస్రూబాయి! వూకుండు! యేడుస్తే పోయిన నీ కొడుకు మల్లొస్తడా! మనసు దయిర్నం జేస్కోవాలె' అని ఎవ్వరో ఊరడించబోయారు.

లచ్చు వారించాడు. తానూ కన్నీళ్లు కారుస్తూనే "ఏడ్వనీయండ్లి. దాని కడుపు కోత దానికే యెరుక. కొడుకు పోయినంక యిగేం మిగిలింది దానికి? గుండెల్ల బాదంత బైటవడెడిదాంక యేడిస్తెనన్న దానికింత సమదానమైతది. పాపం! ముండ బొడ్డి కొడ్కును జూసుకోని బత్కింది యిన్నొద్దులు. పువ్వు మరంగ వెంచుకున్నది. పరాయి మనిసి తాన జీతం జేస్తె నాల్గు కొత్తలు యెక్కువొస్తయని వాడు జీతం జేస్తనన్న సుగ, జీతమంటె కొడుక్కు తిప్పలైతదని వున్న భూమిల్నె రెక్కలిరుగంగ మొగోనిమెరంగ కస్టపడి వాన్ని సాకింది. తిండి సాలకుంటె వానికి బెట్టి అది వుపాసం బన్నది. కొడుక్కు గట్కవెట్టి అది ముట్టి గడ్డలు దిన్నది. అసుంటి కొడుకు యిప్పుడు దాన్నిడిసి పొయిండు. ఆ దుక్కం దానికెరుక, ఆ దేవునికెరుక. ఏడ్వనియ్యుండ్లి దాన్నాపకండ్లి'' అన్నాడు లచ్చు.

ఆ మాటల్తో అందరూ ఇస్రూబాయి గత చరిత్ర జ్ఞప్తికి తెచ్చుకొని లోలోపలే జాలిపడ్తున్నారు. రామదాసు ఆ జాలిని హృదయంలో దాచుకోలేక బయటపడి, "ఏం జేస్తం! దాని కిస్మత్‌ల గింత గోరం రాసిండు దేవుడు'' అంటుండగానే దూరంగా జీపుల రొద, హారన్ల చప్పుడు విన్పించాయి. దాంతో వర్తమానాన్ని సమాధిచేస్తూ ఉవ్వెత్తున గుబులు ఉప్పొంగింది అందరి గుండెల్లో. అందుకు కారణం గతంలో ఆ గూడేల్లో పోలీసు జీపులు, బూట్లు, బందూకులు, వాటి బాయినెట్లు, తూటాలూ సృష్టించిన ఘోరాల తాలూకు భయంకరమైన చేదు అనుభవాల జ్ఞాపకాలే! అవి యెంత తీవ్రమైనవంటే అక్కడివాళ్లందరూ తక్షణమే బొజ్జు మరణాన్నీ, ఇస్రూబాయి ప్రస్తుత నికృష్ట, నిస్సహాయ స్థితినీ కూడా మరిచి ఎవరి గుడిసెలవైపు వారు పరుగు లంకించుకున్నారు.

చివరకు ఇస్రూబాయిని స్వంత కూతుర్లా అభిమానించే లచ్చు కూడా కీళ్ల నొప్పుల్తో లేవనివ్వని మోకాళ్లపై అరచేతులు ఆనించి అతి కష్టంమీద లేచి "ఇస్రూ! మన దినాలు మంచిగ లేవు. వొచ్చే కష్టమేగాని పోయే కష్టం లేదు. నీ కర్మ గిట్లేడిసింది గాని పీనుగును పోలీసోల్ల కండ్లల్ల వడకుండ ఎట్లనన్న ఎక్కడనన్న దాసవెట్టు జల్దీ. లేకుంటె మొత్తం గూడేనికే ముప్పు దప్పది! నివ్వు గూడ మనసు రాయిజేసుకో బిడ్డ! ఆ కటికోల్ల ముందల కన్నీల్లు గారినా తిప్పలే బిడ్డ! ఇగ నేను గూడ పోతున్న నన్ను తప్పు వట్టకు బిడ్డ! ఆ నాగోబ దేవుడు నిన్ను గాపాడాల్నని మొక్కుకుంట" అంటూ కన్నీటి పొరల్లోంచి అస్పష్టంగా కనిపిస్తోన్న దారివెంట తడబడుతూ మనస్సు బిగబట్టుకుంటూ సాగిపోయాడు.

ఇక గుడిసెలో మిగిలింది యిద్దరే. ఒక జీవచ్ఛవం ఇస్రూబాయి, బొజ్జు మృతదేహం. ప్రాణాల్ని ఎప్పుడో పోగొట్టుకున్న కొడుకు శవం కూడా ఆ తల్లికి అపురూపమే. ఆ శవాన్ని పదిలంగా గుడిసెలో ఒక మూలకు జరిపి, ఇంట్లో వున్న పాత బట్టలన్నీ దానిమీద కప్పి, పక్కనే కూర్చుంది లోపల్నించి తన్నుకొస్తోన్న దుఃఖాన్ని దిగమింగుతూ.

కాలం పూర్తిగా స్థంభించి, ఆ కరుణాపూర్ణ దృశ్యాన్ని చూస్తూ ఆ గుడిసెలోనే వుండిపోయింది.

ఇంతలో తలుపు సందుల్లోంచి గుసగుసగా చెప్పేరు "పోలీసులు, గూడేలన్నిట్ల లెంకుతున్నరట, బొజ్జు దాదను కనిపీయకుండ ఏడ్నన్న దాసిపెట్టమని చెప్పిండు లచ్చుకాక! గా పని జెయి ఎట్లనన్న'' అని. ఆ తర్వాత

పరుగెత్తి పోతూన్న వాళ్ల పాదాల చప్పుడు క్షణాల్లోనే వినిపించకుండా పోయింది.

ఇస్రూబాయి మళ్లీ ఆలోచనల్లో పడిపోయింది. ఎక్కడ దాచిపెట్టాలి కొడుకును? వాడి రూపాన్నింకా కంటినిండా చూసుకోనైనా లేదు. పోలీసుల కళ్లబడితే శవం కూడా తనకు దక్కదు. ఇంతకుముందు ఎవరో అన్నట్లు 'పేదోడు సచ్చినా దయదల్చేటోడు లేడు. సచ్చిన పీన్గులమీన యాపారం, బేరాలు సేసే హుకూమతులివి' గప్పుడెప్పుడో పక్క గూడెంల వో ఆడమనిసి సెట్టుకురి బోసుకొని సస్తె పంచనామాలని, కేసని, మీరే సంపి ఉరేసిండ్లని కొడుకులను, మొగన్ని తిట్టి, కొట్టి, పైసలొసూలు చేసుకొని పీన్గును దవఖానకు గొంటబోయి కోసి కుప్పవెట్టి సాపల సుట్టి యిచ్చినందుకు మల్ల పైసలియ్యమని, లేకుంటె పీనిగెనే యియ్యమని సతాయించిన లోకమిది''

'తన కొడుకు ఆ పాపిస్టోల్ల కండ్లల్ల వడితె కొండబోయి కత్తులతోని, కటార్లతోని, సుత్తెలతోని, రంపాలతోని కోసి పోగులేసి గుడ్డపేగుల్లో, పాత సాపల్లో ముల్లెగట్టి పైసలిచ్చి పట్కపో అంటే తనతాన ఒక్క చిల్లిగవ్వ లేదు. ఎట్లనన్న జేసి కొడుకుని దాసిపెట్టాల! ఆల్లగ్గనిపియ్యకుండ, అనుమానం రాకుండ దాయాల! కాని యెక్కడ దాయాల?'

ఆ అపరాత్రివేళ అందునా పోలీసుల రూపంలో రానున్న మృత్యువు భయంతో గూడెంలోని జనం గుండెల గుబగుబల్నీ, ఉచ్ఛ్వాస నిశ్వాసాల సవ్వళ్లనీ సైతం నియంత్రించి శవాసనాలు వేసుకొని బిక్కుబిక్కుమంటూన్న వేళ అలముకొన్న నీరవ నిశ్శబ్దంలో దగ్గర్లోని మరో గూడెంలోంచి ఇనుప బూట్ల పద ఘట్టనల సవ్వడికి నిద్రా భంగం చెంది భీతిల్లిన కాకుల రొదా, లాఠీల స్వైరవిహారంతో పెల్లుబికిన గిరిజన స్త్రీ బాల వృద్ధుల ఆక్రందనారావాలూ అస్పష్టంగానే అయినా హృదయ విదారకంగా వినిపించడంతో అంతవరకూ ఆలోచనల్లో కొట్టుమిట్టాడుతూన్న ఇస్రూబాయికి మెరుపులా తక్షణకర్తవ్యం స్ఫురించింది.

ఆ క్షణాన ఆమె సర్వేంద్రియాల్లో ఒక అనిర్వచనీయమైన స్పందన అనాథలైన వందలాది గిరిజనుల కడుపు మంటల్లో భౌతికంగా భస్మమైపోయిన ఎందరో తల్లుల ఆత్మలన్నీ ఏకమై గతంలో తాము నిర్వహించలేకపోయిన కార్యమేదో ఈమెద్వారా నెరవేర్చాలన్న సంకల్పంతో ఇస్రూబాయిని ఆవహించినట్లయింది. తక్షణం ఆమె పూనకం వచ్చిందాన్లా లేచి మూలనున్న గడ్డపారందుకొని నట్టింట్లో బలంకొద్దీ గబగబా తవ్వసాగింది. ఏకబిగిన మనిషిని పాతిపెట్టగలిగినంత గొయ్యి తీసి చాపతోసహా కొడుకు శవాన్ని గోతిలోకి లాగింది. కానీ కొడుకు ఒంటిపై మట్టి పోయాలంటే మాత్రం చేతులు రావడంలేదామెకు.

వాడి కంట్లో చిన్న నలుసు పడితే తల్లడిల్లేది తాను. వాడి కాల్లో ముల్లు గుచ్చుకుంటే విలవిలలాడేది తాను. వాడికేమాత్రం బాధ కలిగినా తన పేగులు కదిలిపోయేవి. అలాంటిది నేడు వాడి శవంపై మట్టి పోయాలంటే ఆ కన్నతల్లి చేతులు కదలడంలేదు. కదిలినా మట్టిని జార విడువడంలేదు.

కానీ ఎవరో ఆమెను అజ్ఞాతంగా వెన్నుతట్టి ప్రోత్సహిస్తున్నారు త్వరగా కానిమ్మని. 'ఇది నీ కొడుక్కు కాదు వాడి చావుకు కారణమైన ఈ వ్యవస్థకు సమాధి' అనీ!

పైగా ఎక్కడో నాలుగిళ్లకవతల తలుపుల మీద కర్రలతో చరుస్తూన్న చప్పుడూ, మరుక్షణంలో పసిపిల్లల, ఆడవాళ్ల ఏడుపులూ వినిపించడంతో ఇస్రూబాయి చేతుల్లోని మట్టి అసంకల్పితంగా గోతిలోకి జారింది. అంతే! ఆ తర్వాత ఆమె కరచరణాలు యంత్రాలకన్నా వేగంగా కదలాడాయి.

కాసేపట్లో కొడుకు భూమిలోకి వెళ్లిపోయాడు. వాడిపైన మట్టి పేరుకుపోయింది. కొడుకును పూడ్చగా మిగిలిన మట్టిని తట్టతో ఎత్తి




పెరట్లో పారబోసింది. వాణ్ణి పాతిపెట్టిన గోతి మీద ఈతకమ్మల చాప వేసి దానిమీద బొంతా, పాత బట్టలూ పరిచింది.

కొడుకును మట్లో పూడ్చిన చేతులను తల కేసీ, నేలకేసీ కొట్టుకుంది. తలను గోడకేసి బాదుకుంది. దుఃఖం ఆగడంలేదు. గొంతెత్తి గట్టిగా ఏడవాలని వుంది. కానీ ఏడవడానికి కూడా వీల్లేదు! అతి కష్టంగా, మౌనంగా ఆ బాధనంతటినీ తనలో ఇముడ్చుకుంది. శక్తిశా స్త్రపరంగా ఏ శాస్త్రజ్ఞుడైనా ఆమెని విశ్లేషించగ లిగితే ఆ మనసులో ఎన్ని హైడ్రోజన్ బాంబుల శక్తి నిబిడీకృతమై ఉందో చెప్పగలి గేవాడు.

బయట బూటుకాళ్ల చప్పుళ్లు విని పించాయి. గబగబా కొంగుతో కళ్లూ, ముఖ మూ తుడుచుకొని జుట్టు సరిచేసుకొని కొడుకు సమాధిపై పరచుకొన్న పడకమీద పడుకొని నిద్ర నటించసాగింది.

అంతలోనే బూటుకాలి తాపుతో భళ్లున తెరుచుకున్నాయి తలుపులు. అంతవరకూ గుడ్డిగా వెలుగుతూన్న దీపం ఆరిపోయింది.

నలుగురు పోలీసులు బిలబిలా లోపలికి దూరారు. ఇద్దరి చేతుల్లో టార్చిలైట్లు వెలుగు తున్నాయి. టార్చిలు పట్టుకున్న వాళ్ల చేతుల్లో లాఠీలున్నాయి. మిగతా ఇద్దరి చేతుల్లో తుపా కులున్నాయి.

గభాల్న లేచి నిల్చుంది ఇస్రూబాయి!

"ఏం పేరే ముండా నీది?" అడిగాడొకడు.

"ఇస్రూబాయి''

"గోండోల్లా?" అడిగాడింకొకడు.

తలూపింది అవునన్నట్లుగా.

"ఇంట్లో ఎవరెవరుంటారు? నీ మొగుడే డే?"

"మొగుడు ఏనాడో పోయిండు''

"మరింకెవరుంటరు? నీకు కూడెవరు బె డ్తరు? కొడుకులు, బిడ్డలు లేరా?"

"ఒక్క కొడుకున్నడు!"

"ఏడీ వాడు?"

"... ..."

"అన్నల్తోటి దిరుగుతడు గదూ?"

"... ..."

"మాట్లాడవే ముండ! నియ్యవ్వ! గొండ మంకు ముండ! చెప్పు! ఏడి నీ కొడుకు?"

అని కొడుకు శవంపైన్నే నిలబడి అడుగు తుంటే బతికి వుండగానే తన కొడుకును భూమిలో పాతిపెట్టి తొక్కినట్టు గుండె గొంతులోకొచ్చినట్టు ఉక్కిరిబిక్కిరైంది ఇస్రూ బాయికి.

"ఏందే ముండా! అడుగుతుంటె యిని పిస్తలేదా? రాయోలె నిలవడ్డవు!" అంటూ ఒకడు తుపాకీ మడమతో ఎండిపోయిన ఇస్రూబాయి ఛాతీమీద పొడిచాడు గట్టిగా.

అంతవరకూ ఏడుపునూ, బాధనూ అణిచి పెట్టలేక యమ యాతన అనుభవిస్తూన్న ఇస్రూబాయికి తుపాకీ మడమ దెబ్బ విముక్తి కలిగించింది. ఒక్కసారిగా పెద్దపెట్టున ఘొ ల్లుమని ఎలుగెత్తి ఏడుస్తూ "మీదూరికి వొయిండు వాల్ల పెద్దల తాటికి'' అంది.

"ఎప్పుడొస్తడు?"

ఆమె ఏం చెప్పేదో! కానీ వాళ్ళలో సహనం చచ్చినవాడొకడు.

"చెలోరే భాయ్! ఔర్ బహుత్సే గావోం ఫిర్నాహై'' అని తన సహచరుల్తో అని, ఇస్రూబాయికేసి తిరిగి "రేపు మల్లొస్తం! నీ కొడుకు ఇంట్లనే వుండమను! లేకుంటే సూడు మల్ల!" అంటూ బూటుకాలితో ఒక తన్ను తన్ని ముందుకు కదలడంతో మిగతావాళ్ళు అతణ్ణి అనుసరించారు.

గుండెల్లోని బాధంతా కరిగిపోయిందాకా ఏడ్చి సొమ్మసిల్లి పడిపోయింది ఇస్రూబాయి.

పోలీసులు మిగతా గుడిసెలు కూడా వెదికి నానా భీభత్సంచేసి ఆ గూడెం వదిలిపోయేస రికి చాలా రాత్రి గడిచిపోయింది.

  

భూ ఆక్రమణకు పాల్పడిన వారిపై పోలీ

సుల జులుం పెచ్చు పెరిగిపోయింది. ఇతరుల భూములను ఆక్రమించుకోవచ్చని, ఆక్రమించుకొమ్మని చెప్పింది తీవ్రవాదులేనని వారిపై కూడా నిఘా పెరిగిపోయింది. దినం, రాత్రి అంటూ లేకుండా పల్లెలపై, రహదార్లపై, అడవిలో సైతం పోలీసుల గాలింపు చర్యలు ఎక్కువయ్యాయి. ఎక్కడ ఎదురు పడినా, ఆలోచించకుండా ఎన్‌కౌంటర్ చేయాలనే నిర్ణయించుకున్నారు.

పెట్రోలింగ్ ఉధృతమయింది. పోలీసులు వేయికళ్ళతో ఎక్కడ నక్సల్స్ కనిపిస్తారో అని వెతుకుతున్నారు. పోలీసులకు తోడుగా సి.ఆర్.పి. బలగాలు తోడయ్యాయి. వేట ఉధృతమయింది.

★ ★ ★

ఎన్‌కౌంటర్ వార్తలు మామూలయ్యాయి పేపర్లలో.

సానుభూతి పరులపట్ల హింస, దౌర్జన్యాలు, మిలిటెంట్‌ల, కొరియర్‌ల లాకప్ డెత్‌లు ఎన్‌కౌంటర్ పేర పెరిగిపోయాయి.

దండకారణ్యంలోని అన్ని దళాలు ఒక్కటయ్యాయి. పెద్ద ఎత్తున ప్రభుత్వానికి, పోలీసులకు బుద్ధి చెప్పాలని నిర్ణయించుకున్నాయి.

దండకారణ్యంలోని అన్ని దళాల ఇన్‌ఛార్జ్ కమాండర్ ఛీఫ్‌తో ఒక సమావేశం ఏర్పాటు చేయబడింది. దళ కమాండర్ ఛీఫ్ మాట్లాడుతున్నాడు. అప్పటికే అయన యీ మీటింగ్‌లో మాట్లాడబట్టి గంటయింది. చాలా తర్జన, భర్జనల తర్వాత, చాలామంది ప్రశ్నలు జవాబుల తర్వాత కమాండర్ ఒక తీర్మానం చేశాడు.

"డియర్ కామ్రేడ్స్!

ఎన్నో ఏళ్ళ మన శ్రమ ఫలితంగా, మన ఉద్యమ ఫలాలు మనకందే సమయంలో యీ పోలీసులు, యీ ప్రభుత్వం మన ఉద్యమస్ఫూర్తిని, చైతన్యాన్ని నీరుగార్చి మనం ఆశించిన ఫలాన్ని మనకు దక్కకుండా చేయాలని చూస్తోంది.

ఇన్నాళ్ళూ మనం, పడ్డ శ్రమ, మన త్యాగాలు, మన రక్తతర్పణం, పడ్డ కష్టాలు అన్నివర్గాల ప్రజల్లో ఎవరికి తగిన మానసిక పరిస్థితిని వాళ్ళలో కలిగించడంలో మనం నూటికి నూరు పాళ్ళు కృతకృత్యులయ్యాం.

అన్నివర్గాల ప్రజల్లో మనం ఏర్పరిచిన వాతావరణాన్ని, తమ పైశాచిక కృత్యాలతో మళ్ళీ మొదటికి తేవాలని చూస్తున్నారు యీ పోలీసులు. ఎంతో కష్టపడి కరడుగట్టిన యీ వ్యవస్థను మనం కరిగించాం. ఇక మూసలో పోసి మనం అనుకున్న ఆకృతికి తేవడమే తరువాయి. కాని వేడెక్కిన యీ ఉక్కుకొలిమిలో నీళ్ళు పొయ్యచూసేవాణ్ణి యీ కొలిమిలో మసిచేద్దాం. ఇంకా ఊరుకుంటే లాభం లేదు. ఈ దాడిని తిప్పికొట్టాల. వాళ్ళు కలలో కూడా ఊహించని రీతిలో పెద్దఎత్తున మనం దెబ్బకొట్టాలి.

అందుకు మనం ఎన్నుకున్న ప్రదేశం అల్లంపల్లి అడవులు. మనం దెబ్బకొట్టే దినం ఆగస్టు పదిహేడు పంతొమ్మిది వందల ఎనభైఏడు అని చెప్పి, దళాలన్నింటికి పథకాన్ని వివరించాడు. ఒక్కో దళానికి ఒక్కో పని అప్పగించాడు.

ఒక దళం డినేటర్లు అమర్చడటానికి గోతులు తీస్తారు.

ఒక దళం పోలీసులను ఎరవేసి, రప్పిస్తారు.

మరొక దళం మందుపాతర్లను పేలుస్తారు ఇలా ఒక్కో దళానికి ఒక్కో పని మాత్రమే అప్పగించబడింది.

అనుకున్న రోజు రానేవచ్చింది.

అనుకున్నట్టే మేకను చూసి పులి పంజావిప్పి ముందుకురికింది. రెండు జీపులనిండా పోలీసులు అల్లంపల్లివైపు వేగంగా దూసుకుపోయారు.

నిర్ణీత ప్రదేశానికి రాగానే మందు పాతర్లు పేలాయి. రెండు జీపులు, జీపులో ఉన్న ఒక ఎస్.ఐ., ఎనిమిదిమంది కానిస్టేబుళ్లు, ఒక




నక్సలైటు అక్కడికక్కడే తునాతునకలైపోయారు.



అల్లంపల్లి సంఘటన పోలీసులు, సి.ఆర్.పి.ల గుండెల్లో బాకులనే దించాయి. ఒకరకంగా వారి మనోధైర్యాన్ని యీ సంఘటన దెబ్బతీసింది. అసలు మూలవిరాట్టు గద్దెమీద క్షేమంగానే ఉంటాడు. ఈ మధ్యవర్తులకే ముప్పు. పోలీసులకూ, తీవ్రవాదులంటే వ్యక్తిగత కక్షలేం ఉండవు. కాని కల్పించబడతాయి, ఉసిగొల్పబడతాయి. ఒక్క కలం పోటుతో తీవ్రవాదంపై నిషేధాన్ని ఎత్తివేసి వాడు చోద్యం చూడగలడు. మరుని మిషం నిషేధాన్ని ప్రకటించి పోలీసుల బతుకులకు 'షా' చెప్పగలడీ దేశ ప్రజాస్వామ్య ప్రభుత్వాధినేత.



చేల మధ్య బండి బాటలో బాలన్స్ చూసుకుంటూ, సైకిల్ నడుపుతున్న సిద్ధార్థకు దూరంగా చేల్లోంచి 'డాక్టర్ బాబు' అన్న పిలుపు వినిపించడంతో, సైకిల్ దిగి చూశాడు. తలకు తుండుగుడ్డ చుట్టుకొని, నిలబడిన నారాయణ కనిపించాడు. డాక్టర్‌ను తమవద్దకే రమ్మన్నట్టు సైగ చేస్తున్నాడు నారాయణ.

పత్తి చేల్లోంచి ఒద్దికగా సైకిల్‌ను నడిపించుకుంటూ, నారాయణను చేరాడు డాక్టర్ సిద్ధార్థ.

"నమస్కారం డాక్టర్‌బాబు కూర్చోండి''

"నమస్కారం"

బొజ్జు తల్లి ఇస్రూబాయికి ఎలా ఉంది?"

నారాయణ మంట ముందు కూర్చుని కంది కాయను కాలుస్తున్నాడు. ఇంకోవైపు నిప్పు కుమ్ములో పెట్టిన మొక్కజొన్న కంకులను కుమ్ములోనే తిప్పుతున్నాడు.

ఇద్దరు సెంట్రీ డ్యూటీలో ఉండి, రెండు దిక్కుల కాపలా కాస్తున్నారు. ఒక స్త్రీ, ఇద్దరు పురుషులు, చేను పక్కనే గట్టుమీద గడ్డిమీద ఆదమరచి నిదురపోతున్నారు.

అందరికి సంబంధించిన కిట్స్ అక్కడ పెట్టి ఉన్నాయి. మూడు గన్స్ పక్కనే ఉన్నాయి. ముగ్గురు పడుకొని విశ్రాంతితో ఉన్నారు. ఇద్దరు సెంట్రీ డ్యూటీలో అప్రమత్తులై ఉన్నారు. దళంలో మొత్తం ఆరుగురు సభ్యులు. నారాయణ దళనాయకుడు.

బొజ్జు మరణాన్ని ఇస్రూబాయి తట్టుకోలేకపోతోంది. ఆ ముసలి తల్లికి ఆసరాగా ఉండే ఆ కొడుకును, మీరు మీ పనులకు ఉపయోగించుకోకుండా ఉండాల్సింది. ఎవరూ లేని దిక్కులేనిదయింది. ఇంకా ఎక్కువ రోజులు బతకకపోవచ్చు''

"నిజమే డాక్టర్. అనుకోకుండా జరిగిన ఆ ఎన్‌కౌంటర్‌లో బొజ్జు గాయపడ్డాడు. దానికి నేనూ విచారిస్తున్నాను. మా ఒక చిన్న అజాగ్రత్త ఐదుగురి ప్రాణాలకు ముప్పు తెచ్చింది. నేను బాధ్యత వహించాక జరిగిన మొదటి పొరపాటు ఇది. 'కాసేపు మౌనం తర్వాత 'తీసుకోండి' అంటూ, కాల్చిన కంది కాయను సిద్ధార్థముందు పోశాడు.

మర్యాదకు రెండు కాయలు తీసి, నోట్లో వేసుకున్నాడు. ఇలాంటి చిరుతిండ్లు ఎక్కడ పడితే అక్కడ తినడం సిద్ధార్థకు యిష్టముండదు.

డాక్టర్‌గా వృత్తి ధర్మాన్ని పాటిస్తూ, గిరిజన గూడేల్లో, వైద్యం చేస్తూ, ఊరూరా

తిరుగుతుంటే, చాలాసార్లు దార్లో నారాయణ బృందం, ఇతర బృందాలు తారసపడ్తుంటారు. కలిసిన కాసేపు యోగక్షేమాలు మాట్లాడుకుంటారు. డాక్టరుగారి అవసరం డాక్టరుగా ఎక్కడ ఏ గూడెంలో ఉందో చెప్తారు. అక్కడికి సిద్ధార్థ వెళతాడు. సీజనల్ వ్యాధులకు సంబంధించిన మందులు సిద్ధార్థ వాళ్ళతో చెపితే, పెద్ద మొత్తంలో తెచ్చి అందజేస్తారు. సిద్ధార్థ వాటిని అవసరమైన వారికి అందిస్తాడు.

"మీరు వ్రాసిచ్చిన మందులు యింకోవారంలో వస్తాయంట. వచ్చాక మీకు చేరతాయి'' అని కాసేపాగి, ఇస్రూబాయిని ఇక్కణ్ణించి తరలిస్తే, యింకా మెరుగైన వైద్యం అందిస్తే, బతికే ఆశ ఏమైనా ఉందా!"

"అనవసరమనుకుంటాను. ఏం చేసినా బతికే అవకాశం లేదు. కొడుకు మరణం పెద్ద షాక్ ఆమెకు.

ఇద్దరిమధ్య కాసేపు మౌనం రాజ్యమేలింది.

ఎవరి ఆలోచనల్లో వారున్నారు.

మౌనాన్ని ఛేదిస్తూ "ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నావు నారాయణ. నీవు మనసులో ఏదో సంఘర్షణకు లోనవుతున్నట్లు తెలుస్తోంది నిజమేనా?" అన్నాడు సిద్ధార్థ.

"బొజ్జులాంటి అమాయకులు ఉద్యమంలో అకారణంగా బలయిపోయినప్పుడు మనసు నీరుకారిపోతుంది. ఏమీ చేయాలనిపించదు. ఈ బతుకు యీ పరుగు నిరర్థకం అనిపిస్తుంది''

"అది సహజం. ఇవన్నీ స్మశానవైరాగ్యం లాంటివి. కాసేపే ఉంటాయి. మీ ఉద్యమంలో బొజ్జులాంటి అమాయక యువకులను చేర్చుకోకూడదు. ఉద్యమంలో నిలబడగలిగిన శారీరక దారుఢ్యమయితే యీ గిరిజనులకు ఉంటుంది కాని, మానసిక పరిపక్వత, సమయస్ఫూర్తి తగిన సమయంలో తగిన నిర్ణయం తీసుకునే నేర్పు వీళ్ళకు అప్పుడే అలవడవు. చెప్పింది చేయటమే తప్ప, స్వంతంగా ఆలోచించలేరు. వీరికున్న అరకొర చదువు ఉద్యమ బాటకు సరిపోదు. ఇది మీరు గ్రహించడం లేదు''.

"నిజమే డాక్టర్. కానీ వాళ్ళకోసం వాళ్ళు ఉద్యమించిననాడు లక్ష్యం యింకా చేరువవుతుంది అని నా ఆశ. ఒక వైపు ప్రభుత్వం గిరిజన యువకులను, ఫారెస్ట్ గార్డులుగా, పోలీస్ కానిస్టేబుల్‌గా నియమిస్తోంది. కేవలం యీ ఉద్యమాలవైపునుంచి, వారి దృష్టిని మళ్ళించాలని''

"నారాయణా! ఒక మనిషి చాలా సునాయాసంగా ప్రభుత్వంయిచ్చే ఉద్యోగం చేయవచ్చు. కాని, ఉద్యమంలో చేరి ముందుకు కొనసాగటం కష్టం. ఈ ముళ్ళ బాటలో నడవాలంటే, చేరుకునే లక్ష్యంవైపు, నేడు కాకున్నా రేపైనా, తను కాకున్నా, తన తరువాతి వాళ్ళైనా, చేరుకుంటారనే అచంచలమైన నమ్మకం ఉండాలి. నీలాంటి వాడే అప్పుడప్పుడు, యిలా డోలాయమాన స్థితిలో ఉంటే, యింక వారి సంగతి చెప్పాలా'' అని సిద్ధార్థ అంటుంటే, ఒక పేలవమైన నవ్వు నారాయణ పెదవులపై క్షణకాలం ఉండి మాయమయింది.

"ఒక్కొక్కసారి మీ పనే బాగుందనిపిస్తుంది డాక్టర్. స్పష్టమైన లక్ష్యం, అనుక్షణం లక్ష్యాన్ని చేరే అదృష్టం. ఏ అడ్డంకు లేదు. ఒంటరి పోరాటం, శ్రమ తప్ప. అన్నింటికి మించి, పరులకోసం, ప్రతి క్షణం బతుకుతున్నామనే తృప్తి. ఇవి చాలు జీవితానికి. మీ జీవితంలోని ప్రతి ఘడియ సఫలమైందే'' అంటూ ఆగిపోయాడు నారాయణ.

మళ్ళీ తనే "ఉద్యమంలో ఎంతో ఆదర్శంగా చేరాము. కాని అన్నీ అడ్డంకులే. ఆశయసాధనకు అవకాశమే లేదు. పరుగు-పరుగు- పరుగు. ఆశయాలవైపు నుంచి, లక్ష్యంవైపునుంచి దారి మళ్ళింది. అస్తిత్వం






నిలుపుకొడానికి, శత్రువు నుండి తప్పించుకో వడానికి పరుగు పెట్టడంతోనే సరిపోతుంది మా కాలమంతా''

"ఉద్యమ బాటలో ఇవి సహజం నారాయణా! అంత మాత్రానికే నీరసపడిపోతే ఎలా? ఇది సహజం కూడా. ఉద్యమంలో ఎప్పుడూ లక్ష్యంవైపు సూటిగా ప్రస్థానం వీలుపడదు. పడితే అది ఉద్యమమే కాదు. సాఫీగా సాగే ప్రయాణం అవుతుంది. కొన్నాళ్ళు కొంత లక్ష్య సాధన. శత్రువు మేల్కొంటాడు. శత్రువును ఎదుర్కొంటూ లక్ష్యసాధన. బలం మనది ఎక్కువైతే, శత్రువులను ఏరివేస్తూ, ముందుకు సాగుతారు. శత్రువు బలవంతుడైతే, మనం కొంతకాలం చతికిలబడటం, అజ్ఞాతంలోకి వెళ్ళిపోవడం, మన ఉనికిని, అస్థిత్వాన్ని నిరూపించుకునే యీ పోరాటంలో యీ నిరాశలు, నిస్పృహలు, పరుగులు సహజం. ఉద్యమంలో ఉండే ఈ ఎగుడుదిగుళ్ళు అనివార్యం... సహజం కూడా''

"పేదప్రజల సమస్యల సాధనకు నడుం బిగించి, హక్కులకోసం మొదలుపెట్టిన పోరు నేడు ఏ దిశలో ఉంది. మీకు తెలుసు... భూమి సమస్య భూమిసమస్యగానే ఉంది. గిరిజనుల లక్షల ఎకరాల భూమి నేడు భూస్వాముల చేతుల్లో ఉంది. అడవిపైన హక్కును హరించిన ప్రభుత్వం గిరిజనుడికి మిగులు భూమినైనా పంచలేకపోతోంది. 1970లో ఏర్పరచిన చట్టం 1/70 క్లాసు (ఎ)ను అమలు చేయలేకపోతోంది. ఈ అమాయక గిరిజనులను, వంచించేవారే కాని, ప్రేమించే వారేరి. ఒక ఊరిలో ఒక మిలిటెంట్, పది ఊళ్ళకు ఒక ఉద్యమకారుడు తయారుకాగలిగితే, మా లక్ష్యం చేరువయ్యే రోజు, ఎంతో దూరంలో ఉండదనుకుంటాను'' అంటూ సమాధానం కోసం సిద్ధార్థవైపు చూశాడు నారాయణ.

"ఇప్పటికే ప్రతి గిరిజన గూడెం, మీ

మధ్య, పోలీసులమధ్య నలిగిపోతోంది. చేయని నేరాలకు వాళ్ళు యిప్పటికే చాలా మూల్యం చెల్లించారు. మొన్న ఇందర్‌వెల్లి సంఘటన, అక్కడక్కడ బొజ్జులాంటి వాళ్ళు ఎన్‌కౌంటర్‌లోనో, లాకప్‌ల్లోనో, బూటకపు ఎన్‌కౌంటర్‌లలోనో, ఈ ఉద్యమాలకు మూల్యం చెల్లిస్తూనే ఉన్నారు'' అన్నాడు సిద్ధార్థ.

నారాయణ ఏమీ మాట్లాడలేదు. అతడి మెదడులో తర్క వితర్కాల సంఘర్షణ జరుగుతోంది.

మొక్కజొన్న కంకులు కుమ్ములో కాలి, మాడి వాసనవస్తున్నా, అది నారాయణను తాకలేకపోతోంది. తీక్షణమైన ఆలోచనలో వున్నాడు నారాయణ.

డాక్టర్ సిద్ధార్థే- మాడి పోయిన కంకిని బయటకు లాగి పారేశాడు.

మౌనాన్ని ఛేదిస్తూ డాక్టర్ "ఇంకో విషయం కూడా మీరు గుర్తుంచుకోవాలి నారాయణా. ఒకప్పుడు యీ సభ్యసమాజానికి మీరు హీరోలు, ధీరోదాత్తులు. నేడు మీ అర్థంలేని కొన్ని పనులవల్ల సభ్యసమాజం సానుభూతి రోజురోజుకి కోల్పోతున్నారు. నా మాటలు చేదుగా ఉండొచ్చు కాని, నిజాలు... ఒక మల్లాలరావు హత్య, గ్రామీణబ్యాంకు దగ్ధం, ప్యాసింజర్ రైలు దగ్ధం, ఆర్.టి.సి. బస్సులు కాల్చివేయడం యివన్నీ మిమ్మల్ని ప్రజలకు దూరంచేస్తున్నాయి. ప్రజల సానుభూతిలేని ఏ ఉద్యమం సఫలీకృతం కాదు. ఇది మీరు మరిచిపోతున్నట్లున్నారు."

"విస్తరిస్తున్న ఉద్యమంలో కమ్యూనికేషన్ గ్యాప్‌తో, చాలా పొరపాట్లు జరుగుతున్న మాట వాస్తవమే. కాని శతృవుదాడిని తిప్పికొట్టటానికి, మాకు యింతకన్న మార్గం కనిపించడంలేదు."

"పోలీసు యంత్రాంగం మీ శత్రువా? కాదు. ఈ వ్యవస్థలోని కొందరు వ్యక్తులు మాత్రమే మీ వర్గ శత్రువులు. పోలీసులు వారి సృష్టి. ఆ పైవాడి చేతిలో వీళ్ళు తోలుబొమ్మలు. సూక్ష్మంగా పరిశీలిస్తే వీరు నిమిత్తమాత్రులు. ప్రమోషన్‌లు, క్యాష్- అవార్డ్సు, సేవా పథకాల పేరుతో, ఎరవేసి వాళ్ళను ఉసిగొల్పే వారు వేరుగా ఉన్నారు.

పోలీసులు మీరు ఒకరినొకరు శత్రువులుగా భావించి హిట్ లిస్టులు తయారుచేసుకొని యీ హింస, రక్తపాతం ఎన్నాళ్ళు చేస్తారు? అసలు సమస్యల సృష్టికర్త సమస్యలనుంచి పుట్టిన మిమ్మల్నీ, మిమ్మల్ని మట్టుపెట్టటానికి మరొకరినీ, సృష్టించినవాడు వేరున్నాడు. వాడు క్షేమంగానే వున్నాడు.

పదవులకోసం జెండాలు మార్చి, మాటలు మార్చి, యీ వ్యవస్థను ఛిన్నాభిన్నం చేస్తున్నాడు. ఆయుధాలు, క్రమశిక్షణ, దీక్ష, ధైర్యసాహసాలు గల మీకు, తెలుపు, పసుపు, కాషాయం రంగులో ఉన్న యీ వర్గశత్రువు కనిపించకపోవడం ఆశ్చర్యం"

"సమస్యపట్ల ఇంత 'అవగాహన' ఉన్న మీరు మా ఉద్యమంలో ఎందుకు పాలు పంచుకోరు. మీలాంటి స్పష్టమైన అవగాహనగల నాయకుల కొరత ఎంతో ఉంది మాకు''

"జరుగుతున్న చరిత్రను పరిశీలించి చెప్పిన మాటలివి. మీ త్యాగాలు, మీ సేవాభావం, మీ దీక్ష, క్రమశిక్షణ నన్ను ముగ్ధుణ్ణి చేస్తాయి. లక్ష్యం గొప్పది. గమ్యం స్పష్టంగా కనిపిస్తోంది. కానీ ఎన్నుకున్న దారే అగమ్యంగా ఉంది. అదే బాధ.

గడ్డిలో పడుకున్న మగవాళ్ళు ఎప్పుడు లేచారో, వీళ్ళ సంభాషణను శ్రద్ధగా వింటున్నారు. స్త్రీ అటుతిరిగి ఒత్తిగిలిపడుకుంది.

నారాయణ, సిద్ధార్థల సంభాషణ మంచి పట్టులో సాగుతోందని గ్రహించి, చర్చమధ్య పలకరించడం బాగుండదని వింటూ కూర్చున్నారు.

"రాం... రాం... పైకు భాయి. రాం రాం నర్సయ్య''

"రాం రాం" అంటూ బదులిచ్చారు పైకు, నర్సయ్య.




"ఇంకా సీతక్క లేచినట్లు లేదు. సీతక్క ఆరోగ్యం ఎట్లా ఉంది''

"అలాగే ఉంది'' అన్నాడు నారాయణ.

ఇర్రెగ్యులర్ డిశ్చార్జ్ స్త్రీలకొక సమస్య. పైగా రోజుల తరబడి మైళ్ళకొద్దీ, గంటలకొద్దీ ఇర్రెగ్యులర్ నడక. విశ్రాంతిలేని జీవితం. అదీగాక బలమైన ఆహారం కూడా, నియమం ప్రకారం దొరకదాయే. కొన్నాళ్ళు సీతక్కకు మంచి ఆహారం ఇచ్చి, బెడ్‌రెస్ట్ తీసుకొనేలా చూడండి. లేకపోతే చాలా కష్టం. స్త్రీలు గెరిల్లాపోరాటంలో అంతగా పనికిరారు అనే ధ్వని నారాయణకు సిద్ధార్థ మాటల్లో కనిపించింది.

నిజమే అనిపించింది నారాయణకు.

సీతక్క అంతో యింతో చదువుకుంది. అసలు పేరు పంచపూల. ఉద్యమంలో చేరాక, సీతక్కగా మారింది. ఉద్యమంలో ఉండే దళ సభ్యుడు సుధాకర్‌ను పెళ్ళి చేసుకుంది. పంచపూలకు సుధాకర్‌తో పూర్వ పరిచయమే ఉంది. సుధాకర్ భావాలకు ఆకర్షించబడింది. సుధాకర్ చదువు పూర్తికాగానే ఉద్యమంలో చేరాడు. ఉద్యమంలో చేరిన సుధాకర్ పట్ల, పంచపూల ఆకర్షణ యింకా పెరిగింది., ఫలితంగా తనూ అతడితో ఉద్యమంలో చేరింది. పెళ్ళి,పిల్లలు ఉద్యమకారులకు, సరిపడవని ముందే గ్రహించిన సీతక్క పెళ్ళికి ముందే, పిల్లలు పుట్టకుండా, ఆపరేషన్ చేయించుకుంది. ఆపరేషన్ ఫెయిల్ అయి సీతక్క నెల తప్పింది. అప్పుడే సుధాకర్ సెంట్రల్ ఆర్గనైజేషన్ ఆదేశాలమేరకు, పొరుగు రాష్ట్రానికి పంపబడ్డాడు. ఉద్యమంలో ఉంటూ, దాంపత్యజీవనం గడపటం, తోటివారి ముందు సిగ్గుగా అనిపించి, ఒక రాత్రి తీసుకున్న నిర్ణయానికి కట్టుబడి సుధాకర్ సీతక్కలు స్నేహితుల్లా మిగిలిపోయారు.

నెలలు నిండుతుంటే, గెరిల్లా దళంలో ఉండటం వీలుకాదని తెలుసుకొని, ఒక గిరిజన గూడెంలో బిడ్డను ప్రసవించి, రెండు నెలల విశ్రాంతి తర్వాత, తిరిగి అడవిలోకి వచ్చింది సీతక్క. అప్పుడే సుధాకర్ పొరుగు రాష్ట్రానికి బదిలీఅయి, వెళ్ళిపోయాడు. బిడ్డను అల్లిగూడెంలో వదిలివచ్చాక, తిరిగి వెనక్కి చూడలేదు సీతక్క.

కాని, అల్లిగూడెం వస్తుంటే, దారిలోఅడవిలో ఏ పండు, ఏ కాయ కనిపిస్తాయని, ఆమె కళ్ళు అపేక్షగా వెతుకుతాయి. దారిలో దొరికిన చిటమిట పళ్ళు, జిబిలిక పళ్ళు, జీడిపళ్ళు, మొర్లిపండ్లు, తునికపండ్లు, రేగుపండ్లు, ఎరికిపండ్లు, ఎకలికికాయలు యిలా ఏ కాలంలో దొరికే వాటిని, ఆ కాలంలో తెంపుకొని, తీసుకెళ్ళి బాలు తాతకిస్తుంది.

సీతక్క ఎండిపోయిన కండ్ల వెనుకగల తడి, మోడువారి ఎండిపోయిన గుండెలోపల గల ఆర్ద్రత ఒక్క బాలు తాతకు, సిద్ధార్థకే తెలుసు. సిద్ధార్థకు కూడా రేలంటే ఎంతో ప్రేమ, అభిమానం. ఉజ్వలమైన భవిష్యత్తునాశించి వికసించిన పూవు రేల. వర్తమానం సందిగ్ధమై భవిష్యత్ చిత్రపటంపై ఆశలు నిలిపిన వారి కలల పంట రేల.

అందుకే చాలామటుకు రేల అవసరాలను సిద్ధార్థ గమనిస్తాడు. ప్రియాంకకు రాసే ప్రతి ఉత్తరంలో రేల సంగతులుంటాయి.

రేల నేడు చీకట్లో, సంఘర్షణలో ఉన్న వర్తమానం.

రేల రేపటి వెలుగు.

మగవాడితో సమానంగా అడుగేసే సీతక్క సుధాకర్‌పై ప్రేమను, శారీరక సుఖాన్నీ, మాతృత్వాన్నీ అన్నింటినీ జయించి, ఉద్యమంలో నిలబడింది. కాని నేడు తన అనారోగ్యం, అశక్తత, తన దళం వెనుక పడటానికి కారణం కాకూడదని సీతక్క కోరిక.

"సీతక్కలాంటి ఉద్యమకారిణిని మీరు వదులుకోరాదు. కాని ఎలాగైనా ఒక రెండు నెలలు ఆమెకు పూర్తి విశ్రాంతి, బలమైన ఆహారం అవసరం. వీలయితే సుధాకర్‌ను

ఒకసారి వచ్చి సీతక్కకు కనిపించి పొమ్మని కబురు పంపండి. ఆమెలో భావాలు అణచు కుందేగాని అణగారి పోలేదు. నారాయణ! ఆ స్త్రీమూర్తిని అర్థం చేసుకొని దళ కమాండర్‌గా ఆమెను ఆజ్ఞాపించి కొన్నాళ్లు వెనక్కి పంపు'' అని సిద్ధార్థ అంటుండగానే సీతక్క మేలు కొంది.

"రాం! రాం! డాక్టర్‌బాబూ!" అంటూ పలకరించింది.

"రాం! రాం! సీతక్క. నీ ఆరోగ్యం ఎలా గుంది?" అంటూ దగ్గరగా వెళ్లాడు. సిద్ధార్థకు సీతక్కంటే ప్రత్యేకమైన అభిమానం. అందు లోను ఆమె గత సంవత్సరంనుండి అతడి పేషెంట్‌కూడ.

"ఏముంది డాక్టర్ బాబూ! మామూలే! ఈ రక్తస్రావం ఆగి నేను మామూలు మనిషిని అవుతానన్న నమ్మకం లేదు నాకు. అందుకే నేను చచ్చేలోగా నన్ను ఉద్యమానికి అంకిత మయ్యేలా బెల్టు బాంబు కట్టి శత్రువుల గుండెలు ఛేదించటానికి వినియోగించుకో మని నారాయణను కోరుతున్నా వినడంలే దు'' అంటుంటే డాక్టర్ సీతక్క చేతులు, నాడీ పరీక్షించాడు.

మొదటి జబ్బు రక్తహీనత.

తరువాత రోగ నిరోధక శక్తి రోజురోజుకి సన్నగిల్లడం స్పష్టంగా తెలుస్తోంది.

డాక్టర్ సీతక్కను పరీక్షగా చూశాడు.

భుజాలపైవరకు కత్తిరించిన జుట్టు, ఆడ అలంకరణలు ఏమీ లేని మొహం, వదులుగా ఉన్న జాకెట్, ఎండిపోయిన ఎద, కాశపూసి పిక్కలపైకి గట్టిన చీర, కాయలు కాసిన చేతులు, పగుళ్లు తేలిన పాదాలు.

ఆమెను చటుక్కున చూసినవాళ్లెవరూ స్త్రీ అనుకోరు.

స్త్రీలో ఉండే కోమలత్వం, మార్దవం, మె రుపు అన్నింటినీ కావాలనే పోగొట్టుకుంది సీతక్క.

ఆరేండ్లక్రితం సీతక్క మారకముందు ఆమె పంచపూల. పంచపూల అంటే మన్మ ధుడు ఎక్కుపెట్టిన పూలబాణమా! అన్నట్లు ఉండేది.

ఉద్యమం పోకడలు మెల్లమెల్లగా అవ గతం కావడంతో తనలోని స్త్రీత్వాన్ని త్య జించింది సీతక్క.

పదిమంది మగవాళ్లమధ్య దినం, రాత్రి కలిసి మెలిసి తిరుగుతున్నప్పుడు తను స్త్రీ అనే భావన వాళ్లకు కలగకూడదు. అందమైన శరీరం, అలంకరణ మగవాణ్ణి ఆకర్షించి, పశువును చేస్తాయి అని గ్రహించిన పంచ పూల జుట్టు కత్తిరించుకుంది. చేతులకు గాజు లు, నుదుట తిలకం ఏమీ లేకుండ మగరా యుడిలా ఉండటం నేర్చుకుంది. దళ సభ్యు లకు ఎప్పుడోగానీ ఆమె ఒక స్త్రీ అని గుర్తురా దు. అలా వుంటుంది ఆమె ప్రవర్తన.

పంచపూల బిడ్డకు ఇప్పుడు నాలుగవ ఏడు. అల్లిగూడెంలో కినాకబాలు తాత ఇంట్లో పెరుగుతోంది. పేరు రేలా. కినాకబాలు తాత, మీరాబాయిలే తన కన్న తల్లిదండ్రులను కుంటుంది రేల.

"చాలా చిక్కిపోయావు పంచపూల" అని డాక్టర్ అనేసరికి సీతక్క ఒక్కసారి ఉలిక్కిప డింది. పంచపూల పేరు ఆమె చెవులకు కొత్తగా, ఎబ్బెట్టుగా వినిపించినట్టయింది.

"నా పేరు సీతక్క అని మరిచిపోయావా డాక్టర్ బాబూ!" అంటూ తన పాలిపోయిన కళ్లతో సూటిగా డాక్టర్ కళ్లలోకి చూసింది.

"లేదు... సీతక్కలోని పంచపూల యింకా పూర్తిగా చావలేదు అని గుర్తుచేస్తున్నాను''

"పంచపూల చావలేదని నీవనగలవా డా క్టర్ బాబూ! పంచపూల మీ దండకారణ్యంలో ఏనాడో చనిపోయింది. నేను సీతను. సీతక్క ను''

"నిన్న మొన్నటి వరకు ప్రతి అడుగు ముందుకు పడుతుంటే, ఉద్యమ స్ఫూర్తిలో పంచపూల చచ్చిపోయి, సీతక్క ముందుకు




నడిచింది. నేడు పరిస్థితులు మారి, యీ జీవితం పరుగులో సీతక్క అలిసిపోయింది. అలిసిపోయిన సీతక్కలో పంచపూల మళ్లీ ప్రాణం పోసుకుంటోంది. ఇది నీకే తెలియని నీ అంతరంగంలోని మారుమూల ఒదిగి, జీవం పోసుకుంటున్న నిజం" అని సిద్ధార్థ అంటుంటే...

సీతక్క ఆలోచనలో పడింది. సీతక్క కళ్లలో సన్నటి నీటిపొర ఏ క్షణమైనా ఉరికి రావటానికి సిద్ధంగా ఉంది.

"సీతక్కా! మనం ఎంత మరిచిపోదామన్నా మన కుటుంబ జీవనం, మన గతం, మనల్ని ఏదో క్షణంలో బలహీనపర్చక మానవు. ఆ జ్ఞాపకాలు, బంధాలు మనల్ని వివశుల్ని చేయక మానవు. విజయాల వెనుక విజయాలు వరిస్తుంటే ఉద్యమ స్ఫూర్తితో అవన్నీ మరిచిపోయి యింకా ముందుకు పోతాం. అన్ని రోజులు మనవి కావు.

ఇప్పుడు మన పరిస్థితి వేరుగా వుంది. ఎక్కడా ఒకరోజు స్థిరంగా ఉండే స్థితిలో లేము. డాక్టర్‌బాబు చెప్పినట్టు నీవు ఒక రెండు నెలలు విశ్రాంతి తీసుకో. ఆరోగ్యంతో కోలుకున్నాక మళ్లీ వద్దువుగాని'' అన్నాడు నారాయణ.

"అంటే నేను మీ పోరాటంలో పనికిరానా? అంత వెనుకపడి పోతున్నానా? నన్ను వెనక్కి పంపకు కమాండర్! చావైనా, బతుకైనా మీతోటే'' అంటూ వేడుకుంది.

"పూర్తిగా గాయపడి, ఆరోగ్యం క్షీణించిన గెరిల్లా యీ అరణ్యంలో మనలేడు. అలాంటి వారిని వెంటవేసుకొని ముందుకు నడిస్తే మిగతావాళ్ల ప్రాణానికే ముప్పు'' అని డాక్టర్ నచ్చచెపుతుంటే మధ్యలో నారాయణ అందుకొని,

"పరిస్థితి అర్థం చేసుకో సీతక్కా. నీలాంటి దాన్ని వదులుకోవాలని మాకుమాత్రం ఉంటుందా? పరిస్థితులను సర్దుకొని పోవడమే తెలివైన వారి లక్షణం. నువ్వింకేం మాట్లాడకు. వారం రోజుల్లో నిన్ను క్షేమంగా, విశ్రాంతి ఉండే చోటుకి పంపే ఏర్పాటు చేస్తాను కాదనకు'' అంటూ కమాండర్ హోదాలో ఆజ్ఞాపించాడు నారాయణ.

సిద్ధార్థ కూడా లేచి నిలబడ్డాడు.

"నేను నడుస్తా సీతక్కా!" అంటూ రెండడుగులు ముందుకు వేసి, "అందరికీ రాం రాం" అంటూ నర్సయ్య పైకుబాయిలతో కరచాలనం చేసి సెంట్రీ డ్యూటీ చేస్తున్న విఠోబా, కమలాకర్‌లతో కూడా కరచాలనం చేసి, "వస్తా కామ్రేడ్. విష్‌యు బెస్ట్‌ఆఫ్ లక్' అంటూ నారాయణ చేయి పట్టుకొని కొంత దూరం తీసుకుపోయి,

"నారాయణా! నీకో విషయం చెప్పాలి. సీతక్క ఆరోగ్యం ఏమంత బాగాలేదు. నేడు ఆమె పరిస్థితి చూస్తుంటే ఆమెకు యుటరస్ కాన్సర్ ఏమో అని నా అనుమానం. ఇంకా ఏమాత్రం ఆలస్యం చేయకుండ ఆమెకు వైద్యం చేయించాలి. బయాప్సీ చేస్తేగానీ ఖచ్చితంగా ఏ సంగతీ చెప్పలేం. తొందరగా మేలుకోకపోతే ఆమె ప్రాణానికే ముప్పు రావచ్చు. ఆమెను నాగపూర్ మెడికల్ హాస్పిటల్ పంపే ఏర్పాటు చూడు. అక్కడైతే ఏ భయమూ ఉండదు. తొందరగా ట్రీట్‌మెంట్ మొదలయితే ఆపరేషన్‌తో నయం కావచ్చు. నా మాట గుర్తుంచుకొని వెంటనే ఆమెకు వైద్య సౌకర్యం అందేలా చూడు''

"అలాగే డాక్టర్. విషయం యింత తీవ్ర స్థాయి చేరిందని నాకు తెలియదు. రేపే నాగపూర్ పంపే ఏర్పాటు చూస్తాను. ఉంటాను..." అంటూ కమాండర్ హోదాలో సెల్యూట్ చేసి డాక్టర్‌కు వీడ్కోలు పలికాడు నారాయణ.

అన్ని గిరిజన గ్రామాల్లో ఉద్రిక్త పరిస్థితి నెలకొని వుంది. సి.ఆర్.పి. పోలీసు బలగాల పెట్రోలింగ్ ఎక్కువయింది. అనుమానం కలిగినవాణ్ణి టాడా చట్టంకింద అరెస్టు చేసి జైల్లో పడేస్తున్నారు.

తగినంత పోలీసు బలగం లేకనే తీవ్రవాదాన్ని అనుకున్న రీతిలో అణచలేకపోతున్నామని పోలీసు అధికారులు,

సరిపడ సిబ్బంది లేక అన్నల అండతో గిరిజనుల కారణంగా అడవి సర్వనాశనమవుతున్నదని అటవీ శాఖాధికారులు పరిస్థితులను ఎవరికి వారు సమీక్షించుకున్నారు.

ఫలితంగా పోలీసు శాఖలో, ఫారెస్టు సర్వీసులో కొత్తగా కొన్ని వందలమంది సిబ్బంది నియామకానికి ప్రకటన వెలువడింది. అందులోనూ షెడ్యూల్డ్ తెగల అభ్యర్థులకు ప్రత్యేక స్థానం కేటాయించారు. కొన్ని వేలమంది గిరిజన యువకులు, అటు పోలీసు శాఖలో, ఇటు ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్‌లో భర్తీ కావటానికి అభ్యర్థన పత్రాలను పెట్టుకున్నారు.

గిరిజనుల్లో చాలామంది పదవ తరగతితో చదువును గట్టెక్కించినవారే. ఆ పదవ తరగతివరకు కూడా చదివింది అంతంతనే. ఏదో సర్టిఫికెట్ ఉందా అంటే వుంది. అలాంటివాళ్లు ఎగబడి ఉద్యోగాల వేటలో పడ్డారు.

★ ★ ★

అల్లంపల్లి మందు పాతర్లు పేలి మొత్తం పదిమంది చనిపోయారు. చనిపోయినవారిలో ఎనిమిదిమంది కానిస్టేబుల్స్, ఒక సబ్ ఇన్స్‌పెక్టర్, ఒక నక్సలైట్ ఉన్నారు.

ఇంత పెద్ద ఎత్తున, ఒక్క సంఘటనలో యింతమంది పోలీసులు మరణించడంతో రాష్ట్ర ముఖ్యమంత్రి, జిల్లా కలెక్టర్, ఎస్.పిలతో సమావేశమై జిల్లా పరిస్థితులపై, తీవ్రవాద కార్యకలాపాలపై, గిరిజనుల స్థితిగతులపై సుదీర్ఘ చర్చలు జరిపారు. చివరకు అన్ని సమస్యలకు పరిష్కారంగా జిల్లాను 'ఆదర్శ జిల్లా'గా ప్రకటించింది ప్రభుత్వం. జిల్లా అభివృద్ధికి వంద కోట్ల రూపాయలు కేటాయిస్తున్నట్లు కూడా ప్రకటించింది.

ప్రభుత్వం కొత్తగా పెద్దసంఖ్యలో గిరిజన యువకులను ఉద్యోగాల్లో నియమించాలని కూడా సంకల్పించింది.





జిల్లా అభివృద్ధికి కొత్తగా పద్దెనిమిది పథకాలను రూపొందించింది. గిరిజనుల విద్య, వైద్య, గృహ సౌకర్యాలపై ఎక్కువ దృష్టి సారించాలని నిర్ణయించింది.

అందుకు అంకితభావం, నిజాయితీ, గిరిజనులపట్ల సేవాభావం, చిత్తశుద్ధిగల ఐ.ఎ.ఎస్. అధికారులను ప్రత్యేకంగా ఏజన్సీ ప్రాంతాలకు బదిలీ చేసింది.

ఆ గదిలో...

సమస్యను చర్చించటానికి కొత్తగా వచ్చిన జిల్లా కలెక్టర్, ప్రాజెక్ట్ అధికారి, సబ్ కలెక్టర్, జిల్లా పోలీసు సూపరింటెండెంట్ హాజరయ్యారు.

అందరూ జిల్లాను 'ఆదర్శ జిల్లా'గా ఎలా తీర్చిదిద్దాలనే ఆలోచిస్తున్నారు.

ఆదర్శ జిల్లా అనేదే కొత్త పదం. ఒక కొత్త భావన.

ఆదర్శజిల్లా అంటే ఎలా ఉండాలి? అన్నింటా వెనుకబడిన జిల్లాను కేవలం ఒక వంద కోట్లతో ఎలా ఆదర్శ జిల్లాగా మార్చడం అనేది అందరి ఆలోచన.

ఒకవైపు గిరిజనుల భూమి సమస్య, భుక్తి సమస్య.

మరోవైపు దాన్ని ఆశ్రయించి, పెరిగి వేళ్లూనుతున్న తీవ్రవాద సమస్య. ఇద్దరికి మధ్య పోలీసులు, సి.ఆర్.పి. బలగాలు.

అటు తీవ్రవాదులు, ఇటు పోలీసులు. మధ్య ఊరి ప్రజలు. విడవమంటే పాముకు కోపం, కరవమంటే కప్పకు కోపంలా ఉంది సమస్య.

సమస్యా పరిష్కారానికిగాను ఒక ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేయబడింది. అది కలెక్టర్‌గారి ఛాంబర్.

సమావేశానికి పిలిపించింది కలెక్టర్.

మొదట ఆయన మాట్లాడాలి అన్నట్లు చూస్తున్నారు అందరూ. ఉట్నూరు ప్రాజెక్ట్ అధికారి, జిల్లా పోలీసు సూపరింటెండ్, సబ్ కలెక్టర్ ఉట్నూరు ఉన్నారక్కడ.

ఆ గదిలో చాలా సేపట్నించి నిశ్శబ్దం ఆవరించి వుంది. ఎవరి ఆలోచనల్లో వారు ఉన్నారు.

అందరి ఆలోచనలకు అంతరాయం కలిగిస్తూ, కలెక్టర్ తన సీటులో సర్దుకుని కూర్చొని "డియర్ ఫ్రెండ్స్'' అంటూ మొదలుపెట్టాడు.

"గత రెండు మూడు రోజులుగా మనం ఎంత అవిశ్రాంతంగా ఉన్నామో మీకు తెలుసు. ఈ రెండు మూడు రోజుల్లో అటు ముఖ్యమంత్రితోను, సెక్రెటరీ టు గవర్నమెంట్‌తోను, డి.ఐ.జి గారితోను మనమంతా మాట్లాడాము. విషయం మీకంతా తెలుసు.

చాలా సంక్లిష్టమైన దశలో మనం యీ ప్రాంతానికి బదిలీ చేయబడ్డాం. మన నలుగురి భుజస్కంధాలపై ప్రభుత్వం నేడు నమ్మకంతో ఒక గురుతరమైన బాధ్యతను ఉంచింది. ఇకనుంచి యీ జిల్లాలో ఎలాంటి అవాంఛనీయ సంఘటనలు, రక్తపాతం అది పోలీసులదేకాని తీవ్రవాదులదేకాని గిరిజనులదేకాని జరుగకూడదని జిల్లా అధికారిగా నా ఆకాంక్ష. అందుకు మీ సహాయ, సహకారాలు నాకు చాలా అవసరం. మనమంతా ఒక లక్ష్యంతో పనిచేద్దాం. ఆదర్శ జిల్లాగా ప్రకటించిన ఈ జిల్లా మిగతా జిల్లాలవారికి, మన రాష్ట్రానికి, చివరికి మన దేశానికి ఆదర్శమైనదిగా నిరూపిద్దాం.

నేడు మనకున్న యీ పరిస్థితులను ఒక ఛాలెంజ్‌గా తీసుకొని మనం పనిచేద్దాం. నిజానికి ఒక రొటీన్‌లో పని చేయడంలో ఆనందం లేదు. థ్రిల్ లేదు'' అంటూ ఆగి, ఫిల్టర్ వరకు కాలిన సిగరెట్‌ను ఏష్‌ట్రేలో పడేసి మరొకటి వెలిగించాడు.

ఈ జిల్లాలో కొన్నేళ్ళక్రితం ప్రాజెక్ట్ అధికారిగా ఇదే గిరిజన ప్రాంతంలో పనిచేసిన అనుభవం ఉంది అతనికి. అందుకని కలెక్టర్ మాటలు శ్రద్ధగా వింటున్నారు. అదీగాక ఇక్కడి గిరిజన ప్రాంతం, యీ పరిపాలన మిగతా ముగ్గురికీ కొత్త. ఈ జిల్లాకు యీ కలెక్టర్ ఒకరకంగా పాతకాపే.

"మొదట శాంతి భద్రతల సమస్యగా గిరిజన సమస్యను చూడవద్దని ఎస్.పిగారికి మనవి చేస్తున్నాను. గిరిజనులు గూండాలు కాదు. వారితో శాంతిభద్రతల సమస్య ఉండనే ఉండదు. ఇక ముందు కొన్నాళ్ళపాటైనా గిరిజన. గూడాలకు, అడవుల్లోకి ఏరకమైన పోలీసులు వెళ్ళకుండా చూడండి'' అన్నాడు కలెక్టర్.

"నా పదేళ్ళ సర్వీసులో యిలా అడవుల్లో పెట్రోలింగ్ చేయాల్సి వుంటుందని నేను ఏనాడూ ఊహించలేదు. .పరిస్థితులు మారాయి. నగరాలను వదిలి మేము కొండల్లో, కోనల్లో, అడవుల్లో పెట్రోలింగ్ చేయాల్సి వస్తోంది''

"నిజమే. ఎస్.పిగారు చెప్పినట్లు అనాగరికులతో పోలీసులకు సంబంధం ముందెన్నడూ లేదు. ఆ అనాగరికులను మన నాగరికులు దోచుకుంటున్నారు. ఆ గిరిజనులను గిరిజనేతరుడు దోచుకుంటున్నాడు. ఈ దోపిడి గత కొన్ని శతాబ్దాలుగా సాగుతోంది. దాన్ని అడ్డుకుంటున్నారు కొందరు యువకులు. వాళ్ళను మనం తీవ్రవాదులంటున్నాం. నక్సలైట్లంటున్నాం. న్యాయమైనా, చట్టమైనా రెండు వైపులా ఆలోచించాలి. అంతో యింతో చదువుకొని, చక్కగా నాగరికంగా, కుటుంబ జీవనం గడిపే కొంతమంది యువతీ యువకులు ఎందుకు యీ గిరిజన, భూమిలేని రైతుల సమస్యలను తమ భుజాలపై వేసుకొని, తమదైన రీతిలో ఎందుకు పరిష్కరించాలని చూస్తున్నారు? మీరు ఒకసారి ఆలోచించండి'' అంటుంటే ఎస్.పి. మధ్యలోనే అందుకొని

"సమస్యలుంటే మన ప్రభుత్వ కార్యాలయాలున్నాయి. చట్టాలున్నాయి. కోర్టులున్నాయి. వీటన్నింటిని కాదని లా అండ్ ఆర్డర్‌ను తమ చేతుల్లోకి తీసుకొని విచ్చలవిడి

గా ప్రవర్తిస్తుంటే ఎవరూరుకుంటారు?" అన్నాడు.

"నిజమే! మన ప్రభుత్వ కార్యాలయాల్లో ఎంత చిత్తశుద్ధి ఉందో మనకు తెలియంది కాదు. ఈ గది నాలుగు గోడలమధ్య మనం నలుగురమే ఉన్నాం కాబట్టి చెపుతున్నా. మరోలా అనుకోకండి. మన ప్రభుత్వ యంత్రాంగం ఎంత భ్రష్టు పట్టిపోయిందో ఎంత తుప్పు పట్టిపోయిందో మనందరికీ తెలుసు. ఎవరికోసం మనం నియమించబడ్డామో వారిని మనం ఉపేక్షిస్తున్నాం. ఎవడి కోసం మనం నియమించబడలేదో వాడి అడుగులకు మడుగులొత్తుతున్నాం. వాడి పని నిమిషాల్లో చేసి పెడుతున్నాం. వాడికి చేసే పని అన్యాయమైనా, చూసీ చూడనట్టు పోతున్నాం. దాంతో వాడికి లాభం. మనకూ లాభం. ఇలాంటి విచిత్రమైన పరిస్థితిలో మనం మన మనుగడ సాగిస్తున్నాం" అంటూ శూన్యమైన దృక్కులతో ఆగిపోయారు కలెక్టరుగారు.

"నేడు మనం ఈ కుర్చీల్లో కూర్చున్నా, కొన్నేళ్ళక్రితం వరకు మనమూ ఒక సామాన్య పౌరుడిగా యీ ప్రభుత్వ యంత్రాంగం పని తీరును చూసిన వాళ్లమే. మనమంతా అంటే మనం మన ప్రభుత్వ సిబ్బంది చిత్తశుద్ధితో పని చేసినప్పుడు యిన్ని సమస్యలుండవు. ఇంత తీవ్రవాదముండదు'' అన్నారు ప్రాజెక్ట్ అధికారి.

ఇంతలో అటెండర్ నాలుగు కప్పుల్లో వేడివేడి కాఫీ, బిస్కట్‌లు తీసుకొని వచ్చి అందరికీ యిచ్చాడు. కాలిన సిగరెట్ పడేసి వెంటనే మరో సిగరెట్ వెలిగించాడు కలెక్టర్‌గారు. సిగరెట్ వెనక సిగరెట్ వెలిగించడం కలెక్టర్‌గారి అలవాటు.

కాఫీ సిప్‌చేస్తూ మళ్లీ చర్చల్లో పడ్డారు.

"అసలు యీ దేశంలో ప్రజాస్వామ్యం ఉందా అని అనుమానం. ఇది బలవంతుడి రాజ్యం అంటే బాగుంటుంది. ఉన్నవాడు లేనివాణ్ణి దోచుకుంటాడు. దానికి తోడు యీ ప్రజల్లో గల అజ్ఞానం, అవిద్య, దోపిడికి గురికావటానికి మూలకారణం" అన్నాడు సబ్ కలెక్టర్.

సబ్ కలెక్టర్ డాక్టరు కూడ. ఎం.ఎస్. అయ్యాక, ఐ.ఎ.ఎస్ సెలెక్షన్ రావడంతో రూటు మార్చి యిటు వచ్చారు డాక్టర్‌కన్నా మేలయిన సేవలు చేయవచ్చనే ఉద్దేశంతో.

సబ్ కలెక్టర్ మాటలను అందుకుంటూ పి.ఓ.గారు

"నిజమే! గిరిజనులపై జరుగుతున్న దోపిడి, దౌర్జన్యాలకు మూలకారణం వారి అజ్ఞానం, అవిద్యనే. ఎలాగైనా వాటిని దూరం చేయగలిగితే మనం వాళ్లకు చాలా మేలు చేసినవాళ్లమవుతాం" అన్నారు.

"రైట్ గిరిజనులకున్న అజ్ఞానం, అవిద్యను తొలగించటానికి ప్రయత్నిద్దాం"

"గిరిజనుల్లో చాలామంది యువకులు తీవ్రవాదంవైపు మొగ్గు చూపుతూ, వారివైపున కొరియర్స్‌గా, మిలిటెంట్‌లుగా, సానుభూతి పరులుగా, ఆశ్రయం యిచ్చేవారిగా పనిచేస్తున్నారు. అందుకని గిరిజన యువకులను పెద్దఎత్తున పోలీసు మరియు ఫారెస్టు సర్వీసుల్లో రిక్రూట్‌మెంటు చేసుకోగలిగితే బాగుంటుందని నా ఆలోచన" అన్నారు ఎస్.పి.గారు.

ఎస్.పి.గారు ఎప్పుడు మాట్లాడినా ఇంగ్లీషులోనే మాట్లాడుతున్నారు. ఆయనకు తెలుగు రాదు. ఉత్తర హిందూస్థానీ ఆయనది. బీహారు ప్రాంతంవాడు కావడంతో అతడి హిందీ మిగతావారికి రాదు. అందుకని తెలుగు అర్థం చేసుకొని ఇంగ్లీషులోనే మాట్లాడుతున్నాడు.

సమస్యపట్ల నిజంగా స్పందించి, ఆలోచించి మాట్లాడుతున్నారు. కాబట్టి మిగతా ముగ్గురి సంభాషణ తెలుగులోనే సాగుతోంది. ఆ ముగ్గురు తెలుగువాళ్లు కూడా.

"ఎస్.పి.గారి ప్రతిపాదన బాగుంది. పనీ




పాటూ లేని యువకులనూ, వారి ఆలోచనలనీ దారి మళ్లించి వారికి ఉద్యోగం కల్పించడం" అన్నారు సబ్ కలెక్టర్‌గారు.

"పెద్ద సంఖ్యలో పోలీసు కానిస్టేబుల్, రిజర్వ్ పోలీసు కానిస్టేబుల్స్‌ను రిక్రూట్‌మెంట్ చేయగలిగితే బాగుంటుంది. వాళ్లను ఆర్థికంగా ఆదుకున్నట్లుంటుంది. మన బలగం కూడా పెరుగుతుంది. అప్పుడు యీ శాంతి భద్రతల సమస్య యింత కఠినం అనిపించదు'' అన్నారు ఎస్.పి.

"ప్రభుత్వం మనకిచ్చే వనరులతో యీ సమస్యను వేళ్లతో పెకిలించే ఉపాయం చూద్దాం. అంతేగాని కొమ్మలు కొట్టేపనివద్దు'' అంటూ కలెక్టర్‌గారు దీర్ఘమైన ఆలోచనలో పడిపోయారు.

ఆ గదిలో నిశ్శబ్దం తాండవిస్తోంది.

గిరిజనుల జీవితాల్లో శాశ్వత వెలుగు కిరణాలు ప్రసరింపజేయడానికి ఏం చేస్తే బాగుంటుంది.

ఎవరి పరిధిలో వారు ఆలోచిస్తున్నారు.

ఏం చేయాలి... ఏం చేయాలి.

అడవి, భూమిని పోగొట్టుకున్న గిరిజనుల్లో ముఖ్యంగా యువతరంలో నిరుద్యోగం తీవ్రంగా ఉంది.

ఒక కుటుంబంలోని ఒక నిరుద్యోగికి ఉద్యోగంవస్తే ఆ కుటుంబం ఆర్థికంగా బాగుపడుతుంది.

ఏ ఉద్యోగం ఇయ్యాలి గిరిజన యువకులకు, ఫారెస్ట్ గార్డా! పోలీసా!

"ఫ్రెండ్స్! గిరిజన యువకుల చేతికి, మెదడుకు పని కల్పిస్తూ పెద్ద సంఖ్యలో కొన్ని వందల సంఖ్యల ఉద్యోగాలు మనం యీయొచ్చు. అయితే ఏది మెరుగు! ఏ ఉద్యోగంతో గిరిజన యువకుడికి, గిరిజన కుటుంబానికి, గిరిజన సమాజానికి మేలు జరుగుతుందో ఆలోచించండి. గిరిజన యువకులకు ఫారెస్ట్‌గార్డ్, పోలీస్ కానిస్టేబుల్‌కన్నా యింకా మెరుగైన సేవలందించే ఉద్యోగం ఏదైనా ఉందేమో చూడండి'' అంటూ వాళ్లలో ఆలోచన రేకెత్తించాడు.

"ఆం చూడండి. గిరిజనుల్లో అజ్ఞానం, అవిద్య ఉన్నాయని కదా పి.ఓ గారు అన్నారు. ఆ అజ్ఞానం, అవిద్యపైనే మనం మన నిరుద్యోగ బాణం ఎక్కుపెడదాం. గిరిజన యువకులను ఉపాధ్యాయులుగా నియమిద్దాం. ఉద్యోగం దొరికిన యువకుడి కుటుంబం మొత్తం ఆర్థికంగా బాగుపడుతుంది. ఆ యువకుడి సేవవల్ల గిరిజనగూడెం బాగుపడుతుంది. వాళ్లలో వున్న అజ్ఞానం, అవిద్య దూరమౌతుంది. ముఖ్యంగా నేటి పిల్లల భవిష్యత్తయినా బాగుపడుతుంది'' అన్నారు కలెక్టర్.

"కాని అంతమంది అర్హతగల టీచర్ ట్రైనింగ్ చేసిన గిరిజన యువకులు దొరకడం కష్టం" అన్నారు సబ్‌కలెక్టర్‌గారు.

"వాళ్లలో పదవ తరగతి పాస్ అయినవాడు దొరకడమే కష్టం. టీచర్ అంటే, ఇంటర్ చేసి, ట్రైనింగ్ చేసినవాళ్లు ఎక్కడ దొరుకుతారండి'' అన్నాడు ఎస్.పి.

మళ్లీ తనే "కండబలం, ఎత్తు, లావు ఉంటాయికాబట్టి మా పోలీసు ఉద్యోగంలో ఏ రన్నింగో, జంపింగో యిలాంటివి పెట్టి సెలక్ట్ చేసి, తర్వాత ట్రైనింగ్‌కు పంపవచ్చు'' అన్నాడు. ఎంతసేపూ ఎస్.పిగారికి వేల సంఖ్యలో గిరిజన యువకులను రిక్రూట్ చేసుకొని, తన బలాన్ని, బలగాన్ని పెంచుకోవాలని, యీ రకంగా హెచ్చుమీరిపోతున్న తీవ్రవాదంపై దెబ్బకొట్టాలని యోచన.

"మన సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థలో అంతమందికి ఉద్యోగాలు యిచ్చే అవకాశాలు లేవు. అన్ని పాఠశాలలు కూడా లేవు మనకు'' అన్నారు పి.ఓ గారు.

"పాఠశాలలు లేకపోతే మనం కొత్తగా తెరుద్దాం. కొత్తగా పోస్టులు మంజూరు అయిన

పుడు కొత్త పాఠశాలలు తెరవడం పెద్ద సమస్యేం కాదు'' అన్నారు కలెక్టర్‌గారు.

ఈ ఆలోచన పి.ఓ గారికి, సబ్‌కలెక్టర్‌గారికి నచ్చింది కానీ ఎస్.పిగారికే అంతబాగా అనిపించలేదు. పల్లెటూళ్లల్లో ఉన్న పాఠశాలలే సరిగా నడవడంలేదు. మళ్లీ కొత్తవి తెరవడం ఏమిటి? బడి అంటే మాటలా! మజాకా! ఎన్ని వనరులుండాలి. స్కూల్ భవనం ఉండాలి, ఫర్నిచర్ ఉండాలి, ఇది సరియైన నిర్ణయం కాదేమో అనిపించింది ఆయనకి. కానీ ఏమీ మాట్లాడలేదు.

"సెక్రటరీ టు గవర్నమెంటు నుండి యీ ఉద్యోగ నియామకాల విషయమై మనం ప్రత్యేకమైన మినహాయింపు ముందే పొంది ఉంటే మంచిదేమో. ముఖ్యంగా తక్కువ విద్యార్హత గురించి తర్వాత శిక్షణ లేకున్నా ఉద్యోగం ఈయడం గురించి, యీ రెండూ లేకున్నా పూర్తి స్కేలుపై వారిని నియమించడం గురించి, మనం ముందే జాగ్రత్త పడితే మంచిదేమో'' అన్నారు సబ్‌కలెక్టర్‌గారు.

"యూ ఆర్ కరెక్ట్. రేపే ముఖ్యమంత్రిగారిని కలిసి, సెక్రటరీ టు గవర్నమెంట్‌తో చర్చించి ప్రత్యేక ఉత్తర్వులు తీసుకొస్తాను. మీరంతా యీలోగా గిరిజన గ్రామాల సర్వే రిపోర్ట్స్ మండల రెవన్యూ అధికారులకు పంపి తెప్పించండి. ఎక్కడ యిరవై మందికి మించి పిల్లలు ఉంటారో, బడికి రావటానికి వీలుగా అక్కడ మనం మన గిరిజన పాఠశాలను పెడదాం. తర్వాత వీలయినంత వరకు ఆ పిల్లలకు పాఠాలు చెప్పే టీచర్ ఆ ఊరిలోనే దొరికితే మంచిది. ఆ వివరాలు సేకరించండి. అలాగే చదువుకున్న యువకులను ఉద్యోగం చేసే ఉద్దేశ్యం ఉంటే వెంటనే ఎంప్లాయిమెంట్‌లో తమ పేరు నమోదు చేయించుకునేలా చూడండి. అందుకు ప్రత్యేకంగా ఎవరూ ఆదిలాబాద్ ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజ్‌కు వెళ్లే అవసరం లేకుండా మీరు ఉట్నూరులో, ఒక ఉపాధి కల్పనా కార్యాలయం సెల్‌ను తాత్కాలికంగానైనా వెంటనే తెరవండి. ఈ పనులన్నీ యుద్ధ ప్రాతిపదికపై జరిగిపోవాలి. మనం తిరిగి ఎల్లుండి కలుద్దాం. థ్యాంక్యూ ఫర్ యువర్ కైండ్ కోపరేషన్. అండ్ వి విల్ మీట్‌అగైన్ ఆన్ డె ఆఫ్టర్ టుమారో థ్యాంక్యూ " అంటూ సమావేశం ముగిసింది అన్నట్లు సూచిస్తూ ఛాంబర్ లోంచి వెళ్లిపోయారు.

కలెక్టర్‌గారు ఆదర్శ జిల్లాలో వేల మంది అర్హత కలిగిన, శిక్షణ పొందిన నిరుద్యోగులను వదిలి ఏమీరాని పదవ తరగతి కూడా పాసవని గిరిజన యువకులకు వేల సంఖ్యలో ఉద్యోగాలీయటానికి నిశ్చయించుకున్నారన్న వార్త దావానలంలా వ్యాపించింది.

ఈ విషయం నిరుద్యోగ యువకుల్లో, రాజకీయ నాయకుల్లో, గిరిజనేతరులలో పెద్ద కలకలం రేపింది.

ఈ ప్రయత్నాన్ని ఎలాగైనా నిలుపు చేయాలని అందరూ, అన్ని వైపులనుంచి ప్రయత్నాలు ప్రారంభించారు.

రాజకీయపరంగా ముఖ్యమంత్రిపై ఒత్తిడి తెచ్చి గిరిజన యువకులకు మాత్రమే యివ్వాలనుకుంటున్న ఉద్యోగ ప్రయత్నాన్ని విరమింపజేయాలని ఎంతో ప్రయత్నించారు. కాని వారు సి.ఎం.ను చేరేసరికే కలెక్టరుగారు సి.ఎం. అనుమతిని పొంది రాజధాని నుండి బయటపడ్డారు.

విషయం తెలుసుకున్న కలెక్టరుగారు ఇంటర్వ్యూలు ఎంత తొందరగా నిర్వహించి, ఎంత తొందరగా ఈ సత్కార్యాన్ని చేయగలిగితే అంత మంచిదనే నిర్ణయానికి వచ్చారు.

అదే విషయం సబ్‌కలెక్టర్ గారికి, పి.ఓ గారికి చెప్పారు.

కలెక్టరుగారు హైదరాబాదునుండి తిరిగి వచ్చేసరికి, ఉద్యోగార్హత కలిగిన గిరిజన యువకుల జాబితా తయారయింది. అలాగే





పాఠశాలలులేని గ్రామాలను కూడా గుర్తించడం జరిగింది.

"ఎల్లుండి రాత పరీక్ష... అదే రోజు ఇంటర్వ్యూలుంటాయని" సమాచారం గిరిజన నిరుద్యోగ యువకులకు చేర్చబడింది.

అనుకున్న తేదీకి ఉట్నూరులో రాత పరీక్ష నిర్వహించబడింది.

గిరిజన యువకుల నియామకాన్ని సవాలు చేయాలనుకున్న రాజకీయ నాయకులకు, గిరిజనేతరులకు చుక్కెదురు కావడంతో కోర్టుకు వెళ్లాలని నిర్ణయించుకున్నారు. కాని వరుసగా రెండు రోజులు సెలవులు రావడంతో ఏమీ చేయలేకపోయారు. అదీగాక కలెక్టర్ హైదరాబాదు నుండి తెచ్చుకున్న ఆర్డర్ మామూలుది కాదు సి.ఎం. తన మంత్రివర్గ కమిటీ, సెక్రటరి తుది గవర్నమెంట్‌తో ఆమోదం పొందిన ఉత్తర్వు అది.

అజ్ఞానం, అంధకారంలో మగ్గి దారి తప్పుతున్న గిరిజన యువకులను ఒక దారిలో పెట్టేందుకు, ప్రభుత్వం తీసుకున్న విధాయక నిర్ణయం అది. అయినా దాన్ని సవాలు చేయాలనే నిర్ణయించుకున్నారు గిరిజనేతరులు, యితర రాజకీయ నాయకులు.

ఇటు ఐ.టి.డి.ఎ ఆధ్వర్యంలో నిరుద్యోగ గిరిజన యువకులకు రాత పరీక్ష అయిపోయింది. అదే రోజు ఇంటర్వ్యూ.

ఒకరి తర్వాత ఒకరికి ఇంటర్వ్యూ సాగిపోతోంది.

ఇంటర్వ్యూ మధ్యలో ఒకసారి కలెక్టరుగారు, పి.ఓగారు బయటకొచ్చి.

'అందరికీ రాంరాం! అందరి రాత పరీక్ష అయిపోయింది. ఆ జవాబు పత్రాల మూల్యాంకనం జరుగుతుంది. అటు అది అయిపోయేలోగా ఇటు మీ మౌఖిక పరీక్ష కూడా అయిపోతుంది. ఎంతో శ్రమ పడి, ఎంతో దూరం నుంచి వచ్చారు. డబ్బులు లేక ఉట్నూరుకు గుడి హత్నూర్ నుండి నడిచి వచ్చిన వాళ్లూ ఉన్నారు. ముప్పయి ఆరు నలభయి కి.మీ. నడిచి వచ్చిన మీ ధైన్యస్థితిని నేను మరిచిపోలేను. అందుకని మళ్లీమళ్లీ మీరు రానవసరం లేకుండా, రాత పరీక్ష, ఇంటర్వ్యూ మరియు ఉద్యోగ ఫలితాలు ఒకే రోజున ప్రకటించాలని మేము అనుకుంటున్నాం. అందుకు నేడు రాత్రి చాలా పొద్దు పోవచ్చు. అయినా మీరెవరూ ఇక్కణ్ణించి వెళ్లిపోవద్దు. రేపు ఉదయం సూర్యుడు ఉదయించకముందే, మీ అపాయింట్‌మెంట్ ఆర్డర్ తీసుకొని, మరీ వెళ్లాలని నేను కోరుతున్నాను" అని చాలా ఉద్వేగంగా చెప్పుకొచ్చారు కలెక్టరుగారు.

అందరూ మంత్రముగ్ధులయి వింటున్నారు. అతి సామాన్యంగా కన్పించే యీ కలెక్టరుగారు తమ కోసం వచ్చిన దేవుడా అనిపించింది ఆ నిరుద్యోగ గిరిజన యువకులకు.

"ఉదయం రాత పరీక్షకు ముందు మీరు ఏం తిన్నారో ఏమో అందరికి మన సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థ తరపున భోజనం ఏర్పాటు ఇక్కడే చేయిస్తున్నాం. ఎవరూ బయట డబ్బులు పెట్టి తినొద్దు. అందరూ యిక్కడే భోంచేసి, ఇంటర్వ్యూ యిచ్చి, కలెక్టరు గారు చెప్పినట్టు మీ ఉద్యోగ నియామకం ఉత్తర్వు తీసుకొని ఉదయం వెళ్లాలి" అన్నారు పి.ఓ.గారు.

ఇంటర్వ్యూ మధ్యలో కరెంటు పోయింది.

వెంటనే పెట్రోమాక్స్ లైట్లు వెలిగాయి.

ఒకరి తర్వాత ఒకరి ఇంటర్వ్యూ సాగిపోతోంది.

కోర్టులో స్టే సంపాదించి అడ్డుకోవాలని అనుకున్నారు గిరిజనేతరులు, ప్రతిపక్ష నేతలు. కాని వారు ఊహించని రీతిలో పని జరుగుతోంది. ఎంప్లాయిమెంట్ ఆఫీసు నుండి అభ్యర్థుల జాబితా తెప్పించుకోవడం, రాత పరీక్ష, వాటిని దిద్దడం, ఆ తర్వాత ఇంటర్వ్యూ, ఆ తర్వాత ఫలితాల ప్రకటన

యిలా ఒక్కొక్క అడుగు వేసుకుంటూ, పోతా రనుకున్నారు కాని కలెక్టర్ వారి ఎత్తులను చిత్తుచేశాడు. వాళ్లు కోర్టు తలుపు కూడా తట్టలేదు. ఇటు అపాయింట్‌మెంట్ లెటర్స్ లైపుకు వెళ్లిపోయాయి.

అర్హమయిన వారికి అపాయింట్‌మెంట్ లెటర్స్ సిద్ధమయ్యాయి.

"ఇప్పుడు అర్హత కలిగిన చాలామందికే ఉద్యోగం యిచ్చే కాగితం యిస్తాం. వెంటనే వెళ్లి మీ సంబంధిత గ్రామంలో ఊరి పెద్దను కలిసి, బడిని ప్రారంభించండి, పిల్లలను జమ చేయండి. ఒక రిజిస్టరులో పిల్లల పేర్లు రాసి ఎవరి కొట్టంలోనో, చావిడిలోనో గుడి అరుగు మీదో ఎక్కడో ఒకచోట బడిని మొదలుపెట్టండి.

"మీకు ఉద్యోగం యిచ్చిన ఊళ్లో యింటింటికి తిరిగి బడికి రాదగిన వయసు ఉన్న పిల్లలను బడికి మీతోపాటే తెచ్చుకోండి. వాళ్లకు మొదట అఆలు పెట్టించి బడి ప్రారంభించండి. మీ వేయిమందికి ఉద్యోగాలు పొందడం మీ గిరిజనుల మొదటి విజయంగా భావించండి. ఇంకా తెల్లవారలేదు. మీరే ఆ ఉదయించే సూర్యుడి కన్న ముందు వెళ్లి, ఆ ఊరిని మేలుకొలపండి'' అన్నారు కలెక్టరుగారు.

"కలెక్టరుగారు చెప్పినట్లు, వెంటనే మీరు మీ గ్రామాలకు వెళ్లి ఉద్యోగంలో చేరండి. ఊరి పెద్దను కలిసి, బడిపెట్టడమే నీవు ఉద్యోగంలో చేరడం. అలా వెళ్లటానికి ఎవరికైనా డబ్బులకు యిబ్బందిగా ఉంటే మా ఆఫీసులో అడ్వాన్స్‌గా ముందు కొంత డబ్బు కూడా యిస్తున్నాం. తీసుకొని వెళ్లి ఉద్యోగంలో చేరండి. మరొక విషయం వారం రోజుల్లోగా మీ అందరికి ఉపాధ్యాయ శిక్షణ తరగతులు ఉట్నూరు లాల్‌టెకిడీలో నిర్వహిస్తాం. యీ విషయంలో మీరు ఎప్పుడు తరగతులకు రావాలో, మేము ఉత్తరం రాసి తెలుపుతాం. ఈ వేయిమందిని నాలుగు జట్లుగా చేసి శిక్షణ యిస్తాం. శిక్షణ కాలం పది రోజులువుంటుంది. ఆ పది రోజుల్లో మీకు చాలా సంగతులు చెప్తాం. నేర్పుతాం. ఆ శిక్షణను ఎవరూ కూడా తప్పిపోవద్దు.

బయట ప్రపంచం మీ మీద ఎంతో ఈర్ష్యతో ఉంది. ద్వేషంతో ఉంది. చులకన భావంతో ఉంది. దాన్ని మనం తిప్పికొట్టాలి. అందరం మళ్లీ శిక్షణ తరగతుల్లో కలుస్తాం. అందరికి రాంరాం!" అంటూ ముగించారు పిఓ గారు.

అపాయింట్‌మెంట్ ఆర్డర్స్ చూసిన గిరిజన యువకుల ముఖాలు ఆనందంతో విప్పారాయి.

చాలామందికి తాము కోరుకున్న ప్రదేశాలకు పోస్టింగ్ యిచ్చారు. తాము నివాసం ఉంటున్న గ్రామంలోనే తమకు ఉద్యోగం దొరికిందంటే నమ్మశక్యం కావడంలేదు వాళ్లకి.

గతంలో ఫారెస్ట్ గార్డులుగా, పోలీసు కానిస్టేబుల్స్‌గా, ఎక్సైజ్ కానిస్టేబుల్స్‌గా ఎన్నికయిన వాళ్లు కూడా యీ ఇంటర్వ్యూలకు హాజరై ఎన్నిక కాబడ్డారు. వాళ్లంతా ఆ ఉద్యోగాలు వదిలి యీ పంతులు ఉద్యోగానికే వెళ్లాలని నిర్ణయించుకున్నారు.

అల్లిగూడెం నుండి కూడ ఇద్దరు యువకులకు ఉద్యోగాలు దొరికాయి. ఒకడు మెస్రం జంగు, దేవుబాయిల కొడుకు తుకారాం. ఇంకొకరు కినాక బాలు తాత మనవడు, అంటే బిడ్డ కొడుకు మడావి రాముకు కూడా ఉద్యోగం దొరికింది. మడావి రాముకు అల్లిగూడెంలోనూ తుకారాంకు పక్క పల్లె సుద్దగూడెంలోనూ యిచ్చారు ఉద్యోగం.

★ ★ ★

ప్రతి గిరిజన గూడెంలో సుమారుగా ఒక బడి వెలిసింది. మెస్రం తుకారాం, అల్లిగూడెంలో పిల్లలందరిని పోగుజేశాడు. మొత్తం నలభయి రెండుమంది తేలారు.

ఒక రిజిష్టరు కుట్టి, అందరి పేర్లు వరుసగా




రాసి, వాళ్ల యిష్ట దైవం నాగోబాను, పెర్సపే నును పూజించి, బడి ప్రారంభించాడు.

ఉత్త ఊరి పిల్లలు. —

బడి పిల్లలయిండ్లు.

మెస్రం తుకారాం పంతులయిండు.

బడిని, బడి పిల్లలను, బడిల సార్‌ను అందరూ కొత్తగా చూస్తున్నారు. తుకారాం అందరికీ అక్షరాలు పెట్టించాడు. కొత్త ఉత్సాహంతో తుకారాం ముందుగానే ఆ రోజు ఉట్నూరు నుండి వస్తూ వస్తూ ఇందర్‌వెల్లిల పది పలకలు కొనుక్కొని మరీ వచ్చాడు. పలకలతోపాటు బలపాలు, అక్షర మాల చిత్ర పటం కూడా తెచ్చాడు. ఐ.టి.డి.ఎ ఇచ్చిన వంద రూపాయల అడ్వాన్స్‌ను అలా ఉపయోగించాడు.

బడి ఒక ఎడ్లపాకలో నడుస్తోంది. రాత్రి పశువులు వుంటాయి. దినం బడి నడుస్తోంది.

బడి చాలా ఉత్సాహంగా నడుస్తోంది.

అంతలోనే ఎడ్లబండ్లు వస్తున్నట్లు దూరంగా గజ్జెల చప్పుడు వినిపించడంతో బడి పిల్లలు, తుకారాం అందరూ లేచినిలబడి చూడసాగారు. వచ్చినబండ్లు, బడి పాక ముందే ఆగాయి. అప్పుడు సమయం ఒంటి గంట కావస్తుంది. మధ్యాహ్నం బడి వదిలే వేళ.

"రాం రాం! కినాక బాలు ఇల్లెక్కడ?" అని అడిగారు వచ్చినవాళ్లు.

"కినాక బాలు బిడ్డ కొడుక్కు సర్కారు జీతం దొరికిందట గద, నివద్దేనా?" అడిగాడు. వచ్చిన వాళ్లలో ఒక పెద్దమనిషి.

"ఆఁ దొరికింది. సుద్దగూడెంకు పోయిండు. బడి చెప్పతందుకు. బడి చుట్టి అయినంక వస్తడు'' అన్నాడు తుకారాం.

"జీతం ఎంత వస్తది'' అంటూ ఆరాలు తీయసాగారు.

"వేయి రూపాయల్దాక వస్తయి. ఇప్పటి దాంక జీతమే తీసుకోలే. మేం బడి చెప్పవట్టి ఒక నాలుగు దినాలేగద అయింది. నెల అయినంక యిస్తరు పైసలు'' అంటూ వివరాలు చెప్పాడు.

ఇన్ని వివరాలు అడుగుతున్నారంటే యిదేదో పెళ్లి సంబంధమే అయి ఉంటుందని పసిగట్టాడు తుకారాం. వచ్చినవాళ్లు అయిదు గురే ఉన్నారు. ఏ శుభకార్యానికైనా వెళ్తే ఐదుగురు వెళ్తే మంచి శకునం అని నమ్మకం.

వచ్చింది మడాలి రాముకు పెళ్లికి పిల్లనిచ్చే వాళ్లు కాబట్టి, యిక ఏమైనా అడిగితే ఆచితూచి మాట్లాడాలని అనుకున్నాడు.

ఊరు చిన్నది కాబట్టి, నీడ పట్టు చూసి బడి పక్కనే బండి వదిలి ఎడ్లను వేపచెట్టు నీడన కట్టేసి యింత మేత పడేసి, మడాలి రాము గురించి, సంబంధం కొరకు మాట్లాడటానికి తుకారాంతో కలిసి కినాకబాలు యింటికి బయలుదేరారు.

తుకారాం నాలుగడుగులు ముందు నడిచి వెళ్లి కినాకబాలుకు వచ్చిన వాళ్ల సంగతి చెప్పాడు. అప్పుడు కినాకబాలు, సీతక్క బిడ్డ రేలకు చాలా యిష్టమైన నిన్నటి చేపల పులుసును జొన్న గటకతో కలిపి ముద్దలు చేసి తినిపిస్తున్నాడు.

రేలకు చేప ముళ్లతో ఉంటే తినడం రాదు.

బాలు తాత ముళ్ళు తీసి శుభ్రం చేసి తినిపిస్తే యిష్టంగా తింటుంది. నిన్న రాత్రి చేసిన చేపల పులుసును నేడు తింటేనే మజా అని, రేల కోసం దాచి మరీ పెట్టటం బాలుతాతకు అలవాటు.

వచ్చినవాళ్ళ సంగతి తెలిసి, చేయి కడుక్కొని వచ్చి పక్కనే ఉన్న తలపాగను అడ్డం దిడ్డంగా తలకు చుట్టుకొని గుడిసె బయటకు వచ్చాడు కినాకబాలు.

వచ్చినవాళ్లు ఒక క్షణం కినాకబాలును గుడిసెను పరికించి చూశారు. రెల్లుగడ్డితో కప్పిన గుడిసె అది. అల్లిగూడెం అన్నీ గడ్డి గుడిసెలే. కూన కప్పిన గుడిసె ఒక్కటీ లేదు.



వచ్చిన వాళ్లను మర్యాదగా పలకరించాడు బాలుతాత.

కాళ్లకు నీళ్లిచ్చాడు తుకారాం.

ఈత కమ్మల చాపవేసి కూర్చోబెట్టి వచ్చిన వాళ్లందరికి తలా ఒక బీడి యిచ్చాడు బాలుతాత. బీడీలు ముట్టించి ఒక దమ్ము లాగి అసలు విషయానికి వచ్చారు.

"మొన్న సర్కార్ జీతం దొరికిన పిల్లడు నీ చిన్నకొడుకా'' అంటూ అడిగాడు వచ్చిన వాళ్లలో ఒక పెద్దమనిషి.

"కాదు నాకు కొడుకులు లేరు. ఒక బిడ్డ వుంటే నాడే పోయింది. మేము కినాకొల్లం నా మనుమడు మడావి. నా బిడ్డ పోయిన రెండేండ్లకే నా అల్లుడు కూడా పోయిండు. అప్పట్నించి నా తాటనే పెరిగిండు'' అన్నాడు బాలు తాత.

చూస్తుండగానే చుట్టుపక్కల యిండ్ల వాళ్లు పోగయ్యారు. జంగు భార్య దేవుబాయి, జైతు భార్య పైకుబాయి, ఇంకా చాలామంది పిల్లలు, పెద్దలు పోగయ్యారు.

వచ్చిన వాళ్లకు బెల్లం, చాయపత్తితో డికాషన్ తయారవుతోంది.

తుకారాం అందరికీ అన్నీ అందేలా, మర్యాదలో లోపం రావద్దన్నట్టు, చెప్పకుండానే అన్ని పనులు చేసుకుపోతున్నాడు. వచ్చిన చుట్టాలకు, యింట్లో మర్యాద తక్కువైతే అదీ ఆ ఊరికే మర్యాద తక్కువ.

వచ్చిన వాళ్లతో యిల్లంతా సందడిగా ఉంది.

అంతలోనే మధ్యాహ్నం తిండికని మడావి రాము రానే వచ్చాడు.

వరుసయిన వాళ్లు రాముతో పరాచికాలాడుతున్నారు.

"నీకు పిల్లనియ్యతందుకచ్చిండ్లు. మస్తు పైసలడుగు. ఘడి అడుగు. సైకిలడుగు. రేడు అడుగు. ఐదొద్దుల లగ్గం జెయ్యమను మీ మామను. మస్తు తినొచ్చు'' అని అంది పైకుబాయి.

"ఏం పిల్లడా! ఎక్కడ గలిసింది పోరి. కేసాలపూర్ జాతర్లనా? శ్యాంపూర్ సంతలనా? ఇందర్‌వెల్లి అంగట్లనా." అంది ఇసుబాయి.

"జీతం దొరకంగనే పిల్లను జూసుకున్నవన్నమాట. జల్ది కాని నీ లగ్గం, మస్తురోజులాయె. మన ఊల్లె దండారి ఎయ్యాక. నీ లగ్గంల మనమంత దండారి ఏస్తాం, ధింస చేస్తాం. జెల్ది లగ్గం పక్కజేసుకో పిల్లగా'' అంటూ వదిన వరుసతో, పరాచికాలాడింది దేవుబాయి.

మడావి రాము ఏమీ మాట్లాడలేదు. సిగ్గుతో పక్కకు పోయి, చిక్కుడు తీగల పందిరి కింద, మంచం వేసుకొని, ఒరిగాడు.

వచ్చిన చుట్టాలకు చాయ్-పానీ, బీడీ-కాడీ అయినాయి.

మెల్లగా అసలు సంగతిలోకి దిగారు. వచ్చినవాళ్లలోంచి ఒక పెద్ద మనిషి, విషయం మొదలు పెట్టాడు. "మా పెందూరు బలిరాంకు లగ్గం కచ్చిన పిల్లున్నది. పెద్దయి మూడేండ్లవుతున్నది. మీ పిల్లనికి ఈడు-జోడు అవుతదని, అడుగతందుకు అచ్చినమ్. పిల్ల సక్కంది. పనీపాటా అస్తయి. ఆల్ల యింట్ల పదిమంది పని, ఒక్క చేత్తోని సంబాలిస్తన్నది. పనికేం ధోకా లేదు. మీరు సై అంటే మాటముచ్చట మాట్లాడుకుందాం" అన్నాడా పెద్దమనిషి.

"పిల్ల పేరే జెప్పకపోతిరి. ఆ పిల్లడు సదుకున్నోడు. పిల్ల జోర్‌దార్ గుండాల. సదువు ఏమన్న అస్తదా? రాదా? సదుకున్నోనికి సదుకున్న పెండ్లం ఉంటం మంచిది. ఇంతకు మీరు ఏ దారితోని అస్తిరి. కాలి తోవనా? బండి బాటనా! లేక మోటారు దారా? మీరు ఎట్లొచ్చిండో, తెలుసుకుంటే మాకు ఏం మాట్లాడాల్నో తెలుస్తది'' అంది దేవుబాయి.

పిల్లనీయ వచ్చిన వాళ్ల స్థితిగతులను




వారు ఏ దారిన వచ్చారో చెప్పటాన్ని బట్టి, అంచనా వేస్తారు.

కాలిబాటలో వచ్చాం అంటే బీదవాళ్లని, ఏ ఆర్భాటం లేకుండ, మామూలుగా పెండ్లి చేసుకోమని అర్థం.

బండిబాటలో వచ్చాం అంటే పెళ్లి మామూలుగా చేస్తామని, మోటారు దారిలో వచ్చాం అంటే పెళ్లి గొప్పగా, పెద్ద ఎత్తున చేస్తామని, వాళ్ల గోప్యమైన అర్థం.

"మా పెందూర్ బలిరాంకు ఉన్నది ఒకతే బిడ్డ. పెద్దోల్ల లగ్గాలయినయి. ఇది చిన్నది. నాలుగు పైసలు ఎక్కువ పోయిన ఫర్వాలేదు, పిల్ల సుకంగుండాలి. పిల్లడు సదుకున్నోడు. జీతం కూడా చేయవట్టె. అందుకని మోటారు బండితోవ తోనే అచ్చినమను కొండ్లి'' అంటూ చెప్పాడు వెంట వచ్చిన పెద్దమనిషి.

"మీరు మోటారు దారితోని అస్తే నా హయిసియత్ అంత లేదుమరి. మొగ పిల్లోల్ల మయిన మేం ఉన్నోల్లమేం కాదు. మీరు జీతంజేస్తున్న అల్లుడు దొరికిండని మస్తే ఖర్చుపెడ్తారు. కాని మా సంగతి అట్లలేదు. లగ్గమన్నాక యిచ్చకం, పుచ్చకం వుంటాయి. మీరునాలుగు పెడ్తే మేం ఒకటన్నా పెట్టాల. మా హయిసియత్ చూసి యియ్యుండ్లి పిల్లని. ఉన్నమాట తెల్లగొలుగ జెప్పిన, ఇది గుర్రం. అది మైదానం ఏమంటరు'' అన్నాడు బాలు.

ఈ మాట నిజమే. ఏదో ఆడోండ్లు అడిగిండ్లని మేం జెప్పినమ్. ఏదన్న పెడ్తే మీరు పెట్టినా, పిల్లా పిల్లనికే, మేం పెట్టినా పిల్లా పిల్లనికే. ఎటువోతది. ఆల్లకే ఉంటది. మేం మా అల్లునికి పెట్టేటియి మేం పెడతం. మీరు పిల్లకు పెట్టేటియి మీరు పెట్టుండ్లి'' అంటూ విషయం తేటతెల్లం చేశాడు పెద్దమనిషి.

"పిల్ల పేరే చెప్పకపోతిరి'' అని గుర్తు చేసింది దేవుబాయి.

"మా పిల్ల పేరు సుభద్రబాయి'' అంటూ చెప్పాడు పిల్ల తండ్రి పెందూరు బలిరాం. మళ్లీ తనే...

"మా పిల్లకూడ, పదో తరగతిదాంక సదివింది. మొన్న ఐ.టి.డి.ఎల జీతం కొరక పోయిందిగాని, వయసులేదని జీతమియ్యలేదు'' అనిచెప్పాడు.

పెండ్లి పిల్ల పదవ తరగతి సదివిందని తెలుసుకొని కాసేపు అక్కడి వాళ్లెవరికి నోట మాట రాలేదు.

"మీకు పసందయితే ఎఱ్రబొట్టు పెట్టుకుందాం" అన్నాడు మధ్యవర్తి.

ఎఱ్రబొట్టు పెట్టుకోవడం అంటే తాంబూలాలు పుచ్చుకోవడం, నిశ్చితార్థం చేసుకోవడం అని అర్థం.

"రానీయుండ్లి మా వొల్లంతా చేనుకు చెట్టుకుపోయిండ్లు. పొద్దు మునిగే ఏల్లకు అందరస్తరు. అప్పుడు పెట్టుకుందాం ఎఱ్రబొట్టు'' అన్నాడు బాలు.

మడావి రాము పెళ్లి కుదిరిందనే వార్త నిమిషాల్లో అల్లిగూడెం మొత్తంకు తెలిసిపోయింది.

పెళ్లి కుదిరింది. సాయంత్రం ఎఱ్రబొట్టు పెడ్తారని తుకారాం చెప్పటంతో మడావి రాము ముఖంలో సంతోషం, సిగ్గు చోటుచేసుకున్నాయి ఒక్కక్షణం.

నాలుగు రోజుల క్రితం చూసిన సుభద్రాబాయి రూపం కళ్లముందు కదిలింది. మడావి రాము ఉట్నూరులో ఇంటర్వ్యూకు వచ్చినపుడు చూశాడు ఆమెని.

చదువుకున్న పిల్ల అనే భావన, ఆమె పైనుండి కన్ను తిప్పుకోకుండా చేశాయి. సుభద్రలోని అందం కన్న వయస్సు తెచ్చిన అవయవాలు రాముని ఆకట్టుకున్నాయి.

చుట్టాల కోడిని పట్టి, గుల్లకింద కమ్మి పెట్టారు.

యిప్పపువ్వు నానేసి బట్టీ పెట్టారు.

సాయంత్రం అందరూ వచ్చాక, ప్రధానుకేశవ్ ఆధ్వర్యంలో మడావి రాముకు,

పెందూర్ బలిరాం ఎఱ్ఱబొట్టు పెట్టి, నోట్లో కొబ్బరి, చక్కెర వుంచి సంబంధం ఖాయం చేసుకున్నాడు.

ఎఱ్ఱబొట్టుకు వచ్చిన ఊరి వాళ్లందరికి బెల్లం డికాక్షన్ ఇచ్చారు.

బయటి చుట్టాలు, ఇప్పపువ్వు సారా తాగి, కోడి మాంసంతో అన్నం తిని తేన్చారు.

చిన్నగా డోలు వాద్యం మొదలయింది. డోలుకు పఱ్ఱా లయగా తోడయింది.

గూడెంలోని ఆడవాళ్లు, మగవాళ్లు వయసు తారతమ్యం మరిచి ఒకరి భుజాల చుట్టూ యింకొకరు చేతులేసి లయ తాళాలకు అనుగుణంగా దండారి నృత్యం చేస్తున్నారు.

నృత్యం చేసే ఆడమగ అందరూ ఎంతో కొంత యిప్పసారా పుచ్చుకున్నారు. ఇప్ప సారా మత్తులో అడుగులు లయగా పడ్తున్నాయి.

మధ్యలో నిలబడి బాలు తాత, దండారి పాటలు పాడుతుంటే మిగతా వాళ్లు, అందుకుంటున్నారు లయగా అడుగులేస్తూ.

పాటకు డప్పు వాద్యం జోడయి, పాట ఊపందుకుంది.

డోల్, వెట్టి, పఱ్ఱా వాయిద్యాల సమ్మిశ్రమ సంగీతంతో దండారి వేసే వాళ్లలో హుషారు హెచ్చింది.

ఉండుండీ, కాలీకోమ్, పిల్లనగ్రోవి మోగి, వారి పద విన్యాసాల జతులను మారుస్తున్నాయి.

ఊళ్లో వాళ్లందరి కళ్లు, ఆనందంగా చాలా రోజుల తర్వాత దండారి చూస్తున్నాయి.

★ ★ ★

కలెక్టర్‌గారు ప్రకటించినట్లే, వారం రోజుల్లో కొత్తగా నియమించిన గిరిజన ఉపాధ్యాయులకు, ప్రత్యేక శిక్షణా తరగతులు, ఉట్నూరు లాల్‌టేకిడీ కొలామ్ ఆశ్రమ పాఠశాలలో ప్రారంభమయ్యాయి.

శిక్షణా తరగతుల ప్రారంభం రోజులు, జిల్లా అధికార యంత్రాంగమంతా అక్కడ ఏకత్రితమయ్యారు.

జిల్లా కలెక్టర్,
పోలీసు సూపరింటెండెంట్,
గిరిజన ప్రాజెక్టు అధికారి
గిరిజన ప్రాంత సబ్ కలెక్టర్
గిరిజన విద్యాశాఖాధికారి
జిల్లా సెషన్ జడ్జి
జిల్లా వైద్యాధికారి
జిల్లా అటవీ శాఖాధికారి

జిల్లాలోని అత్యంత కీలకమైన పరిపాలన వ్యవహారాలు చూసే వ్యక్తులంతా మొదటి రోజు శిక్షణా తరగతులకు హాజరయ్యారు. వీళ్లేం చెపుతారో రాసుకోవచ్చని అన్ని పత్రికల విలేకరులు, ఫొటోగ్రాఫర్లు సమావేశానికి హాజరయ్యారు.

వేదికనలంకరించిన అంతమంది ఉన్నతాధికారులను చూసి గిరిజన ఉపాధ్యాయ బృందం, ఆశ్చర్యపోయారు.

సభను ప్రారంభిస్తూ మొదట కలెక్టరుగారు మాట్లాడారు. మైకు ముందు నిలబడి,

"గిరిజన ఉపాధ్యాయ సోదరులందరికి రాంరాం!" అంటూ సంబోధించారు.

ప్రతిగా అందరూ "రాంరాం" అంటూ జవాబు చెప్పారు గిరిజన ఉపాధ్యాయులు.

గిరిజన ప్రాంతలో వున్న అనేక సమస్యల పరిష్కారానికి ఉపాయంగా నేను యీ ఉపాధ్యాయ పోస్టులను సృష్టించి మిమ్మల్ని నియమించడం జరిగింది. బయటి ప్రపంచంలో ఉండే ఉపాధ్యాయులతో మిమ్మల్ని పోల్చుకోకండి. వాళ్లు వేరు. మీరు వేరు. బెల్లు, బిల్లుతో ముడిపడి వుంటాయి ఆ ఉద్యోగాలు. మీరు అలా కాదు. పేరుకు నీవు ఉపాధ్యాయుడివి. కాని గిరిజన గ్రామానికి నీవే సర్వస్వానివి.

ఇకనుంచి నీ గ్రామంలో విద్య, వైద్య, ఆరోగ్యం, భూమి సమస్యలు, వృత్తి శిక్షణ నీటి సమస్య,పారిశుద్ధ్యం, అటవీ సంరక్షణ, వయోజన విద్య ఇలా ఎన్నో నీ చేతులమీదుగా జరగాల్సి ఉంది.




ఇరవైమంది పిల్లలను పోగుజేసి, ఉదయం పది గంటల నుండి, సాయంత్రం నాలుగు గంటల వరకు కేవలం బడి పాఠాలే చెప్పేదుంటే నేను కావాలని నిన్ను, అంటే ఒక గిరిజన యువకుణ్ణి ఈ ఉద్యోగానికి ఎన్నుకోవాల్సిన అవసరం లేదు. బయట మీ కన్నా విద్యావంతులు, తెలివిగలవాళ్లు, శిక్షణ పొందిన వాళ్లు కొన్ని వేలమంది ఉన్నారు. అలాంటి పరిస్థితిలో వారందరిని కాదని, నిన్నే ఎందుకు ఎన్నుకున్నాను అని ప్రశ్నించుకో.

నీ గిరిజన గూడెంలో నీ ఊరి పిల్లలకు, నీవు చెప్పగలిగినంత ఆపేక్షతో ప్రేమతో చిత్తశుద్ధితో, బయటివాడు చెప్పలేడని నిన్ను ఎన్నుకున్నాం.

బయటి నుండి వచ్చిన పంతులు మీ గూడెంలో ఉండలేడు. అతడికి మీ గూడెం వాతావరణం కొత్త. అతడికి కావలసిన సౌకర్యాలుండవు. దాంతో అతను తన విధిని సరిగా నిర్వహించలేడు. అందుకని నిన్ను ఎన్నుకున్నాం.

ఇంకో పంతులైతే మీ గిరిజనుల భాషలు గోండి, కొలామీ, మరాఠీ, లంబాడీ రావుకనుక మీ భాషలతో పరిచయం లేని ఆ పంతులు ఈ ఉద్యోగానికి న్యాయం చెయలేడు. అందుకని నిన్ను ఎన్నుకున్నాం.

నీ ఊళ్లో నీవొక్కడివే చదువుకున్నావు. మిగతా వారికి ఆ చదువునే చెప్పు. అన్ని అనర్థాలకు అవిద్య, అజ్ఞానం మూలం. వాటిని నీవు తొలగించు.

నీ వాళ్లకోసం, నీ గూడెం వాళ్లకోసం నీవు శ్రమించాలి. తగిన శిక్షణ నిచ్చి, నిన్నొక శక్తివంతమైన వ్యక్తిగా మేము రూపొందిస్తాం. అందుకే యింత మంది అధికారులు మీ దగ్గరకు వచ్చారు. మీ గూడానికి ఏం కావాలో నీవు ప్రభుత్వానికి చెప్పాలి. నీవు చెప్పిన పని కాకపోతే నిర్భయంగా ఇక్కడ



కూర్చున్న యీ ఉన్నతాధికారులకు చెప్పాలి. వీళ్లు మీ సమస్యలను తీరుస్తారు'' అంటూ వేదిక నలంకరించిన జిల్లా అధికారులను పరిచయం చేశారు.

"మీకు ప్రత్యేకమైన గుర్తింపు కార్డులిస్తాం. ఆ కార్డు పంపిస్తే జిల్లాలోని ఏ అధికారైనా సరే మీ సమస్యను వినటానికి తగిన చర్య తీసుకోవటానికిముందుకొస్తారు. అప్పటికీ వాళ్లు చర్య తీసుకోకపోతే మీరు సూటిగా నా దగ్గరకు రండి. మీ సమస్యలను పట్టించుకోని అధికారి సంగతి నేను చూస్తాను.

ప్రజల సమస్యలకు స్పందించి పనిచేయని ఏ అధికారి అయినా సరే నా హయాంలో యీ ప్రభుత్వ వ్యవస్థలో ఉండటానికి వీలులేదు. స్వచ్ఛందంగా సెలవుపెట్టి యింకో జిల్లాకు వెళ్లిపోవచ్చు'' అంటూ వేదిక పైగల అధికారులవైపు చూస్తూ చెప్పారు.

కలెక్టర్‌గారి నిక్కచ్చితనం, ఉన్న విషయాన్ని మొహమాటం లేకుండా, కుండబద్దలు కొట్టినట్లు చెప్పడం అదీ వేదిక మీదగల అధికారుల నుద్దేశించి అనడం, వేదిక వెనుక చుట్టుపక్కల బిల్డింగ్ బయటగల అధికారుల గుండెల్లో రైళ్లు పరిగెత్తించాయి. కలెక్టర్‌గారి ధోరణి ఇలాగే ఉంటే భవిష్యత్తులో తమ గతేమవుతుందో అని.

కాసేపు హాల్లో నిశ్శబ్దం తాండవించింది.

అంతలో ఒక గిరిజన ఉపాధ్యాయ శిక్షణార్థి లేచి "మా గొండోని మాటలు ఎవరు వింటారు సార్! మేమెంత? మా బతుకెంత? పదవ తరగతి చదివిన మమ్మల్ని ఎవరు ఖాతరు చేస్తరు'' అన్నాడు.

"కురుక్షేత్రంలో అర్జునుడు నీలాగే ఉంటాడు. కాని మళ్లీ యుద్ధం చేస్తాడు. గెలుస్తాడు. ఇప్పుడు నీ పరిస్థితి అంతే ఉంది. అన్నీ నువ్వే చేయమని అనటం లేదు. మీకూ, మాకూ మధ్య దూరం చాలా వుంది. ఆ దూరాన్ని నీ ద్వారా చెరిపేయాలని మా ఆశ.





గిరిజన ప్రాంతంలో నేడు కొన్ని వేల ఎకరాల భూమి బినామీ పేర్లతో చెలామణి అవుతుంది. అసలా వ్యక్తుల్లేరు.

కాని మా రెవెన్యూ రికార్డ్సు యీ విషయంలో చాలా పకడ్బందిగా ఉన్నాయి. ఆ బినామీ భూములను పదిలంగా కాపాడుతున్నారు. పటేల్‌లు, పట్వారీలు, తాసీల్‌దార్లు అందరూను. నీ పనేంటి నీ ఊరిలోగల మనుషుల పేర్లు, వారు సాగు చేస్తున్న భూమి వివరాలు సర్వే నంబర్‌తో యివ్వు చాలు. కొన్ని వేల ఎకరాల బినామీ భూములు వెలుగులోకి వస్తాయి. ఆ భూములు బయటపడ్డనాడు, భూమిలేని గిరిజనుడే ఉండడు.

భూ గరిష్ఠ పరిమితి అమలులో కొచ్చిన చోట చాలామంది గిరిజనేతరులు తమ కుటుంబంలో లేని సభ్యుల పేర్లు రాయించి, అలా కొన్ని వేల ఎకరాలు తమ అధీనంలోనే ఉంచుకున్నారు.

నమ్మకమైన సమాచారం అందించే నాథుడు లేక లక్షల ఎకరాల భూమి కొంతమంది చేతుల్లో ఉంది. అది ఇంకా చెల్లదు. భూమిని ప్రభుత్వపరం చేసేరోజులొచ్చాయి. అందుకు మీరే మా నమ్మకమైన నేస్తాలు అని నేను భావిస్తున్నాను.

నీ పని ఒక ఉపాధ్యాయుడిగా,
ఒక గ్రామ సేవకుడిగా,
ఒక అటవీ రక్షణాధికారిగా,
ఒక ఆరోగ్య కార్యకర్తగా,
ఒక సలహా దారుగా,
ఒక మార్గదర్శిగా,

ఎంతో ఉత్కృష్టమైంది. నీవు చేసే ప్రతి పని నీ ప్రజల బాగుకోసం, వాళ్లవృద్ధి సంక్షేమం కోసం అని ఎప్పుడూ గుర్తుంచుకో.

కలెక్టర్‌గారి తర్వాత ప్రాజెక్ట్ అధికారి మాట్లాడారు. "గిరిజనుల సంక్షేమం కోసమే, సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థ నెలకొంది. ఇరవై నాలుగు గంటలు మీ సేవకోసం నియమించబడ్డ, పెద్ద ఉద్యోగిని నేను. అంతేగాని నేనేం దేవుణ్ణికాదు. దయ్యాన్ని కాదు.

అధికారిగా మీరు నన్ను చూసి భయపడవద్దు. మీకేమైనా సమస్యలుంటే నన్ను కలవండి. నాకు చెప్పండి. ఐ.టి.డి.ఎ మీకోసం వెలిసిన ఒక దేవాలయం అనుకోండి. మీ ఊరికేం కావాలో చెప్పండి. సాధ్యమైనంత వరకు మీ కోరికల్ని ఐ.టి.డి.ఎ తీరుస్తుంది. కష్టపడి పనిచేయండి. చెమటోడ్చండి. మీరూ సుఖంగా ఉంటారు. దేశం సుఖంగా ఉంటుంది. పద్దెనిమిది రకాల పథకాలు మీకోసం సిద్ధంచేసి ఉంచాం. మీకు ఉండటానికి మంచి యిల్లు లేదు. ఇల్లేసుకోండి. గూన మేం ఇస్తాం. బావిలేదు. తవ్వుకోండి పైసలిస్తాం. బావి ఉంది. మోటరు లేదు. మీక్కావలసిన మోటారు పైపులు ఇప్పిస్తాం. మంచి విత్తనాలు, ఎరువులు, మందులు, సబ్సిడీ ధరకు యిస్తాం.

తోటలు పెట్టుకోండి. పండ్ల మొక్కలిస్తాం. పట్టు పురుగుల తోటలేసుకోండి. మన జిల్లాలో కావలసినంత సంద్రకర్ర ఉంది. దాంతో కాచుచేయడం నేర్చుకోండి. కాచు చేయడం, పట్టు పురుగులనుండి దారం తీయడం, పట్టుబట్టలు నేయడం, బీడీలు చేయడం, చెట్లు అంట్లు కట్టడం, చేపలు పెంచడం. తేనెటీగల పెంపకం. యిలా ఎన్నో ఉన్నాయి. అవన్నీ మీరు నేర్చుకోవచ్చు. చేసుకోవచ్చు. అందుకు తగిన శిక్షణ, వనరులను మేం కల్పిస్తాం.

మీ కోసం ప్రత్యేకంగా ఐ.టి.డి.ఎ సంస్థ ఉంది. దీనిద్వారా రకరకాల శిక్షణలను పొందండి, యింకా ఏదైనా వేరే శిక్షణ కావాలంటే మాకు తెలపండి. ఖర్చులు భరించి, మేమే శిక్షణకు పంపిస్తాం. వచ్చాక ఉపాధి కల్పిస్తాం. గిరిజన సంక్షేమం కోసం ఐ.టి.డి.ఎ చేయలేని పని అంటూ లేదు'' అంటుంటే.

"మా మంది మీ తాటికి రాతందుకు భయపడ్తరు సార్! మా మందికి ఆఫీస్‌లకచ్చి మాట్లాడాలంటే, మంచిగ తెలుగు మాట్లాట్టం రాదు. మా భాష, గొండభాష. అది మీకు అర్థం కాదు. తెలుగేమో, మా వాళ్లకు రాదు. అందుకు రాతందుకు యెనక ముందుజేస్తరు'' అన్నాడు ఒక ఉపాధ్యాయుడు.

"నిజమే, కాదనను ఈ విషయాన్ని. అందుకే నిన్ను అనుసంధాన కర్తగ, ఆ ఊరి పెద్దగ, బడి పంతులుగా నియమించింది. ఇవన్నీ చెప్పేది అందుకే లేకుంటే నీవు యిట్లా పాఠం చెప్పు, అట్లా పాఠం చెప్పు అని చెప్పకుండ, నీకు మన ఐ.టి.డి.ఎ పథకాల గురించి, పనుల గురించి ఎందుకు చెప్పడం. నీవు వాళ్లకు సమజాయించి, చెపుతవని, యిదంతా చెప్పుడు'' అంటూ చెప్పుకొచ్చారు పి.ఓగారు.

పి.ఓ.గారు వచ్చి నెలే అయింది కానీ ప్రజల నాడి యిట్టే పట్టేసారు. అందుకనే వాళ్లకు అర్థమయ్యే రీతిలో మాట్లాడాలని అతని ప్రయత్నం. గిరిజన సమస్యలకు పరిష్కారం లభింపజేయాలంటే ముందు వారి మనసులో స్థానం ఏర్పరచుకోవాలి. అందుకు వారి మాతృభాష గొండీ నేర్చుకోవడం ఒకటే మార్గం అని ఎప్పుడో గుర్తించాడు. అందుకని చాలా శ్రమపడి గోండీ నేర్చుకుంటున్నాడు.

ఎవరైనా సరే గిరిజన ప్రాంతంలో తాము చేసే ఏ పనైనా నూటికి నూరు పాళ్లు విజయవంతం కావాలంటే మొదట వాళ్లు వాళ్ల భాష నేర్చుకోవాలి. ఇది ప్రాథమిక సూత్రం.

ఈ సూత్రాన్ని మొదట పాటించి విజయం పొందిన వారు వ్యాపారులు, దళారులు, జర్మన్ దేశస్థుడు, మానవ పరిణామ శాస్త్రవేత్త ప్రొఫెసర్ హైమన్‌డార్ఫ్ కూడ, గొండీ భాష నేర్చుకునే గోండుల మనసు దోచుకొని, వారి మనసుల్లో శాశ్వత స్థానాన్ని సంపాదించుకున్నాడు.

పి.సి.గారి తర్వాత సబ్‌కలెక్టర్‌గారి ప్రసంగం మొదలయ్యింది. ఆయన మాట్లాడుతూ, "మీ గిరిజనుల భూమి సమస్యను చూడడం నా బాధ్యతగా అప్పగించారు కలెక్ట



రుగారు. కలెక్టరుగారు కోరి ప్రత్యేకమైన ఆసక్తితో, నన్ను ఈ ప్రాంతానికి పిలిపించుకున్నారు. మీ భూమి సమస్యకు సంబంధించిన చాలా విషయాలు ఒక్కొక్కటే తెలుస్తున్నాయి. మీ భూమికి సంబంధించి కబ్జాల గురించి, పట్టాల గురించి, మిగులు భూమి గురించి ఎన్నో అవకతవకలు జరిగాయి, అని స్పష్టంగా తెలుస్తోంది రికార్డుల బట్టి. అవి అన్నీ తొందరలోనే సవరించబడతాయి.

అందుకు మీకో విన్నపం. మీ ఊరి ప్రజలకు భూమికి సంబంధించిన ఏ సమస్య ఉన్నా, ఒక చిన్న పిటిషన్ రాసి, మా ఆఫీసులో ఇప్పించండి. ఆ పిటిషన్‌లను పరిశీలించి, పాత రికార్డులను తిరగేసి, నిజానిజాలను విచారించి పది ఇరవై గ్రామాలకు కలిపి, ప్రజా కోర్టులను నిర్వహించి, న్యాయాన్యాయాలను విచారించి, అక్కడికక్కడే విషయం పరిష్కరించి, మీకు న్యాయం జరిగేలా చూస్తాను'' అని అనగానే హాలంతా చప్పట్లతో, మారుమ్రోగిపోయింది.

తరవాత మిగతా ఉన్నతాధికారులు, తమ పరిధిలో గల, గిరిజన సమస్యలను పరిష్కరించి, సేవలనందిస్తామని ప్రకటించారు.

ప్రారంభ సమావేశం ముగిసి, బయటకు వచ్చిన కలెక్టరుగారిని విలేఖరులు చుట్టుముట్టారు.

"జిల్లా కలెక్టర్ అయివుండి, మీరు గత వారంరోజులుగా మిగతా పరిపాలనా వ్యవహారాలను, పక్కకు పెట్టి కేవలం గిరిజన సమస్యలకే ప్రాధాన్యత నిస్తున్నారని మీరు గిరిజన పక్షపాతి అంటున్నారు జనం- దానికి మీరేమంటారు?"

"సమస్యల తీవ్రతను, అవసరాన్ని బట్టి దేనికి ముందు, దేనికి ఎంత సమయం కేటాయించాలని నిర్ణయించడం విజ్ఞతతో కూడిన పని అని అంటాను నేను''

"ఇందర్‌వెల్లిలో కూల్చివేయబడిన స్మారక స్థూపాన్ని తిరిగి మీరు నిర్మిస్తున్నారని విన్నాం, నిజమేనా?"

"నిజమే. అది ఒక స్మారక చిహ్నం. దాన్ని కూలదోయడం అంటే, గిరిజన మృత వీరులను అవమానించడమే. అప్పుడు ప్రజల డబ్బుతో స్థూపం కట్టారు. ఎవరో తొందరపడి కూల్చారు. ఎవరు కూల్చారు అనేదాన్ని పట్టించుకోకుండా, వారంరోజుల్లో ఈ స్థూపం పునర్నిర్మించబడుతుంది. ప్రజావీరులు మృత్యుంజయులు''

"దాన్నిఎవరు కూల్చి ఉంటారని మీ ఊహ"

"నో కామెంట్'

"ఒక రకంగా మీరు నక్సలైటే అంటుంది-ప్రజల్లో ఒక వర్గం. ఎంతవరకు ఇది నిజం?''

"మంచి అన్నది మాల అయితే, మాల నేనవుతా అన్నాడు మన గురజాడ. అలాగే ఇదీనూ. హింస, రక్తపాతాన్ని నేను కోరుకోవడం లేదు. ప్రజాసంక్షేమం కోసం, కఠినంగా వ్యవహరించాల్సివస్తుంది. అప్పుడప్పుడు. అందుకు వెనకాడేది మాత్రం లేదు'' అంటూ మరో ప్రశ్నకు అవకాశం ఇవ్వకుండా, ముందుకు కదిలి కారెక్కారు కలెక్టరు.

పదిరోజుల శిక్షణా శిబిరంలో ఉదయం, ఏఏ విషయాలను విద్యార్థులకు బోధించాలి, ఆ విషయాలను ఎలా బోధించాలి అనే అంశాలు చెప్పబడ్డాయి.

మధ్యాహ్న భోజన విరామం తర్వాత వైద్య, ఆరోగ్య విద్య, జనాభా విద్య, మౌలికవిద్య, కుటుంబ సంక్షేమం, పరిసరాల పరిశుభ్రత పరిరక్షణ, అడవుల సంరక్షణ ఇలా అనేకానేక విషయాలపై, ప్రాథమిక సమాచారంతో కూడిన తరగతులు నిర్వహించడం జరిగింది.

శిక్షణ పూర్తయ్యాక ప్రతి ఉపాధ్యాయుడికి ఒక కిట్టు ఈయడం జరిగింది. అందులో గ్రామీణ ప్రాంతానికి అవసరమయ్యే ప్రథమ చికిత్స, కొన్ని మామూలు రోగాలకు ఉపయో




గించే మందులు. మలాములు మొదలైనవి సమకూర్చడం జరిగింది.

పదిరోజుల క్రితం, ఈ శిక్షణా శిబిరంకు వచ్చిన వాళ్లు కేవలం పదవతరగతి ఉత్తీర్ణులు అయిన యువతీయువకులు. ఇప్పుడు తిరిగి వెళుతున్నది ఒక శక్తివంతమైన, చైతన్యపూరితులైన, సమస్యలపట్ల అవగాహన కలిగిన సుశిక్షితులైన సైనికులు వాళ్లు.



ఉట్నూర్‌లో అది సబ్‌కలెక్టర్‌గారి కార్యాలయం. సబ్‌కలెక్టరుగారు వచ్చిన వారంరోజులు జిల్లాలోని అన్ని గిరిజన ప్రాంతాల రెవెన్యూ రికార్డ్సు, గిరిజన గ్రామాల్లో గల భూముల వివరాలు క్షుణ్ణంగా పరిశీలించసాగారు. ఫైలు తిరగేస్తుంటే కొత్త కొత్త విషయాలు వెలుగులోకి వస్తున్నాయి.

పేరుకే గిరిజన ప్రాంతం. పేరుకే ఏజన్సీ ఏరియా. భూమి అంతా కూడా గిరిజనుల నుండి అన్యాక్రాంతమయింది. వేల ఎకరాల భూమి గిరిజనేతరుల చేతిలో ఉంది. గిరిజనుల సాగులో ఉన్నది చాలా తక్కువ. ఈ జిల్లా భూమి సమస్య ఒక సముద్రంలా ఉంది.

చాలామటుకు రెవెన్యూ రికార్డ్సు చెడిపోయాయి. కొన్ని శిథిలావస్థలో ఉన్నాయి. కొన్ని అసలు దొరకడంలేదు. రికార్డ్సులేని వాటిని, ప్రస్తుత కబ్జాదారు పేరుతోనే వ్రాసుకున్నారు. కొన్నిసార్లు పటేలు, పట్వారి, గిర్దావర్, తాసీల్‌దార్‌లు అందరూ తలా ఒక చేయివేసి, తప్పుడు రికార్డులు సృష్టించి పెట్టారు.

1949 సంవత్సరంలో, మనకు స్వాతంత్ర్యం వచ్చిన కొత్తలోనే, ట్రైబల్ ఏరియా రెగ్యులేషన్ చట్టంచేసి, గిరిజన గ్రామాలను 'నోటిఫైడ్ ఏరియా'గా గుర్తించారు. 1960 ప్రాంతంలో మహారాష్ట్రనుండి పెద్ద సంఖ్యలో లంబాడాలు, మరాఠాలు ఈ జిల్లాకు వలసవచ్చి, గిరిజన భూములను ఏదో ఒకరకంగా, ఆక్రమించుకోవడం జరిగింది.

జిల్లా విస్తీర్ణం 16, 128 కి.మీ.లలో 6138 కి.మీ.ల విస్తీర్ణంలో, గిరిజనులు 344 గ్రామాలలో మూడు లక్షలమంది నివాసముంటున్నారు. జిల్లా జనాభాలో వీరు పదిహేడు శాతం వన్ ఆఫ్ సెవన్‌టి ఏక్ట్ ప్రకారం, గిరిజనుల భూమి గిరిజనేతరులు ఎవరుకొన్నా అది చెల్లదు. కాని ఆ ఏక్ట్‌ను ఎవరూ పట్టించుకోలేదు. కొనడం, అమ్మడం లేకుండా తోచినంత ఇచ్చి, వేలిముద్ర వేయించుకొని, కొన్నాళ్ల తర్వాత అసలు, వడ్డీ కింద, భూమి కబ్జా చేసుకోవడం ఇదీ తంతు. భూమికి రిజిస్ట్రేషన్ ఉండదు. పట్టా ఉండదు. పహణీలో పట్టేదార్ కింద గిరిజనుడి పేరుంటుంది. కబ్జ, కాస్తుకార్ కింద గిరిజనేతరుడి పేరుంటుంది.

ఇలా భూమి పోగొట్టుకున్న గిరిజనుడు అడవిని నరికి, కొత్తసాగు చేయడం నేర్చుకున్నాడు. దున్నేవాడిదే భూమి అని ఒక ప్రభుత్వం ఒకసారి ప్రకటించడంతో గిరిజనులు వేల ఎకరాల అడవిని నేలమట్టం చేశారు.

ఫైలు తిరగేస్తూ, జరిగిన విషయాలు ఆకళింపు చేసుకుంటూ పోతుంటే, సబ్‌కలెక్టర్ గారి బుర్ర కాసేపు వేడెక్కిపోయింది.

కొన్ని దశాబ్దాలుగా అణచి వేయబడి, అణగదొక్కబడిన భూమి సమస్య ఇది. ఈ భూమి సమస్యను పరిష్కరించడం అంటే, పదునైన కత్తిమీద, సాము చేయడమే అని

పించింది.

ఏ సమస్యను ముందుంచుకొని, తీవ్రవాదులు గిరిజనులకు, వెనుకబడిన వర్గాలకు, న్యాయం చేయాలని చూస్తున్నారో, ఆ న్యాయం చట్టబద్ధమైందే. అభిలషణీయమైందే. మరి దాని అమలుకు ఇన్ని మడతపేచీలు ఇంత జాగు ఎందుకు జరుగుతున్నాయో ఊహించగల్గుతున్నాడు.

చేసిన చట్టాన్ని అమలు పరిస్తే, మొదట గద్దెనెక్కిన వాళ్లు, గద్దెనెక్కాలనుకునేవాళ్ల మెడకే ఉచ్చు బిగిస్తుంది.

గిరిజనులు, వెనకబడినవాళ్లూ కేవలం ఓటు మాత్రమే వేస్తారు. కాని ఓటరును బ్యాలట్ బాక్స్‌వరకు నడిపించేవాడు ఒక గిరిజనేతరుడు, ఒక అగ్రకులంవాడు అనేది నిజం.

సబ్‌కలెక్టరుగారు తనకున్న రెవెన్యూపరమైన మెజిస్ట్రీరియల్ హక్కును పూర్తిగా వినియోగించి గిరిజనులకు పూర్తి న్యాయం చేయాలనుకున్నాడు. అందుకుగాను ప్రజలు ప్రభుత్వం దగ్గరికి రావడం కాకుండా, ప్రభుత్వమే ప్రజల దగ్గరకు వెళ్ళి వాళ్ల సమస్యలు విని, పరిశీలించి అక్కడికక్కడే పరిష్కరించాలని అనుకొన్నాడు. ప్రతి పది-ఇరవై గ్రామాలకు కలిపి ఒక ప్రజాకోర్టు నిర్వహించాలనుకున్నాడు.

అప్పుడు 'అన్న'ల భయంతో అధికార యంత్రాంగం అంతా గజగజ వణికిపోతోంది. పెద్ద ఎత్తున జరిగిన అల్లంపల్లి మందు పాతరపేలుడు సంఘటన, అవినీతిపరులైన అధికారుల కిడ్నాపు, జీబుల దహనం చేయడంలాంటివి మామూలు అయిపోయాయి.

అధికారులు ఎవరూ కూడా తగిన పోలీసు బందోబస్తు లేనిది, ముందు సూచన ఇచ్చి అనుమతి పొందకుండ వెళ్లినవాళ్లు వాళ్ల ప్రాణాలకు వాళ్లే బాధ్యులని తెలియపర్చింది ఒక సర్క్యులర్ ద్వారా.

ఏ అధికారి అయినా తప్పనిసరి పరిస్థితిలో విధి నిర్వహణలో మారుమూల పల్లెలకు వెళ్లవలసివస్తే తగు పోలీసు రక్షణ పొందాలని సూచించింది. ఎట్టి పరిస్థితిలో ఏ అధికారి అయినా సరే చీకటిపడకముందే తిరిగి తన హెడ్‌క్వార్టర్ చేరుకోవాలని ఆదేశించింది.

ప్రభుత్వ సిబ్బందికి, అధికారులకు పై అధికారుల ఈ సర్క్యులర్ ఎంతో బాగుందనిపించింది. ఎవరూ ఎటూ కదలడంలేదు. ఏ అధికారి అయినా ఎక్కడికైనా టూర్‌కు వెళదామంటే 'వద్దు సార్. ఆ రూట్‌లో అన్నల భయం ఎక్కువ. ఎందుకు అనవసరంగా రిస్క్ తీసుకుంటారు. మనం వెళ్లకపోతే ఎందుకు వెళ్లలేదని మనల్ని ఎవరూ అడగరు. వెళితే, ఏమయినా అయితే, ఎందుకు వెళ్ళావు? ఎవరు వెళ్లమన్నారు, మేము ముందే సర్క్యులర్ పంపాంగా. ఎవరూ 'ఎలాంటి రిస్క్ తీసుకోవద్దని అంటారు' అంటూ వారించేవారు.

సబ్‌కలెక్టర్‌గారు ఏ ప్రభుత్వ తాకీదును పాటించలేదు. "అన్నలు కూడా గ్రామాల్లో భూమిసమస్య గురించే ప్రజాకోర్టు నిర్వహించి ప్రజల మన్నన పొందారు. అలాంటప్పుడు ప్రభుత్వం ప్రజల దగ్గరికి వెళ్ళి, ప్రేమతో వాళ్ల సమస్యలను విని, అర్థం చేసుకొని పరిష్కరిస్తామంటే వాళ్లకేం చేదా! ప్రజలకు న్యాయం చేయాలని మనం వెళితే మనల్ని ఎవరూ అడ్డగించరు. ఎవరూ కూడా కిడ్నాప్ చెయ్యరు. మన వాహనాన్ని, మన ఫైళ్లను ఎవరూ తగలబెట్టరు'' అని తన సిబ్బందికి చెప్పి ఉదయం ఆరుగంటలకు ఉట్నూరు నుండి బయలుదేరి మళ్లీ ఎప్పుడో రాత్రి పన్నెండు గంటలకు ఇల్లు చేరేవారు.

ఆ సబ్‌కలెక్టర్ ప్రజలకోసం, ప్రజలు కలలు కనే భూమి సమస్యను పరిష్కరించడంలో ఎంతో సంతృప్తిని పొందేవాడు. ఆ ప్రజాకోర్టుల నిర్వహణలో అతడికి ఆకలి-దప్పుల




ధ్యాస ఉండేదికాదు. తన తోటి గుమాస్తాలతో కూడా ఎంతో కలిసిపోయి పనిచేయించుకునే వాడు. అతడి వెంట ఉండి పనిచేయడం వాళ్లకు తృప్తిగా ఉండేది.

సుమారు కొన్ని వేల ఎకరాల భూమి సమస్యలను సమర్థవంతంగా పరిష్కరించా డా సబ్‌కలెక్టర్.

ఈ సబ్‌కలెక్టర్ ఇలాగే ఇక్కడే కొనసాగితే తన బినామీ భూములకు నూకలు చెల్లుతా యని గ్రహించిన గిరిజనేతరులు ముఖ్య మంత్రిపై ఒత్తిడి తెచ్చి సంవత్సరం తిర క్కుండానే ఆ సబ్‌కలెక్టర్‌ను బదిలీ చేయించా రు.

ఇదీ! రాజకీయ నాయకుల చిత్తశుద్ధి. జీతం రాళ్లకు పనిచేసే ఒక ప్రభుత్వ ఉద్యోగికి ప్రజలపట్ల ఉన్న ప్రేమ, సమస్యలపట్ల ఉన్న అవగాహన; ప్రజల ఓట్లతో అధికారపీఠం అధిష్ఠించిన నాయకుల్లో పూజ్యం. ప్రజాసమ స్యలను మరిచి కొంతమంది లాభంకోసం వేలు, లక్షల రైతుల పొట్టమీద కొట్టడం ఈ దేశంలో ఈ ప్రజాస్వామ్యంలో నేడు కొత్తేమీ కాదు.

గిరిజన సమస్యలపట్ల అధికంగా స్పంది స్తున్నాడని, కూల్చివేసిన ఇందర్‌వెల్లి గిరిజన మృతవీరుల స్థూపాన్ని తిరిగి ప్రభుత్వ ధనంతో "ప్రజావీరులు మృత్యుంజయులు" అనే పేర నిర్మించాడని వేలమంది గిరిజన యువతీయువకులను ఏకోపాధ్యాయ పాఠశా లలో ఉపాధ్యాయ శిక్షణ లేకున్నా నియ మించాడని కక్షతో కలెక్టర్‌గారిని కూడా ఏడాది తిరగకముందే బదిలీ చేయించేవరకు నిద్రపో లేదు పాలకవర్గం, ప్రతిపక్షం.

ఈ ప్రజాస్వామ్య దేశంలో నీతినిజాయితీ, ప్రజలపట్ల, పేదలపట్ల ప్రేమానురాగాలు కలిగి అంకితభావంతో పనిచేసే అధికారులకు స్థానం లేదు.

ఈ దేశంలో ప్రజాస్వామ్యం నేతిబీరకా యలో నెయ్యిలాంటిది.

సబ్‌కలెక్టర్- కలెక్టర్‌గారి బదిలీ తర్వాత మళ్ళీ పరిపాలన యధారాజా- తథా పరిపాల నగా కొనసాగింది.

★ ★ ★

కలెక్టర్ పుణ్యమా అని ఉద్యోగ అర్హతలేని వాళ్లెందరో పంతుళ్లయ్యారు. ఉన్న ఊరికి, తన జాతికి ఎంతో కొంత మేలు చేస్తారని ఆశించిన కలెక్టర్‌గారి నమ్మకం వమ్మ యింది. ఎంతో మహదాశయంతో కలెక్టర్‌గా రు కల్పించిన ఉపాధ్యాయపోస్టులు అందరి బడిపంతుళ్లలాగే అయ్యాయి. వీళ్లు కూడా బెల్లు, బిల్లుకు పరిమితమయ్యారు. రెండు వేల రూపాయలు కళ్ల చూడగానే గిరిజన యువకుల్లో స్వార్థచింతన, అలసత్వం పెరిగి పోయింది.

ఏకోపాధ్యాయ పాఠశాలలు కావడంతో ఎవరూ సరిగ్గా బడి చెప్పడంలేదు. దూరంగా ఉన్నవాళ్లు అసలు బడికి వెళ్లకుండానే నెలనె లా జీతాలెత్తుతున్నారు.

నాలుగు జీతంరాళ్లు కళ్ల చూడగానే గూడె మంటే మొహం మొత్తింది చాలామందికి. తాలూకాల్లో, మండలాల్లో మకాం పెట్టి నడవ సాగారు. గిరిజనేతర ఉపాధ్యాయులు వీళ్లకు ఆదర్శం. గిరిజనేతర ఉపాధ్యాయుడు స్థాని కంగా ఉండలేడు, స్థానిక ప్రజల భాషలో బోధించలేడు, తనవాళ్లుకాని వారిపట్ల ప్రేమా నురాగాలు ఉండవని గిరిజన గూడాల్లో గిరి జన యువతీ-యువకులను ఉపాధ్యాయులు గా నియమిస్తే చేసిన నిర్వాకం జిల్లా కలెక్టర్ తలదించుకునేలా ఉంది.

అలా ఉన్న ఊరిని, కన్నతల్లిదండ్రులను, తోబుట్టువులను వదిలి దూరంగా "నేను నా పెళ్లాం, నా పిల్లలు" అని బ్రతుకుతున్నవా ళ్లలో దేవుబాయి, జంగుల కొడుకూ ఉన్నాడు. కినాక బాలుతాత మనవడూ ఉన్నాడు.

గిరిజన యువకులకు ఉద్యోగం ఈయడం అనే కలెక్టర్‌గారి శ్రమ, చిత్తశుద్ధి బూడిదలో పోసిన పన్నీరే అయింది

★ ★ ★

పెండ్లయిన ఆర్నెల్లకే తుకారాం తన మకాం గుడిహత్నూర్‌కు మార్చాడు. ఈలోపు అతడి భార్య సుభద్రబాయికి కూడా పంతులు ద్యోగం దొరికింది. గుడిహత్నూరుకు మారిన కొత్తలో వారం పదిరోజులకు ఒకసారి వచ్చి తల్లిదండ్రులను చూసి పొయ్యేవాడు. ఇప్పుడు అదీ తగ్గింది.

ఇద్దరిజీతం తలా రెండువేలు.

ఇప్పుడు తుకారాం హీరో హెూండాపై పెళ్లాన్ని పక్కూళ్లో వదిలిపెట్టివస్తాడు. వారానికి తలా రెండురోజులు ఉద్యోగం చేస్తే మహాగొప్ప. ఇప్పుడు తుకారాం అమాయకుడేం కాదు. బతకనేర్చిన బడిపంతులు. బడికి ఎప్పుడు వెళ్లాలి, ఎప్పుడు వెళ్లకూడదు అన్నీ తెలిసిన జ్ఞాని.

తుకారాం సుభద్రాబాయిల జీవితం హాయిగా గడుస్తోంది. కూలర్, ఫ్రిజ్, గ్యాసు కొనుకున్నారు. అదిలాబాదులో ఇంటికోసం ప్లాట్‌కై వెతుకుతున్నాడు. నెలనెలా ఐదువందల చిట్టి కడుతున్నాడు.

ఐ.టి.డి.ఏ. పంతులుద్యోగంతో అదీ రెండు ఉద్యోగాలతో తుకారాం దంపతుల జాతకమే మారిపోయింది.

ఒక వ్యక్తికి ఉద్యోగం ఇస్తే అతడి కుటుంబం బాగుపడుతుందనుకుంటే ఇక్కడ కుటుంబం నిర్వచనమే మారింది. కుటుంబం అంటే ఈ యాంత్రిక, ఎలక్ట్రానిక్ యుగంలో తల్లీదండ్రి, తమ్ముడూ, చెల్లెలు తాత, నాయనమ్మ అని కాదు. కుటుంబం అంటే భార్యా, భర్త పిల్లలు.

మారుతున్న కాలంతో మారుతున్న విలువలు.

మారనిది కన్నవాళ్ల ప్రేమలు- అపేక్షలు మాత్రమే.

★ ★ ★

అప్పుడే అడవినుండి వచ్చిన జంగు, గొడ్డలి, మూలకు పడేసి గోలంలల నీళ్లతో కాళ్లు కడుక్కుంటున్నాడు.

గింజలు పట్టకుండానే గిడసబారి ఎండిపోయిన మొక్కజొన్న కంకులను, నీళ్లలో ఉడకేసి, ఇంత ఉప్పేసి, మెత్తగా రుబ్బి పిల్లలకు ఎలాగో పెట్టింది దేవుబాయి. పిల్లలు ఏదో తిన్నామనిపించారు. కాని, దినమంతా భూమిని నమ్ముకొని మట్టిబెడ్డల్లో కష్టపడే పెనిమిటికి, మక్కకండెల జావ పెట్టటానికి దేవుబాయికి మనసొప్పలేదు. అయినా తప్పదనుకుని సత్తు పళ్లెంలో ఇంత మక్క కండెల జావపోసి, ఏదో పని ఉన్నట్టు గుడిసెలలోంచి బయటపడ్డది.

పళ్లెంలో గల పదార్థమేదో కనుక్కోలేక పోయాడు జంగు. ఒకముద్ద తీసి, నోట్లో పెట్టుకున్నాడు. ఉప్పగా, కారంగా ఉంది. రుచి ఏమాత్రం లేదు. పళ్లెంలో సంకటి పెట్టి, ఎదురుగా కూర్చొని, తను తింటూ వుంటే, అపేక్షగా తనవైపు చూసే దేవుబాయి, నేడు ఎడమొహం చేయడంతో మనసు కలుక్కుమంది. ముద్ద గొంతు దిగలేదు. అలాగే ఎంగిలి చేత్తో లేచి, గుడిసె బయటకు వచ్చాడు. దేవుబాయి పిల్లల పాతబట్టలు ముందేసుకొని, చినుగులు కుట్టసాగింది.

"నువ్వు తిన్నవా?" అని అడిగాడు ప్రేమగా జంగు.

"నాకు ఆకలి లేదు'' అంది దేవుబాయి. కళ్లనీళ్లు బయటికి రాకుండా అణచుకుంటూ.

మక్కజొన్న కంకులు ఉడికేసినా, అది కూడా పెనిమిటికి పిల్లలకే సరిపోనంత ఉన్నాయి. అయినా వాళ్లు తింటే, తన కడుపు నిండదా ఏంది? అనుకుంది దేవుబాయి.

"నాకన్నీ తెలుస్తాయి. దా! ఇద్దరం తిందాం" అంటూ గుడిసెలోకి నడిచాడు జంగు.

ఇంట్లో గింజలేదు. చేతిలో గవ్వలేదు. చేయడానికి కూలి లేదు. గూడెంలో అందరూ అడవికి కూలికి పోతున్నారు. చాక్‌తరస్‌కు పోతే, పైసలొస్తయని అందరి ఆశ.




నెలకు రెండువేల రూపాయలొచ్చే ఉద్యోగంతో ఆదుకుంటాడనుకున్న కొడుకు తుకారాం రెక్కలొచ్చి, లగ్గమైన ఆర్నెల్లకే, ఊరిడిసి పెట్టి, పెండ్లాంతో, గుడిహత్నూర్‌ల పోయి ఉండవట్టె. ఆ కొడుకే ఇప్పుడుంటే ఎంతో ఆసరా అవుతుండెగదా! కన్నోల్లతోని సుకపడతందుకు కూడా కిస్మత్ ఉండాలి అనుకుంది దేవుబాయి.

అదేం పేగుమాయో కమ్మటి తిండితిన్నా, కష్టమొచ్చినా, కన్నకొడుకే గుర్తొస్తాడు.

ఈ ఏడు 'చాక్‌తరస్'కు పోయి, కొమ్మ కొట్టుడంటేనే అందరి మనసులు ఎట్లెట్లనో అవుతున్నాయి. దగ్గర ఉన్న జంగలంతా రోజురోజుకు నాశనమయిపోయే.

ముందు ఊరిని ఆనుకొని వుండే అడవి నేడు రెండు కోసుల దూరమైపోయింది. అంత దూరం పోయినా, అక్కడొక చెట్టు, ఇక్కడొక చెట్టు, అందులో తునికి చెట్లు మరీ తక్కువయి పోయినయి. ఈ రోజుల్లో చాక్‌తరస్‌కు పోవుడంటే మాటలు కాదు. అంత దూరం నడవాల. జంగల్లో తునికి చెట్లు వెతకాల ప్రత్యేకంగా. చెట్టు ఎక్కి, కొమ్మలు కొట్టాలి.

ఇట్లా దినమంతా ఆగకుండా, చాక్‌తరస్ చేస్తే కూలి ఇస్తరు జంగ్లాతువాళ్లు.

గడిసేపు ఆలోచనల్లో కూరుకుపోయిన దేవుబాయి ముందు, జంగు పళ్లెం పెట్టుకొని కూర్చున్నాడు. పళ్లెంలో మొక్కజొన్న కండెల సంకటి ఎట్లదట్లనే ఉన్నది. జంగు కలిసే తిందాం అన్నట్టు, సైగ చేయడంతో, దేవుబాయి ముద్దతీసి, మొగని నోటికి అందించింది.

జంగు అపురూపంగా ముద్ద అందుకున్నాడు.

దేవుబాయి చేతికంటిన ఎంగిలిని ఎంతో ప్రియంగా వేళ్లు నాకసాగింది. దూరంగా చింతచెట్టు కింద పిల్లలను చూస్తూ, దేవు మొగుడికి ముద్దలందిస్తోంది. మధ్య మధ్య తానూ తింటోంది.

చింతచెట్ల కింద పిల్లలు, రాళ్లతో చింతకాయలను రాలుస్తున్నారు. ఆ చెట్టుకు చింతకాయలు ఎప్పుడో అయిపోయినవి. అక్కడో కాయ, ఇక్కడో కాయ ఉంది. వాటినే రాళ్లతో కొడుతున్నారు. ఉండీ ఉండీ ఓ పది దెబ్బలకు ఒక కాయ రాలుతుంది. పిల్లలంతా ఎగబడి, రాలిన కాయను దక్కించుకుంటున్నారు. రాలిన చింతకాయను ఒలిచి, ఇంత ఉప్పువేసి, బండపై కచ్చపచ్చగా దంచి, ఒక పుల్లకు గోలికాయలా అంటించుకొని, ఐస్‌ఫ్రూట్‌లా నాకుతూ, చప్పరిస్తూ చీకుతున్నారు.

పిల్లలను గమనిస్తూ, వాళ్ల ఆకలిని దృష్టిలో పెట్టుకొని దేవుబాయి జంగుతో అంది.

"చాక్‌తరస్‌కు నువ్వు పోరాదు. అడివిల గింత ఏమన్న కాయలు, పండ్లు, గడ్డలన్న తెచ్చుకుంటె తినొచ్చు. లేకుంటే గీ పొల్లగాండ్లు ఉత్తగా ఆకలికి జచ్చిపోతరు"

"చాక్‌తరస్‌కు నేను పోతే, చేన్లగా భూమిల పెరిగిన చెట్లు, పుట్టలు, తుమ్మలు కొరండ్లు ఎవరు కొడ్తరు" అన్నాడు. అయినా జంగుకు చాక్‌తరస్‌కు పోవడం ఇష్టముండదు.

అంత దూరం అడవిల పడిపోతే, ఒకొక్కసారి తాగటానికి నీళ్లు కూడా ఉండవ్. వెంట తెచ్చుకున్న నీళ్లు అయిపోతే, ప్రాణం ఉంటదా? పోతదా? అనిపిస్తుంది. అలాంటప్పుడు, తునికి చెట్టు కొట్టుడుమీద దృష్టిపోయి, ఎక్కడ నీళ్లున్నాయి, త్రాగుదాం. ప్రాణం నిలుపుకుందాం అనిపిస్తుంది. తలోదిక్కు కొమ్మ కొట్టుకుంటూపోతే, వచ్చిన తోటివాళ్లను కలవటానికి ఒక్కసారి దారి తప్పాల్సివస్తుంది. ఆ అడవిలో ఈ ఎండాకాలం ఎక్కడా దారి కనిపించదు. అంతటా ఎండుటాకులు. ఎటు చూసినా ఒక్కలాగే వుంటుంది. వచ్చిన దారి బాగా గుర్తు పెట్టుకొని వెనక్కు రావాలి. దారి తప్పితే పిచ్చెక్కినట్లుంటుంది.

ఒకవైపు పొద్దు కుంకుతుంటే, అలా దారి తప్పిన వారి సంగతి, ఆ పెద్ద దేవుడికే

ఎరుక, వాళ్లు మల్లా ఎట్ల ఇల్లు చేరేది.

చాక్‌తరస్ పోకుండా చేన్ల చెట్టూ, పుట్టా కొడ్తానంటే దేవుబాయికి కోపం ఇంతెత్తున లేచింది.

"ఆ చేన్ల చెట్టూ పుట్టా కొట్టి, పండించింది ఎన్నడన్న మన కంచంల కస్తదా? కడదాకా ఆ పండింది షావుకార్ల పొట్టలు కట్టుడుకేగాని మన తండ్రులు చేసిన బాకీలకు బాకీ తీరదు. మనము ఇగ ఈ బాకీలనే పెరిగి, దీంట్లోనే సచ్చి, మన పిల్లలకు కూడా ఈ బాకీలనే మిగిలిస్తం. పండిన పంట నడమంత్రమై పోవట్టే. ఈ భూమికి మనమీద దయలేదు. ఆ పెర్సపెనుక్కూడా, మనమంటే ప్రేమలే కుండా వాయే. ఒక ఏడు వానెల్లక పంటలు పోతే, మల్ల ఏడు ఆనలు పడి పడీ ముంచిపో యె. ఇంగ మిగిలిందేది. గా మన్ను పెల్లలే గద. తింతందుకు గింత బుక్కెడు బువ్వలేక పాయె. కడతందుకు సరిగ మూరెడు బట్టలేక పాయె. అసుంటప్పుడు ఆ భూమ్మీద నీకెందుకంత ప్రేమ"

"భూమిని నమ్ముకున్న మనిషి చెడిపోడె పిసదానా''

"ఏంది? మల్లా అను ఆమాట, భూమిని నమ్ముకున్న మనిషి సెడిపోడా. మంచిగున్న గొండొన్ని సూపు నాకు. భూమిని నమ్ముకొని, కాయకష్టం చేసి, పరులకు దోసి పెట్టుడే మనకు తెలుసు.

అడివిన్నమ్ముకొని బ్రతికినం అను ఇను కుంట. కాని భూమిన్నమ్ముకొని గొండోడు బతకడు. బతికినా ఆని భూమి ఆనికుండనీ యరు. అంతెందుకు మంచిగా పొట్ట బట్ట వుండి, ఇల్లుమీద ఇల్లుగట్టి, యింకో నాలుగు భూములు గొన్న, ఒక్క గొండోని పేరు, ఒక్క కొలామోని పేరు చెప్పు చూస్త''

జంగు జవాబు లేక ఊరకుండిపోయాడు.

"కాలంమారిందే. మనకు గీ భూమ్మీద మమకారం ఒద్దు. ఏదో ఒకటి చేసుకొని. బతుకుదాం. రెక్కల కష్టంమీద. భూమిని నమ్ముకుంటే, మనకేమీ ఉండది. కడుపుల తిండి ఉండది. పెయిమీద బట్టుండదు. కాని సేట్లు, సావుకార్లు దగ్గర బాకీ ఉంటుంది. ఇంకా ఇట్లనే నాలుగేండ్లు పోతే ఆ బాకీ ఉండది. భూమీ ఉండదు'' అంటూ ఆపుకొన్న దుఃఖాన్ని దిగమింగుకోలేక, ఒక్కసారి పెల్లుబికిన దుఃఖంతో...

"ఒక్కసారి నిన్ను నువ్ సూసుకో. ఏడాది నీ కష్టం ఎటుపోయింది, సూసుకో. మన యింట్లో ఏమున్నదీ, లేందీ సూసుకో నేడు భూమంటవ్. రేపు యిత్తనాలంటవ్, ఎరువు లంటవ్, మందులంటవ్, బాకీజ్జేస్తవ్, వడ్డీలకు దెస్తవ్. అది పండుతదో, ఎండుతదో? పండినా అదీ ఆ బాకీలకు, వడ్డీలకే పోతది. ఈ గుడిసెల ఎన్నడూ, మానెడు గింజలుండయి. మన సేతుల పిడికెడు రూపాయలుండవ్. ఎందుకివన్ని. నా మాటిను. నామీద లేకున్న, గా పొరగాండ్ల మొగం జూసైనా, మనం యింకేపనన్నా చేసుకుందాం, ఏమంటవ్''

జంగుకు దేవు చెప్పిన ఏమాటా కాదనేలా లేదు.

ఎందుకిలా జరుగుతోంది. ఎంతో పండుతుంది. కాని అంతా బాకీకిందా, వడ్డీ కిందా పోతుంది. ఈ యేడిలా జరిగింది. వచ్చేడు చూద్దాం అంటే, మల్లా అదే తంతు. భూమి కష్టం ఒకవైపు, బాకీ, వడ్డీ ఒకవైపు సరిసమానంగా ఉంటాయి. ఉండీ, ఉండీ రోగం నొప్పి వస్తే, బాకీ, వడ్డీ పెరుగుతుంది. అలా పెరిగి పెరిగి ఉన్న పెద్దెనిమిది ఎకరాలు, ఎనిమిదికి దిగింది.

దేవుబాయివైపు చూస్తూ, ఆలోచిస్తున్నాడు జంగు.

పదేళ్ళక్రితం ఎలా ఉండే మనిషి ఎలా అయింది? ఆ రోజుల్లో నిండుగా, ఎటు చూసినా, కండపట్టి, రాచ గుమ్మడి కాయలా నిండుగా ఉండేది. కాళ్ళకు కడియాలు, చేతికి కడియాలు, నడుముకు ఒడ్డాణం, ధండలకు దండ కడియాలు, చెవులకు బింగిరీలతో, గుండెలపైనుండి బిగించిన అడ్డపైటతో,




ఎంతో నిండుగా ఉండేది.

నేడు ఆ అందం లేదు. తన దరిద్రంతో, అప్పులతో, అటు భూమిని, ఇటు తన ప్రాణానికి ప్రాణమైన దేవుని కరిగించాడు. ఎలాంటి మనిషి ఎలా అయిపోయింది.

అయినా, ఆ కళ్ళలో తనపై వెలుగు తగ్గలేదు.

ఆ మనసులో తన పట్ల ఆపేక్ష యింకిపోలేదు.

ఏమనుకున్నాడో ఏమో, చాక్ తరస్‌కు పోవాలనే నిశ్చయించుకున్నాడు. అదేమాట దేవుతో అన్నాడు. చూరులో చెక్కిన, పెద్ద గొడ్డలి తీస్తూ.

దేవుబాయి కళ్ళలో వెలుగు రెండింతలయింది. జంగుమీద ప్రేమ ఆరింతలయింది.

★ ★ ★

అందరితోపాటు చెట్టు కొట్టుడుకు బయలుదేరాడు జంగు. వచ్చేప్పుడు ఏకాయో, కసరో తెమ్మంది దేవు. చెట్టు కొడుతున్న జంగుకు, ఎక్కడా దేవుబాయి చెప్పినట్టు ఏ కాయ, ఏ పండు కనిపించలేదు. రాత్రికి తినటానికి లేదు. పిల్లలూ,తను ఉపవాసం ఉండాలి.ఉపవాసం ఉండడం తమకేమీ కొత్తకాదు. కాని ఆ ఉపవాసం ఉండే శక్తి కూడా, రోజురోజుకీ సన్నగిల్లుతోంది. పిల్లలు ఆకలికి తట్టుకోలేక పోతున్నారు. అందరి కడుపులో ఒకటే మంట... ఆకలి.

మెలికలు తిరిగిపోతున్న ఆకలి.

తునికి చెట్ల కొమ్మలు నరుకుతుంటే, దెబ్బ దెబ్బకు శక్తి సన్నగిల్లుతోంది. దెబ్బ దెబ్బకు బలం తగ్గిపోతోంది. పని ఎదగడం లేదు. పని చేయడం కాదు, గొడ్డలి బరువు ఎత్తడమే కష్టంగా ఉంది జంగుకు. అయినా తప్పదు అనుకుంటూ మొండిగా, కష్టంగా కొమ్మలు నరుకుతున్నాడు.

ఎటు చూసినా, అడవి అడవంతా వందల సంఖ్యలో, గొడ్డళ్ళు తునికి చెట్టు కొమ్మల్ని నరుకుతున్నాయి. గొడ్డళ్ళ చప్పుడుతో అడవి మారుమోగి పోతోంది. ఈ నరికిన కొమ్మలు, రేపు చిగిర్చి, కొత్త చిగుళ్ళతో ఎర్రటి ఆకులతో మొలకెత్తి పచ్చబడి, పెరిగి కొమ్మలు, రెమ్మలుగా విస్తరిస్తాయి. అప్పుడు కావలిసినంత లేత తునికాకు. నేడు ఎంత కొమ్మ కొడితే, రేపు అంత లేత తునికాకు దొరుకుతుందని గిరిజనుల ఆశ.

అన్ని గూడాల్లో ఆకలి సంక్షోభమే!

అందరూ కడుపు నిండా తిని, ఎన్నాళ్ళయిందో.

ఎవరి చేతుల్లో కూడా సత్తువ లేదు. సత్తువ లేకున్నా, నేడు ఈ 'చాక్ తరస్' చేస్తే రేపోమాపో పైసలొస్తే ఆ పైసలతో కలో-గంజో తాగి ప్రాణాలు నిలుపుకుందామని ఆశ. ఆ ఆశతోనే అందరూ గొడ్డళ్ళు పట్టుకొని, ఎగబడి తునికి కొమ్మలు నరుకుతున్నారు.

పని చురుకుగా సాగకపోవడం గమనించిన ఫారెస్ట్‌గార్డ్, మధ్య మధ్యన బెదిరిస్తున్నాడు. "కానీయండి! కానీయండి! గదేం నరుకుడు. ఆడ పోరగాండ్ల తీరు. జర చేయి జపజప ఆడించుండ్లి. ఎకరాలకు ఎకరాలు అడవి నరికి, అడవిని నాశనం జేస్తిరి గదరా! ఇప్పుడు గీ చాక్ తరస్‌కు తునికి చెట్లు నరకమంటే, పెండ్లి నడక నేర్వవడ్తిరేందిరా"

"పనిజేస్తం సార్! ఇయ్యాల కూలి ఈ పూటే యిప్పించుండ్లి. ఆ పైసల్తోని గింత ఏమన్న తిని, రేపు పన్లకస్తమంటే, పైసలియ్యతందుకు గింజుకుంటిరి. మేమంతా కడుపు నిండ తిని, ఎన్నొద్దులయిందో నీకు తెల్వదు"

"మన కడుపు సంగతి ఆల్లకెందుకు? ఆకలి అంటే ఆల్లకేం ఎరుక. ఆల్ల ఖానూన్‌లు, ఖాయిదాలె మనని గీ దిక్కులేని బతుకులకు దెచ్చినయి'' అన్నాడు ఆకలితో చికాకుగా ఉన్న పడుచు కినాక భీము.

"ఏందిరా... ఇష్టమొచ్చినట్టు మాట్లాడుతున్నవ్. కండ్లు నెత్తికెక్కినయా!" అని కళ్ళింత చేసుకొని బెదిరించి మళ్ళీ తనే,

"ఆ! మీకు ఆకలైతే నాకేం. మీరు ఏ గంగల పడితే నాకేం. పని గావాల నాకు పని. అంతే. పని జెయ్యండ్లి. పైసలు తీస్కోండి. మీ అవ్వ. మాటలొద్దు''

"పనే జేస్తున్నం కన్పిస్తలేద. మల్లగా తిట్లెందుకు'' అన్నాడు అత్రం రాము.

"అరే రాము... ఆయనతోని, మనకు మాటలెందుకు? ముందు మన పని జూడు'' అని శాంతపర్చబోయాడు జంగు.

"మాట మాటకు జవాబిస్తరా. కొట్టుకొండ్లి చెట్లు. చేసుకోండ్లి, చాక్ తరస్ నేను పోతున్న. మల్లవస్త. అప్పుడే పైసలిచ్చేది. మీకు చేతనైన కాడ చెప్పుకొండ్లి, పొండ్లి. లమ్డికొడుకులు మాటలు నేర్చిండ్లురా, మాటకు మాటిస్తార్రా. అడివిమీద పడి తిని బతికే ముండకొడుకులు, మీరు నాకు జవాబు జెప్తరా! అదీ! ఫారెస్ట్ గార్డ్‌కు. మీ అమ్మ! మీ అంతుజూస్త బిడ్డ. ఎంత దూరం పోతారు''

"పో! పో! నీతోని అయింది జేసుకో. ఎక్కు 'ఫట్‌ఫట్', ఉర్కు యిక్కడ్నించి. మా పని మాకు జేసుకోనీ. మాకు తిక్క పుట్టిందో, నీ అమ్మ చాక్‌తరస్ కాదు, ఈ అడవినంత నరికి కుప్పబెట్టం. మా సంగతి నీ కెరికే గదా!" అని, కొడిమెత సోము అంటుండగానే, ఫారెస్టు గార్డు, కోపంతో మోటారుసైకిల్ కిక్కు గొట్టి, దుమ్మురేపుకుంటూ వెళ్ళిపోయాడు. సోము అన్న మాటలు, మోటారు సైకిల్ మోతకు, ఫారెస్ట్‌గార్డ్‌కు వినిపించలేదు.

ఆ ఫారెస్ట్‌గార్డ్ మహా తిక్కసన్నాసి. పని చేసినా పైసలిచ్చే రకం కాదు. ఇచ్చినా, కాలికంటే మెడకు, మెడకంటే కాలికేసే రకం.

ఇప్పుడీ గొడవ జరిగాక, యిప్పట్లో ఈ నాలుగురోజుల చాక్ తరస్ డబ్బులు వస్తాయన్న నమ్మకం కూడా లేదు.

గొడ్డళ్ళు నడుస్తూనే ఉన్నాయి. కొమ్మలు తెగిపడుతూనే ఉన్నాయి. కాని కాలం మెల్లగా కదులుతోంది. కష్టకాలంలో కాలం కూడా పగబట్టి స్తంబించి పోతుందేమో అన్నట్లు.

అడవిలో గొడ్డండ్ల చప్పుడు ఠక్ ఠక్ ఖట్ అని వినిపిస్తోంది. అడవి నరుకుడు గొండోనికి కొత్తపనేమీ కాదు. చేతుల గొడ్డండ్లు, చెట్లను చాక్ తరస్ చేస్తున్నా. మనసులు ఎక్కెటో ఆలోచనల్లో ఉన్నాయి.

ఒకవైపు యీ చాక్‌తరస్ నడుస్తుంటే, మరోవైపు జంగ్లాత్ మనుషులు ఎండుటాకులను, పొదలను, గడ్డిని ప్రూడింగ్ చేయిస్తున్నారు.

అడవి దట్టంగా ఉండే రోజుల్లో, ఎండ వేడిమికి ఎండిన చెట్ల కొమ్మలు రాసుకొని, రాపిడికే నిప్పుపుట్టి, ప్రకృతి సహజంగానే యీ ప్రూడింగ్ జరిగేది. దాన్ని చూసిన వాళ్ళు అడవిల ఎలగడి పడిందనేవాళ్ళు. ఇలా అంటుకున్న మంట, ఒక్కోసారి వారం పది రోజుల వరకు ఆరకుండా అలా పాక్కుంటూ, కాలుకుంటూ పోతుంది.

ఒకవూపు కడుపుల ఆకలి.

మరో దిక్కు దాహం.

పైనుండి యీ అడవి మంటలతో

చెట్టుకొడ్తూ చాక్ తరస్ చేసేవాళ్ళకు, ఒళ్ళంతా చిటపట లాడ్తూ, మహా చీకాకుగా వుంది.

చెట్టు కొడ్తుంటే చెట్టు కదిలి, చెట్ల కొమ్మల్లో, కొండలలో నేలపై ఉన్న గండు చీమలు, ఎర్రచీమలు, కోగులు బిలబిలమంటూ చెట్టంతా పాకుతుంటే, చెట్టుపైనే ఉండి, వాటి నుండి తప్పించుకోవడం, మహాకష్టంగా ఉంటుంది.

ఎంత జాగ్రత్తగా, ఉన్నా, కొడిమెత సోముకు, ఒళ్ళంతా కోగులు పాకనే పాకాయి. పాకిన కోగులు, ఎక్కడ పడితే అక్కడ కుడుతున్నాయి.

"సన్నినో అవ్వాల్" అంటూ సోము పెట్టిన





కేకకు, చుట్టుపక్కల వున్న మేస్రం జంగు, యింకా మిగతా మంది,

"ఏమాయె! ఏమాయె!" అంటూ, తమ చెట్టు కొట్టుడాపి, కొడిమెత సోము వున్న చెట్టు దగ్గరికి వచ్చి, చూస్తే ఏముంది? సోము ఒంటినిండా కోగులే.

చెట్టుకు అంత పెద్ద తొర్ర ఎక్కడున్నదో! పుట్ట పగిలి ఎల్లినట్లు, చెట్టంతా పాకుతు న్నాయి.

నోట్లో, ముక్కులో, చెవిలో ఎటుపడితే అటు పాకుతుంటే, ఎటు కదలాలో, ఏం చేయాలో అర్థంకావడంలేదు సోముకు.ఒకటే కేకలు,అరుపులు. చూస్తున్న జంగు 'అంత మీదికెల్లి, పోరడెక్కడ కిందపడ్తడో' అని వెనకాముందూ చూడకుండా గబగబ, వే గంగా చెట్టెక్కి, చేతిలో ఉన్న తుండుగుడ్డతో సోము ఒళ్ళంతా, ఒక్క ఉదుటున దులిపి, వచ్చినంత వేగంగా సోముతోపాటు కిందికొ చ్చాడు.

ఈ లోపల చాలా కోగులు జంగును కూడా కాటేసాయి.

సోము ఒళ్ళంతా కాసేపట్ల చూస్తుండగానే బురబుర పొంగుకొచ్చింది.

"జంగు సూసుడు మంచిగయింది. చెట్టె క్కి పోరన్ని కిందికి దెచ్చిండు. లేకుంటే, పోరడు అంతమీదికెల్లి పడితే, గుక్కెడు నీళ్ళ డగకపోవు''

"అవేమన్న చిన్న జాతి చీమల! పెద్దపెద్ద పాములనే ఒక యించు కదలనీయవు. చుట్టు ముట్టినయంటె.

"ఇయ్యాల పోరడు లేసినయాల్ల మంచిది. అందుకే సల్లంగున్నడు''

"ఈ అడివిని కాలుపెట్టిన మంటే, ఇంటి కి పొయ్యేదాంక మనిషిది భరోసలేదు. చీమల పడి సావచ్చు. పాముకు సావచ్చు. పులిదెబ్బకి సావచ్చు. ఏదో నాలుగు రూపా లస్తయిప్పి, రాకడగాని, యిదేం సుకం పనా! చాక్ తరస్ అంటేనే బుగులైతది''

"మంచి అక్కర గాలం చూసి అస్తది యీ చాక్ తరస్. నీ తల్లిదియ్య. ఎండలు గొట్టే కాలం, నీళ్ళు దొరకని కాలం, కడుపుల ఎంతేసిన, అరిగిపొయ్యే కాలంల అస్తది. ఇదే కొమ్మగొట్టుడు సలికాలం చెయ్యమను. నీ అవ్వ సిడిమెట్ల జంగల్ సాఫ్ అయిపోవాల. ఆ కాలం అట్లుంది. ఈ కాలం మనిషికి సాత్ యిచ్చేధి గాదు'' అన్నాడు జంగు.

ఒక్కో మనిషి. ఒక్కో మాట అంటూనే, ఒకరు సోము ఒళ్ళంతాదులిపితే, యింకొకరు. ఏదో చెట్టు పసరు అరిచేతుల్లో పిండి, ఒళ్ళంతా పులిమారు.

సోము మంటతో తల్లిడిల్లిపోతున్నాడు.

సోము అవస్థ జూసి, జంగు ఆదుర్దాపడ్డా డు. అదే విషయం మనసులో ఉంచుకోలేక, పోరనికి ఏంగాదు గదా!" అన్నాడు.

"ఏం గాదు. మనకు మన ఎర్రచీమలు నాలుగు కుడితేనే మనుసుకు చైన్ వట్టదు. ఇవైతే అడవి చీమలు, కోగులు, అన్ని గానం కుట్టినయ్ గద. మంట ఉంటది. ఏంగాదు. గంట రెండు గంటల్ల. ఆరామ్ అయితది. పోరగాడ్ని గిట్ల చెట్టునీడకు పండవెట్టుండ్లి. యింక దొరికితే గింతంత దోసతీగ ఆకు దూసుకురండ్లి. పసరు తీసి రాస్తే సల్లంగుంటది'' అంటూ తోలుబుంగలోంచి, యిన్ని నీళ్ళు తీసి, కొన్ని తాపి, ఒక బట్టను నీళ్ళలో తడిపి, గాలిల జాడించి, సోము ఒంటిపైన కప్పి, గాలి విసరసాగాడు. కినాక బాలుతాత.

చల్లటి గాలి తగిలి సోము ప్రాణానికి హాయి అనిపించింది.

"ఇప్పుడు నేను జేసినట్టు ఒకటి, రెండుసా ర్ల జెయ్యుండ్లి. సల్లటి గాలి తగిలి మంటలు తగ్గుతయి'' అని చెప్పాడు కినాక బాలుతాత.

గుంపుకు గుంపు అందరి పని కాసేపు వదిలిపెట్టి కూర్చునే సరికి, అక్కడే ఫ్రూడింగ్ చేస్తున్న ఫారెస్టు మనుషులు, లేవుండ్లి, లే వుండ్లి మల్ల మా సార్ అస్తే మంచిగుండదు.

ఇప్పుడు మీ ముందే కోపం జేసుకుంటపా యె. మా సార్ యీ అడీలనే యింకో దిక్కువోయిండు. ఇటుదిక్కునుంచి 'చాక్ తరస్' సప్పుడు రాకుంటే, దూరం కెల్లె గుర్తువడ్తడు. మల్ల మిమ్ములను అంటడు. మమ్ముల్ని కూడా మాట అంటడు'' అని అన్నాడు.

ఎవరూ ఏమీ మాట్లాడలేదు. మళ్ళీ ఎవరి గొడ్డళ్ళు వాళ్ళు చేతపట్టి, కొమ్మ కొట్టుడు మొదలుపెట్టారు.

కినాక బాలుతాత సోము పక్కనే కూర్చు న్నాడు.

మేస్రం జంగు, దూసతీగ ఆకుకోసం వెతు కుతున్నాడు.

★ ★ ★

చాక్ తరస్ అయిపోయింది. చాక్ తరస్‌తో వచ్చిన పైసలు కూడా అయిపో యాయి. వారం రోజుల కూలి డబ్బులు, అదీ కేవలం మగవాళ్ళు మాత్రమే చేసి తెచ్చే, వారం రోజుల కూలి పైసలు వారం రోజుల్లో అయిపోయాయి.

చాక్ తరస్ చేసిన తునికాకు కొమ్మలు మెల్లగా చిగురుస్తున్నాయి. మొదట పిచ్చుక నోళ్ళలా విచుకున్న చిగుర్లు మెల్లగా రంగు మారి, పచ్చబడుతున్నాయి. అనాది కాలం నుంచి చాక్ తరస్ డబ్బులు, తునికాకు డబ్బులు గిరిజనుల జీవితాల్లో, బోనస్ వంటిది. ఈ ప్రోత్సాహకాలు ఏడాదికి రెండుసార్లు మాత్రమే.

ప్రభుత్వం సారాకోసం ఇప్పపువ్వు కొ నడం మొదలుపెట్టాక, ఎండాకాలంలో రాలి పడే యిప్పపువ్వు, గిరిజన జీవితాల్లో మూ డవ ప్రోత్సాహకమయింది.

చిగిర్చిన ఆకులు పది పదిహేను రోజుల్లో, నవనవలాడుతూ ఎదుగు తున్నాయి. ఇంటిల్ల పాది తునికాకు ఏరటానికి అవసరమయ్యే పాత గోనె పట్టాలను, సంచులను పోతం చేస్తోంది దేవుబాయి. జంగు సగం కోసిన బీరకాయ డిప్పతో, ఎడ్ల ఒంటిపై శుభ్రంగా దువ్వుతున్నాడు.

"ఇయ్యాల్లనో, రేపో తునికాకు తెంపుడు షురవుతదేమో'' అన్నాడు జంగు.

అవిటితనంలో ఆ యింట్లో ఒక్క దేవు బాయి తప్ప మిగతా వాళ్ళంతా తునికాకు తెంపటానికి వెళతారు.

"ఈ యేడు సర్కారోండ్లు చాక్ తరస్‌యా ల్లమీద జేసిండ్లు. ఆకు మంచిగ ఎదిగి ఉంటది. పైసలు కూడా బగ్గనే వస్తయి'' అంది దేవుబాయి.

"చాక్ తరస్'' టైంకు చేస్తే ఏమాయె. రేపు టయింకు ఆకు తెంపుడు సురుజెయ్యాల, అయితే జోర్‌దార్ ఆకు చేతికస్తది'' అన్నాడు జంగు. ఎడ్లపైనుండి రాలిన వెంట్రుకలను. చేత్తోనే దులిపేస్తూ.

"సురుజేస్తరు. ఎందుకు చెయ్యరు. మంచి ఆకు తెంపిచ్చుకోవాలని బీడీ కంపనొల్లకుండ దా, జంగ్లా తోల్లకుండదా?"

"అందరి కుంటది. నీ కుంటది. నా కుంటది. గాని రేటు పక్కగావాల గద. అదయ్యేదాంక, ఆకు ముదరకుంట ఉంట దా?"

"నిరుడిచ్చిందే యియ్యేడిస్తే పాయే. కా దంటే ఒకటి రెండు పైసలు ఎక్కువిస్తరు గంతె గద"

"నిరుడు ముప్పయి ఐదు పైసలిచ్చిండు వంద కట్టకు. ఇయ్యేడు యాభయి పైసలకు తక్కువ లేదంటున్నరు మంది'' అన్నాడు జంగు అక్కడ- ఇక్కడ విన్న మాటను చెప్తూ.

"యాభయి పైసలంటే మంచిగనే ఉంటది. రెండాకులు తెంపగానే ఒక పైస తెంపి, సంచి లేసినట్టుంటది. కాని ఇస్తరా అని'' అంటూ అనుమానం వ్యక్తం చేసింది దేవు.

"సూడాల... అక్కరగాల్ల. పైస పది పైస లకు జూసుకుంటే మల్ల యిదే ఆకు ఎందుకు





పనికిరాదు. మల్ల చాక్ తరస్‌కు సర్కార్ పెట్టిన పైసలు కూడా నీళ్లల్ల పోసినట్లయిత యే. సుడాల ఏం జేస్తరో. అయినా ఇది యాటా ఉండే తంతేగదా!"

"అవు మరి. దుకానంల మీ బాడీల ధరలు పెరిగినట్టు, గీడ గీ ఆకు ధర పెర్గదా ఏంది''

"ఒసినీ... నేనేమన్న కాదంటినా ఏంది. పెరగని. పెరిగితే మనకే మంచిది గద" అంటూ ఎడ్లను చేత్తోనే గట్టిగా మాలీష్ చేయ సాగాడు. ఎడ్లు నున్నగా నిగనిగ మెరవసా గాయి.

మేస్త్రం జంగు అనుమానం నిజమ యింది.

తునికాకు తెంపటానికి యీ యేడు వంద ఆకులకట్టకు రూపాయి ఇయ్యాలని అన్నలు కరపత్రం వేసి, డిమాండు చేశారు. అనుకున్న రేటుకు ఒప్పుకునేవరకు ఎవరూ చెట్టుమీద చేయివేయవద్దని మరీ చెప్పి వెళ్ళారు.

ఒకవైపు డబ్బుల అవసరం. యింకోవైపు అన్నల డిమాండు. ఏడాదికి ఒకసారి వచ్చే స్వాతి వానజల్లు వంటిది యీ తునికాకు సీజన్. స్వాతి వాన ముత్యపుచిప్పలో పడితే నే. ముత్యమవుతుంది. లేకపోతే అది ఉట్టి నీటిచుక్కే. అలాగే యీ తునికాకు చాక్‌తరస్ చేసి యిప్పుడు తెంపుకుంటేనే బీడిఆకు, లేకుంటే ఉత్త ఆకు.

కంట్రాక్టర్లకు, కల్లేదార్లకు, ఫారెస్ట్ వాళ్లకు ఎటూ పాలుపోవడంలేదు. ఒక్కసారే ఆకుకు ఒక పైసా యివ్వాలంటే ఎవరి మనసు ఒప్పుకోవడంలేదు.

"ఆకుకు ఒక పైసా యిస్తే యిక మనకేం మిగుల్తది?" అంటున్నారు అందరూ. అందరి కీ కావాల్సినంత మిగులుతుంది. కాని ఎక్కువ మిగలాల్సింది కాస్త తక్కువయి మిగుల్తుంది. అయినా ఆమాత్రం దానికి ఎవ రూ యిష్టపడడంలేదు.

"చూస్తుండగానే తునికాకు తెంపుడుకొ చ్చె. ఈ అన్నలు ఏ సంగతి ఎటూ తేల్చరు. ఈ యేడు పంటలు ఎటూ లేవు. కనీసం గీ ఆకుపైసలన్న చేతకస్తయిలే అంటే నడిమిట్ల ఈల్లొకల్లు. ఎటూ తెగనియ్యరు. సాగనియ్యా రు. యింతకైతేగాని తెంపుతం లేకుంటే లే దని ఎవల్లన్న అన్నరా. మల్ల అసుంటప్పుడు గీల్లకెందుకు మధ్యల గిదంత" అంది దేవు బాయి విసుగ్గా.

జంగు ఏమీ మాట్లాడలేదు.

"అయిందాట్ల, కానిదాంట్ల మధ్యన యీ ల్లు జొరబడుడెందుకో! మందికి పైసలు ఎంత అక్కరకున్నాయో యీల్లకేం ఎరుక? ఒక మాటనుడు. ఊరుకుండుడు. నడిమిట్ల మన నోటికాడ కచ్చిన కూడు మట్టిపాలయి తది'' దేవు గొంతులో విసుగు, రోజటి బతుకు పట్ల కోపం కనిపిస్తున్నాయి. ఆకలి, దరిద్రం ఆమెను అలా మాట్లాడిస్తున్నాయి.

మగవాడి లోకం వేరు. ఆడదాని లోకం వేరు. ఉదయం లేవగానే పొయ్యికింద ఏమి పెట్టాలె, పొయ్యిమీద ఏమి పెట్టాలె, పిల్లల కేం పెట్టాలె, మగడికేం పెట్టాలె అని ఆలో చించేది ఆడదే. అందుకే అన్నలయినా వారి మీద ఆమెకంత విసుగు, కోపం ఏర్పడ్డాయి.

"మనమిట్ల చూసుకుంటనే ఉంటమ్. ఆ లంబడోల్లు, మరఠోల్లు దొంగసాటున ఆకు తెంపుకొని దొంగసాటున ఇండ్లల్ల అమ్ముకోవ ట్టిరి. నిన్న నా కండ్లతోనె జూస్తి. మన ఊరిపక్క కెల్లే యింతింత తునికాకు తెంపు కొని ముల్లెలు గట్టుకొని పోవట్టిరి. పానాలమీ దికి రాంగ, పానాలకు తెగిచ్చి, చాక్‌తరస్ చేసుడు మన అంతు. ఆయితంగ ఆకు కోసుడు యీ లంబడోళ్ల అంతు'' అంటూ కోపంగా సణగసాగింది దేవు.

దేవు చెప్పిన మాట కూడా నిజమే. జంగు కూడా ఈ మాట చాలాచోట్ల విన్నాడు. అన్నల మాటకు కట్టుబడి గిరిజనులంతా ఆకు తెంప కుండ, రేటు సంగతి తేలేవరకు చూద్దాం అని అనుకుంటుంటే, వాళ్లేమో దొంగచాటుగా ఆకు తెంపి దొంగచాటుగా ఇండ్లల్లో అమ్ము

కుంటున్నారని.

"అవ్ నేను కూడా యిన్న ఈ మాట. దొంగతనంగ మరాఠోల్లు, లంబడోల్లు ఆకు తెంపుతున్నరని''

"ఆల్లు యియ్యాల్ల కొత్తగనా ఏందీ? అన్నిట్ల మనకు ఆల్లె అడ్డం. అక్కడెక్కడికెల్లో యిటుదిక్కు అచ్చి ఆల్ల తెల్వితోటి మనండ్ల గలిసిరి. ఆల్లని మనని సమానమనే గీ సర్కారు. ఆల్ల తెలివి ఎక్కడ, మన మంది తెలివి ఎక్కడ? ఎక్కణ్ణో పుట్టి, ఆల్ల గొడ్డు గోదకోసం అడవికి దగ్గరున్నోల్లు ఆల్లు. అడవిల పుట్టి అడవిల పెర్గినోల్లం మనం. ఆల్లకు మనకు పొంతనేంది?

ఆల్ల తెలివి, ఆల్ల మాట, ఆల్ల తీరెట్ల, మనమెట్ల? సర్కారు మనకు ఏం జేస్తమన్న ముందు ఆల్లె పోకడ, ఆల్లె తెచ్చుకొనుడు. అందుకేగా ఐ.టి.డి.ఎ. పెట్టినప్పట్నించి ఆల్లెట్లయిండ్లు. మనమెట్ల ఉన్నం. ఎక్కడేసిన గొంగడి అక్కడే అన్నట్లున్నం"

కానూన్ ఖాయిదాల మాటచ్చినపుడు జంగుకన్న దేవుబాయే రెండాకులు ఎక్కువ చదివినట్లనిపిస్తుంది.

ఇటు తునికాకు రేటు ఎటూ తేలడంలేదు. ఎప్పుడు రేటు నిర్ణయించబడి ఆకు తెంపుదామా అని వీళ్లు యిటు యిలా నిరీక్షణలోనే వున్నారు. అటు నాణ్యమైన ఆకు దొంగదారిన ఫారెస్టు అధికారుల అండతో కల్లేదార్లను చేరతనేవుంది.

ఇక్కడ హక్కులకోసం పోట్లాడేది, సంఘర్షించేది గిరిజనులు. లాభపడేది లంబాడీలు, మరాఠీలు, ఇతర వెనుకబడినవాళ్లు.

ఆఖరున పదిరోజుల తర్వాత వంద తునికాకుల కట్ట అరవై పైసలుగా రేటు నిర్ణయించబడింది.

ఆకు తేవటానికి గోనెపట్టాలు, సంచులు, పాత గుడ్డలు అన్నీ చూసి పెడుతుంది దేవుబాయి.

"చాక్‌తరస్ అప్పుడే ఎండలు అగ్గితీరుండె. ఇప్పుడైతే యింక ఎక్కువయినయి. పొద్దుగాల్ల అడివికి పోతే ఆకు తెంపుకొని మల్లా గింత పొద్దెక్కక ముందే ఊల్లె పడచ్చు. రాత్రే యింత ఏదన్న ఎక్కువండు. అదే పొద్దుగాల్ల సద్దిగట్టుకొని పోతం" అన్నాడు జంగు. నిరుడు కొడుకు, తనూ ఆకు తెంపుడుకు పోయిన రోజులు గుర్తొచ్చాయి.

'యాట ఆకు తెంపుడుకు, చాక్ తరస్‌కు తుకారాం కూడా వస్తుండె. జీతం దొరికి అక్కడెక్కడనో ఉన్నడు. పంతులయి రెండు వేల జీతం తీస్కుంటోనికి చాక్‌తరసేంది, ఆకుతెంపుడేంది?

అక్కర యాల్లకు పనికస్తడనుకొన్న కొడుకు లగ్గమయిన ఆర్నెల్లు కూడా యింట్ల ఉండలె. మొన్ననే మోటారు సైకిల్ కూడ కొనుక్కున్నడట. ఊరోల్లు ఎక్కడనో చూసి చెప్పిరి. ఇక్కడ తమ్ముడు, చెల్లెలు ఎట్లున్నరో. ఏం తింటున్నరో ఆనికి పట్టకపాయె' మననసులో మాట బయటికే అన్నాడు.

"పిల్లలకు మీసాలొచ్చేదాంకనే అయ్య, అవ్వ. మల్ల అంతా ఉత్తదే. ఎవలికి ఎవలూ కారు. మన రెక్కలే మన కొడుకులు, బిడ్డలు. ఆల్లు ఎక్కడుంటే ఏంది? యాడున్న సుకంగుంటే సాలు. రేపు కష్టమచ్చినపుడు అవ్వా అని పిలుస్తే చాలు'' అంటూ కొడుకు జ్ఞాపకాలతో సతమతమవుతున్న భర్తను ఓదార్చింది దేవు.

తెల్లారి చీకట్లోనే మనిషికొక పేగు, సంచి, ఏది ఉంటే అది తీసుకొని సద్ది కట్టుకొని అల్లిగూడెం వాళ్లంతా అడవిదారి పట్టారు. తెల్లవారకముందే అందరూ అడవికి చేరుకున్నారు.

ఊరికి దగ్గరి శివార్లలో చాక్‌తరస్ చేసిన చెట్లన్నీ ఆకు తెంపి బోసిగా కనిపించాయి. ఆకుకోసం మొదటిరోజే లోపలికి పోక తప్పింది కాదు.

అందరికన్న ఎక్కువ ఆకు జంగు తుంచాడు.






సోము భయంభయంగా తెంపాడు. చెట్ల మీద చీమల భయం యింకా పోలేదు.

కినాకబాలు తాత జంగుతో సమానం ముల్లె ఎత్తాడు. జైతుకు ఎందుకో పని ఎదగక తక్కువే తెంపాడు. కొడిమెత ఇస్రు, జైతు భార్య, మడాలి సుంగు, కొమరం రాము చాలా వెనకబడి పోయారు. ఎవరు ఎంత వెనకబడి తెంపినా పెరిగిన ధరలకు యీ భయి రూపాయలకు తక్కువ విలువ చేసే ఆకు ఎవరూ తుంచలేదు.

ఈ బీడీ ఆకు చెట్లనుంచి తుంచడం పది పదిహేను రోజులు కొనసాగుతుంది. మూడు నాలుగు రోజులు ఆకు తుంచేసరికి దగ్గర దగ్గరలో తునికాకు అంతా అయిపోయింది. అడవి లోపలికి వెళ్లి తునికి చెట్లు వెతుక్కుంటూ మరీ ఆకు తెంపాల్సి వస్తుంది. తునికాకు వేటలో, తునికి చెట్ల వెతుకులాటలో ఎవరిదారి వాళ్లది.

తొలికోడి కూతతోనే అల్లిగూడెం జనం మేల్కొంటారు. ఉన్నదేదో యింత తిని మళ్లీ యింత చద్ది కట్టుకొని ఆదర బాదర అడవిల పడి పోతున్నారు.

అడవిదారిలో కాలి బాటలవెంట ఒకరి వెనుక ఒకరు క్రమశిక్షణతో నడిచే సైనికుల్లా సాగిపోతున్నారు. గిరిజనులు ఎప్పుడు నడిచినా ఒకరి వెనుక యింకొకరు నడుస్తారు. మన బస్తీ జనంలా ఒకరి పక్కన ఒకరు నడవరు. పనిబడి బస్తీకి వచ్చినా విశాలమైన రోడ్లపై కూడా వాళ్లు ఒకరి వెనకాల యింకొకరు నడుస్తారు. గ్రామాల్లో కాలిబాటల్లో నడిచి నడిచి ఏర్పడిన అలవాటది.

అవసరం వచ్చి ఒక్కోసారి గంటలకొద్దీ కాలం మౌనంగా నడుస్తూనే ఉంటారు. ఒకరితో ఒకరు మాట్లాడకపోవడం వాళ్లలోని విశేషం. అనవసరపు ఊసుపోని కబుర్లకు వీళ్లు చాలా దూరం.

స్వభావరీత్యా కొంతవరకు గిరిజనులు

బద్ధకస్తులు. మాట్లాడ్డంలో కూడా అంతే. ఎంత నడిచినా దారి ఎదగడంలేదు. నడక తరగడంలేదు. అందుకని మౌనాన్ని ఛేదిస్తూ జైతు అన్నాడు.

"ఈసారి మన కల్లేదారు మస్తు ఉషారుండు. నిన్న మనం లెక్కపెట్టి కట్టిన కట్టల ఆకులు తక్కువున్నయని, ఉన్న ఆకులు సరిగ లేవని, పురుగు ముట్టిన ఆకు, ముడుత పడ్డ ఆకు, వంకర ఆకు అనుకుంటూ మనందరి దగ్గర మనిషికి మూడు నాలుగు కట్టలు తరుగుపోతయని ఎక్కువనే తీసుకునే"

"అవ్... మాక్కూడ గట్లనే జేసిండు ఆ కల్లేదార్. మనిషికి నాలుగు కట్టలంటే రెండున్నర రూపాలు. యాడికి మనం కట్టకు నాలుగైదు ఆకులు ఎక్కువనే కడ్తున్నం. అయినా ఆల్ల హుషారి ఆల్లది'' అన్నాడు మేస్రం జంగు.

"మల్ల ఏమన్న అంటె లేనిపోని కిరికిరి. ఇప్పుడే కట్టకు అరవై పైసల ధరకోసం వారం పది రోజులు యెనకపడ్తిమి. కొంత ఆకు ముదిరిపాయె. కొంత ఆకు దొంగలపాలయె. అందుకని నోరు మూసుకునుడు'' కొడిమెత ఇస్రు.

"యాడాది పొడుగుతా గిట్ల రోజు ఆకు తెంపుడుంటే మస్తు గుంటది పైసలె పైసలు'' అన్నాడు సోము.

"ఏందిరా కొడుకా! పైసలమీద మస్తు ఆశపడవడ్తివి. ఈ పని వారం పది దినాలు చేస్తేనే మస్తు. యింకో నాలుగు రోజులకు తరాస రాకుంటె అప్పుడు జెప్పు.

వీళ్లు మాటల్లోపడి జపజప నడవసాగిరి. ఆడవాళ్లు, పిల్లలు వాళ్లతోపాటు నడువలేక వెనుకపడుతున్నారు. మళ్లీ ఉరికి అందుకుంటున్నారు.

అప్పటికే పొద్దు యింత పైకి ఎక్కింది. కానీ వాళ్లు యింకా అడవి దారిలపడి నడుస్తూనే ఉన్నారు. ఇంకా ఒక రెండు మైళ్లు పోతేగాని ఆకు దొరకదు.

ఇంత పొద్దెక్కి వేడి చురచుర మంటుంది. ఎవరి బుంగలో వాళ్లు నీళ్లు తెచ్చుకున్నారు. కొంతమంది నీళ్లు దారిలోనే సగమైపోయాయి. మధ్యమధ్యలో ఆగి నీళ్లు తాగుతూ వెనకవడిన సోమును ఉద్దేశించి

"ఏందిరా తాత. అప్పుడే నీళ్లు సగం జేస్తివి. పొద్దుగాల్లనే బెల్లం బూరెలు తిని ఎల్తివా ఏంది. గట్ల నీల్లు గట గట తాగవడ్తివి. దార్లనే బుంగెడు నీల్లయిపోతే అడీల ఏం తాగుతవ్. మల్ల రాంగ ఏం తాగుతవ్. ఇట్ల నీలన్నీ దార్లనే ఖతమ్ చేస్తివో మల్ల నీ నీరుడు నువ్వే తాగవడ్తది. గుర్తుంచుకో'' అని అంటనే ఉన్నడు. అక్కడొకడు యిక్కడొకడు దార్లనే ఆగి తోలు తిత్తుల్లో, సొరకాయ బుంగల్లో, డబ్బాలో తెచ్చుకున్న నీళ్లు తాగుతూ కనిపించారు.

కినాకబాలు తాత ఒక్కక్షణం ఆగి, "అరే గదేం నీళ్లు తాగుడురా! మనం ఎక్కడున్నం అని చూసుకొని తాగుండ్లి. తెచ్చుకున్న నీళ్లు దార్లనే అయిపోతే ఎట్ల.. ఆc... ఎవల్ల నీళ్లు ఆల్లకే సాలయి. యింకోనికి యిచ్చే ముచ్చటనే లేదు. జర చూసుకుంట తాగుండ్లి. మల్ల నడిమిట్ల బార్ ఎండ యాల్లనీళ్లు లేక నీరుడు తాగే గతి తెచ్చుకోకుండ్లి'' అన్నాడు బాలు తాత.

"ఛీ! పాడు! ఎక్కడన్న ఎవల్ల ఉచ్చ ఆల్లు తాగుతరా ఏంది?" అన్నాడు సోము అపహాస్యంగా మొహం పెట్టూ.

"నీవు ఏం జమాన చూసినవ్ బిడ్డ. ఇంకా మూతిమీద మీసం కూడా సరిగ రాలె. నీరుడున్న పొయ్యుండ్లి తాగుత అంటే. తాగిన నీల్లు తాగినట్టే చమట పట్టి పోతుంటే నీరుడు కూడా రాక, యింకోంది దొరకక అట్లనే సచ్చినోల్లను జూసినమ్. తెలిసిందా'' అంటూ బాలుతాత చెపుతుంటే అందరు కళ్లు ఆశ్చర్యంగా పెట్టి వింటున్నారు.

ఎవరి నీళ్ల బుంగలు వాళ్లకు ప్రియంగా కనిపించాయి. అడవిలోకి చేరి ఆకు సగం




తుంచేవరకు ఎవరూ ఒక్క నీటిచుక్క కూడా నోట్లో పోసుకోవద్దని, యింత ప్రియమైన నీళ్లను ప్రియంగానే వాడుకోవాలని నిర్ణయించుకున్నారు.

అప్పటికే నడిచి నడిచి చాలామంది అలిసిపోయారు. మూడు గంటలపైన నడకకే సరిపోయింది. అడవి దారిలో నడక ఏమాత్రం ఎదగదు. దగ్గరే అనిపిస్తుంది. కాని దారి ఎదగదు. ఎంత నడిచినా గమ్యం రాదు. ఎంతో నడిచాక చివరకు అడవిలో తెంపాల్సిన తునికాకు చెట్లు కనిపించడంతో వారి ప్రయాణం ఆగిపోయింది.

అప్పటికే పొద్దు బారెడు పైకెక్కింది. ఎండాకాలం ఎండ చురుక్కుమంటోంది.

గబగబా ఆకు తెంపాలనే ధ్యాసలో చెట్లపై బడ్డారు అందరూ. రెండు చేతుల్లా తునికాకులు టప్ప, టప్ప తుంచుకుంట సంచుల్లో, ఒడిలో వేసుకుంటున్నారు. ఇటువైపు అడవిలో తునికి చెట్లు అంతగా లేవు. ఉన్న చెట్లు దూరం దూరంగా వున్నాయి.

తునికాకు వేటలో ఒక్కొక్కరే విడిపోతున్నారు. ఎవరు ఎటు పోతున్నారో చూసుకోవడంలేదు.

ఎవరి ఆకులపై వారికే ధ్యాస. ఒక చెట్టు ఆకు తెంపడం కాగానే యింకో చెట్టుకోసం వెతుకులాట. చెట్టు దొరికాక చాక్‌తరస్ చేసిన కొమ్మల వెతుకులాట. ఆ కొమ్మలో బీడి చుట్టటానికి పనికివచ్చే ఆకుకోసం పరీక్ష.

అన్నీ సరిగ్గా చూసి కొత్తాకునే తెంపాలి. లేత ముదురాకునే తెంపాలి. మరీ లేతాకును తెంపితే తునికాకు కల్లం ఏరి పడేస్తారు. కట్టకు తక్కువ ధర పెడతారు. పైసల్లో కోత కోస్తారు. అందుకని అన్నీ చూసి తెంపుతున్నారు అందరు.

పచ్చబడ్డ ఆకులన్నీ పట్టపట్ట తెగుతున్నాయి. కొనాకొమ్మల్లో చిగిర్చిన తునికాకులు 'ఇంకా పైకిరా. అయితేనే అందుతాం!' అన్నట్లు కవ్విస్తున్నాయి.

ఎనిమిది పది ఆకుల కొరకు కూడా చెట్టు చివరికంటా ఎక్కి టప్పా టప్పా ఆకులు తెంపుతున్నారు.

చాక్‌తరస్‌లో చిగిర్చిన కొమ్మలు రెమ్మలు పచ్చబడి ఆరోగ్యంగా పెరిగి తునికాకులు టప్పాటప్పా తెగుతూ గిరిజనుల ఒడినిండిపోతున్నాయి. ఇంతకంటే ఆలస్యంగా చిగిర్చిన ఆకులు అలాగే పెరిగి పచ్చబడి, ఎండుబారి రాలిపోతాయి. ఒకటీ అరా విస్తర్లుగా మారి మార్కెట్లోకి వస్తాయి.

గిరిజనుల జీవితాల్లో చాక్‌తరస్ ఒక ఆశ.

సంవత్సరానికి ఒకసారి వసంత రుతువు తోపాటే వచ్చే ఈ చాక్‌తరస్‌కోసం కోయిల మావి చిగుళ్లకోసం ఎదురుచూసినట్లు గిరిజనులు ఎన్నో ఆశలతో ఎదురుచూస్తారు.

ఇంట్లో పెద్దవాళ్లు కొమ్మకొట్టి తెచ్చిన డబ్బులు ఎప్పుడో అయిపోయాయి. ఇక మిగిలింది ఈ తునికాకు డబ్బులే!

తునికాకు డబ్బులతో తొలకరి వానలవరకు ఇంటికి సరిపడా జొన్నలు తెస్తాడు జంగు. వరి అన్నం తిని చాలారోజులయింది. దేవుకి వరి అన్నం అంటే చాలా యిష్టం. పైసలు రాగానే దేవుబాయికోసం వరిబియ్యం కూడా తేవాలనుకున్నాడు.

ముఖాషీల ఇంట్లో పుట్టి పెరిగిన దేవూబాయి చిన్నప్పుడు చాలా గర్వంగా పెరిగింది. ఏరి కోరి తనను చేసుకుంది. కాని తాను దేవుని ఏనాడూ సుఖపెట్టలేదు. ఇంద్రవెల్లి జంగ్‌ల కాలుపోగొట్టుకున్న దేవుబాయి అవిటిదయిపోయింది. అయినా దేవు తనకు ఏనాడూ ఏ లోటూ రానీయలేదు. తానే దేవుగురించి పట్టించుకోవడంలేదేమో!

దరిద్రం, సమస్యలు తనని దేవుని దూరం చేస్తున్నాయి. దేవుకి వరి అన్నం గాక ఇంకా ఏమేమి ఇష్టమో! ఆలోచిస్తున్నాడు జంగు!

దేవుకి 'ఈతగబ్బం' అంటే చాలా యిష్టం. పెళ్లయిన కొత్తలో ఎండాకాలం

వచ్చిందంటే కనీసం నాలుగైదు సార్లన్నా దేవుకి ఈతగబ్బం పెట్టేవాడు. గొడ్డలితో ఈతచెట్టు కొమ్మలన్నీ నరికేసి ఈతమొద్దు మధ్యలో వుండే లేత భాగాన్ని భద్రంగా ధుప్పటిలో కట్టుకొని తెచ్చేవాడు. ఊళ్లో ముస లివాళ్లంతా జంగును తిట్టిపోసేవారు. 'నీ పెళ్లాం నీల్లు వోసుకుందని బంగారమసుంటి ఈతచెట్టును భూమిలకు నరికితివేందిరా! ఈతగబ్బం ఒకదినంల తినిపారేస్తరు. అదే చెట్టు ఉంటే పది ఇరవై ఏండ్లు కల్లు దొరుకు తది. ఈసారి ఈతచెట్టుమీద నీ చెయ్యైతే పడనీ అబ్కారోల్లకు చెప్పి దండుగు వెట్టిస్తేనే నీకు బుద్ధస్తది!' అని బెదిరించేవాళ్లు.

అట్లా తిట్టినవాళ్లు, బెదిరించినవాళ్లు ఈత మొద్దును పచ్చలు చేస్తుంటే నక్కల మెరంగ కండ్లింత జేసుకొని చూస్తుండేవాళ్లు. లేత గబ్బం దేవుకిచ్చి మిగిలింది పదిమందికి పెడ్తే ఎగవడి తినేటోళ్లు! ఇలా ఆలోచిస్తూ అనాలోచితంగానే టపాటపా ఆకులు తెంపి బుడ్డగోచిలో వేసుకుంటున్నాడు.

'ఈ తునికాకు తెంపుడు కాంగానే దేవుకు ఈతగబ్బం తెచ్చిపెట్టాల. మస్తు రోజుల యింది. ఎంత ఇదిగ తింటదో చూడాల. అంతేగాదు ఈసారి ఇందర్‌వెల్లి అంగడిపోయి నపుడు రంగుల ఫోటో దిగాల'నుకున్నాడు జంగు.

పైసలు దొరకగనే రేలకోసం గుడిహ త్నూర్ అంగట్ల రంగుల రిబ్బను కొనాలనుకు న్నాడు బాలుతాత. రేలకు టర్బూజ పండంటే శానా యిష్టం. తోడ్‌మోడ్ సామాన్ల సైకిల్‌పిల్లాడు అల్లిగూడెం వచ్చినపుడు టర్బూజా పండు, చల్లటి రంగురంగుల కుల్ఫీ కొని పెట్టాలనుకున్నాడు బాలుతాత.

'రూపాయి చేతికి రాగానే జైతు తన భార్యకు రెండు చీరలు కొనియ్యాలనుకుంటు న్నాడు. చీరలు లేక జైతు భార్య లక్ష్మిబాయి రెండు మూడు చీరలు కలిపి కుట్టిన చీర కడుతుంది. చిరిగిన చీరలనుండి చినగని భాగాన్ని కలిపి కుడ్తే అది రంగురంగుల చీరవుతుంది.

ఇంట్లో గింజలేక జైతు పొద్దున నారి చెయ్యలేదు. అంబటాళ్ల అప్పుడే దాటిపో యింది. పొద్దున నారి జేసినా ఆకలయ్యేయా ల్లయింది.

కడుపులో పేగులు బయటకు విన్పించేంత పెద్దగా చప్పుడు చేస్తున్నాయి. వెంటవున్న సొరకాయ బుంగలోనుండి నీళ్లు కొన్ని గటగటా తాగేశాడు. కాలే పేగులమీద నీళ్లు చల్లినట్లయి ఆకలి పేగులు శాంతించాయి.

పొద్దున నారికే గతిలేదు. ఇక సద్దికి ఏముంటది? అడవిలోనే ఏదైనా కాయో, పండో దొరుకుతుందని జైతు కళ్లు ఒకపక్క తునికాకు తెంపుతూనే వెతుకుతున్నాయి. అన్నీ ఎండి మోడువారిన చెట్లే. చాక్‌తరస్‌తో చిగిర్చిన తునికాకు చెట్లు, ఆకులు రాల్చి నిండా పువ్వులతో మంటలు ఎగబోస్తున్న ట్లుండే బూరుగు చెట్లు. కొమ్మల్లోంచి ఎర్రటి మంటల నెగళ్లను గుత్తులు గుత్తులుగా స్ర వించినట్లున్న మోదుగు చెట్లు. అద్భుత చిత్ర కారుడు గీసిన గ్రీష్మంలో వసంతంలాంటి రేలచెట్లు ఆకుపచ్చని ఆకులతో పసుపుప చ్చని పూలతో నిండుగా వంగి అందంగా కన్పిస్తున్నాయి కానీ జంగు ఆకలి తీర్చే చెట్టు ఒక్కటీ లేదు.

జైతు కళ్లు మొర్రి చెట్టుకోసం, మొర్రి పండ్లకోసం వెతుకుతున్నాయి. కానీ ఎక్కడా ఒక్క మొర్రిచెట్టు కన్పించడంలేదు. ఈ అడ విలో తన చిన్నప్పుడు ఎన్ని మొర్రి చె ట్లుండేవి? మొర్రి పండ్లను తిని ఉమ్మేసిన గింజలను పోగుచేసి గుండ్రాయితో నలిపితే ఇంతంత సారపప్పు వచ్చేది. సారపప్పు ఎంతో పిరంగా అమ్మేది. దానికి సరికి సరి ఏ వస్తువైనా దొరికేది. అలాంటిది ఇవాళ ఒక్క మొర్రిచెట్టూ కన్పించడంలేదు.

ఉదయం నారి జెయ్యక, మధ్యాహ్నం సద్దిలేక జైతు రాత్రికూడా సరిగ్గా తినలేదు.




తినడానికి ఏమీ లేక, ఏదో ఒకటి తిని, నీళ్లతోనే కడుపు నింపుతూ యీ తునికాకు వేటలో మైళ్లకొద్దీ నడక, ఎక్కే చెట్టు, దిగే చెట్టు... కాళ్లు పీకుతున్నాయి జైతుకు. ఆకలితో కాలే కడుపు ఆపైన తునికాకు ముల్లె నెత్తిమీద మోత.

ఇంకా తునికాకు తెంపాలన్పించలేదు జైతుకు. తెంపింది చాలనుకున్నాడు. వెనక్కి వెళ్లి తనవాళ్లను కలవాలనుకున్నాడు. వెనక్కి తిరిగి నడుస్తున్న జైతుకు ఎక్కడా తనవాళ్ల అలికిడి వినిపించడంలేదు.

జైతు ఎటు నడుస్తున్నాడో తెలియటంలేదు. ఎంతసేపు నడిచినా తన వాళ్ళ అలికిడి విన్పించడంలేదు.

దిక్కులు మార్చి ఒక్కోదిక్కుకు పది పదిహేను నిమిషాలపాటు కాలినడకను నడిచినా తన గూడెంవాళ్ళ అలికిడి విన్పించడంలేదు. ఎటువెళ్ళారు అందరు.

నడిచి నడిచి జైతు కాళ్ళు పీకుతున్నాయి. వెంట తెచ్చుకున్న నీళ్ళు అయిపోయాయి.

మిట్టమధ్యాహ్నంవేళ! ఎండ తడలుకొడుతోంది.

అడవిలో ఎటుచూసినా నిశ్శబ్దం! ఆపైన ఒంటరితనం! తాను దారితప్పాననిపించింది జైతుకు. వెంటనే తమ గూడెం పెద్దలు చెప్పేముచ్చట గుర్తుకువచ్చింది. 'ఎర్రితీగ తొక్కితే మనిషి ఎర్రి వచ్చినట్లుగానే పిచ్చోడిలాగా తిరుగుతాడని అంటారు. అలాంటిదే ఏదో తీగ తను తొక్కి వుండవచ్చుననుకున్నాడు జైతు. లేకపోతే చిన్నప్పట్నుంచీ పుట్టిపెరిగిన ఈ అడవిలో తాను దారితప్పడమేమిటి?

జైతుకు నడక చేతకావటంలేదు. ఇంకా నెత్తిన ఈ తునికాకు మోతతో నడవడం అసాధ్యం అనుకున్నాడు. అనుకున్నవెంటనే ఓ చెట్టు మొదట దాన్ని పడవేసి, ముందుకు నడుస్తున్నాడు. తునికాకు మూటను పడేస్తుంటే జైతు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఎంత లేదనుకున్నా యాభై రూపాయల ఆకు. యాభై రూపాయలంటే రెండు రోజుల గాసంకు అయిపోను ఇంక మిగుల్తాయి. ఆకులు కట్టిన గుడ్డపేలికను దులిపేసి తలకు చుట్టుకొని నడుస్తున్నాడు.

ఆకు తెంపంగ ఏదో ఫికరు జేసుకుంటా, ఏదో ఆలోచిస్తా ఇంతదూరం లోపలికి వచ్చి తన గుంపుకు దూరమవుతున్నట్లు అన్పించలేదు. ఎక్కడా నీడలేదు. పెద్దపెద్ద చెట్లు ఆకులు రాల్చుకొని ఇంతెత్తున 'బరివతల' నిలబడి ఉన్నాయి. చిన్నచిన్న పొదలు ఆకులు వున్నా కింద కూర్చునేట్లు లేవు. కింద అన్నీ ముళ్ళూ తీగలూ.

ఒకటే ఆకలీ- ఆపైన దాహం!

కాళ్ళల్లో నిస్సత్తువ- నీరసం!

మంట పెట్టినట్లున్న ఆ ఎర్రటి ఎండకు జైతు ఆవిరవుతున్నాడు.

ఉమ్మేద్దామంటే కూడా నోట్లో ఉమ్మి కూడా రావడంలేదు.

ముక్కు, నోరు పూర్తిగా ఎండిపోయాయి.

ఎక్కడన్నా నీడకు కూర్చుంటే గానీ ప్రాణం నిలిచేలా లేదనుకున్నాడు జైతు. అనుకున్నదే ఆలస్యం ఒక దట్టమైన పొదను చూసి చొరబడ్డాడు లోపలికి.

...పొదలోపల చల్లగా హాయిగా వుంది.

ఆ చల్లదనానికి- ఒక్కక్షణం కడుపునిండిపోయినట్లు, చల్లని నీళ్ళు దోసిళ్ళకొద్దీ తాగినట్లు అన్పించింది. పోతున్న ప్రాణాన్ని పట్టుకున్నట్లయింది. అలాగే కళ్ళు మూసుకున్నాడు జైతు. అలసిసొలసిన శరీరంతో వున్న జైతు కళ్ళు మూతలుపడ్డాయి.

పది నిమిషాల తర్వాత మళ్ళీ కడుపులో ఆకలికోత, దాహం!

పొదలోపల పరికించి చూశాడు. పొదలో ఒకమూల పెద్ద పుట్ట. పుట్టలోనుంచి మొలుచుకొచ్చినట్లున్న దంతె చెట్లు. దంతె కొమ్మల మధ్య చిక్కి గాలికి కదులుతున్న పాము కుబుసం. పూర్తి పాము ఆకారంలో వున్న ఆ

కుబుసాన్ని బట్టి, అక్కడ ఒక నాగుపాము ఆ పుట్టలో వుందని, ఈ మధ్యనే కుబుసం విడిచిందని గ్రహించాడు జైతు.

నేల చల్లగావుంది. నేలమీద చల్లని నల్లని మెత్తని మట్టి ముద్దలు. అవి వానపాములు కట్టిన మట్టిముద్దలు.

పైన ముద్దలు ముద్దలుగా కన్పించే మట్టి బెడ్డలను తీసుకొని చేత్తో నుద్దగా చేసి పట్టుకుంటే నీళ్లల్లో చేయిపెట్టినట్లుగా చల్లగా వుందనిపించింది జైతుకు. వానపాములు కన్పిస్తాయేమోనని వేళ్ళతో కెలికి చూశాడు. ఎక్కడో నేల లోపల ఉండి ఉంటాయి. ఒక్క వానపాము చేతికి తగలలేదు.

ఆకలి! ఏమైనా తినాలి! దాహం ఏదైనా తాగాలి! బతకాలంటే ఏదైనా తినాలి. లేత దంతె ఆకులను తెంపి నోట్లో వేసుకొని నములుత్తున్నాడు. వగరు వగరుగా ఉన్నాయి. అయినా కొన్ని ఆకులు నమిలి మింగుతున్నాడు. బలవంతంగా ఇంకా ఏమైనా తినాలి. ఏం తినాలని వెతుకుతున్నాడు. పుట్టలో నాగుపాము ఉండొచ్చా? పాముకు తలలోనే గదా విషం ఉండేది. ఈ కుబుసం విడిచిన పాముకు విషం ఉండదు. కాని అది కొన్ని గంటలముందే కుబుసం విడిచినట్లుండటం వలన అదిగూడా తనలాగే ఆకలిమీద వుండి వుంటుంది. అది వేటకు పోయిందో లేదా ఎండకి భయపడి పుట్టలోనే ముడుచుకుని వుందో.

చేతిలోని మెత్తని మట్టిని ఈ చేతిలోంచి ఆ చేతిలోకి మార్చుకుంటూ ఆలోచిస్తున్నాడు. మధ్యమధ్యన మట్టిముద్దను చెంపలకు, పెదవులకు నుదుటిపైనా అన్చుకుంటున్నాడు. చల్లగా, హాయిగా, తడిగుడ్డ కప్పుకున్నట్లుగా వుంది.

ఆ దట్టమైన పొదలో ఒకమూల ఏదో అలికిడయింది. కళ్ళు చిట్లించుకొని చూశాడు జైతు. ఏదో కదలిక తాచుపాము కాదు గదా! ఇంకా కళ్ళు ఇంతచేసుకొని పరీక్షగా చూశాడు జైతు. తెల్లగా ఉండి కదులుతున్న జీవాలు. మెల్లగా దగ్గరగా జరిగి చూశాడు. కదులుతున్న కుందేళ్ళు.

తల్లి కుందేలు పడుకొని వుంది. దానిచుట్టూ నాలుగు కుందేలు పిల్లలు తల్లిపాలకోసం పొదుగు దగ్గర తచ్చాడుతున్నాయి. కుందేలు ఈని కొన్నిగంటలే అయినట్లుంది. తల్లి కుందేలులో ఇంకా నీరసం పోలేదు. పిల్లకుందేళ్లలో ఇంకా హుషారు రాలేదు. జైతు వెంటనే ముందుకి దూకి తల్లి కుందేలును రెండు చెవులుపట్టి పట్టుకున్నాడు. పిల్ల కుందేళ్ళు తల్లి రొమ్ము వదిలినందుకు చిన్నగా గునుస్తున్నాయి.

కుందేలు పొదుగు నిండి వుంది. జైతు ఇంకో ఆలోచన చేయకుండా కుందేలు పొదుగుకు నోరు పెట్టి చీకసాగాడు. పాలు ధారలు పడుతున్నాయి గొంతులో.

వెచ్చటి పాలు చిరుతీపి పాలు- జైతు గొంతులోంచి జారిపోతున్నాయి. ఒక్క దెబ్బకు రెండు పిట్టల్లా, ఆకలీ, దాహం రెండూ ఒకేసారి తీరుతున్నాయి జైతుకు.

ఎందుకైనా మంచిదని- కుందేలును అలాగే పట్టుకొని చుట్టూ వెతికాడు. దూసతీగ కన్పించింది. వెంటనే ఓ పొడవాటి తీగను తుంచి దాని మెడకు కట్టి ఒక కొమ్మకు కట్టివేశాడు. కుందేలును వదలగానే మళ్ళీ పిల్లలు తల్లి పొదుగుపై కుమ్ములాట ప్రారంభించాయి. ఆ పొదుగులో ఒక్క చుక్క కూడా పాలులేవని జైతుకు తెలుసు.

పొద్దు పడమటికి వాలబోతోంది. పొద్దు గుంకేలోగా యీ అడవిలోంచి బయటపడాలి. లేకుంటే పులులూ, ఎలుగుబంట్లతో ఒంటరిగా ఈ అడవిలో రాత్రంతా గడపడం చాలా కష్టం. ఆ క్రూరజంతువులతో తలపడి తప్పించుకునే శక్తీ ఓపికా తనకు లేవనుకున్నాడు జైతు. ఎలాగైనా ఓపికచేసుకొని ఈ అడివినుండి బయటపడాలి. లేకపోతే ఆకులు రాల్చిన ఈ అడవి తనను క్రూరజంతువుల బారినుండి తప్పించలేదు, రక్షించనూలేదు.




తెల్లవార్లూ ఆకలి దప్పికతో ఈ అడవిలో ఉండలేడు.

దారి వెదకాలి! బయట పడాలి! జైతు లేచి నిలబడ్డాడు.

ఎండనుండి తనను సేదదీర్చిన ఆ పొద, ఆ చల్లటి మట్టి, కుందేలు తల్లి, అన్నింటినీ ఒకసారి చూసి, ఎందుకైనా మంచిదని, ఒక కుందేలు పిల్లను రెండు చెవులుపట్టి లేపి తనవెంట తీసుకున్నాడు.

ఆకలిని జయించాలంటే ఒక కుందేలు పిల్లను బలివ్వక తప్పదనుకున్నాడు జైతు.

ప్రస్తుతం కుందేలు పిల్లను చంపి తన ఆకలిని తీర్చుకోవడం తప్పనిపించింది జైతుకు. అయినా తన జీవితంలో ఎన్ని సార్లు కుందేళ్ళనూ వాటి పిల్లలను పట్టి చంపి తినలేదు.

కుందేలు పిల్లను చంపడమా? మానడమా? సందిగ్ధంలో పడ్డాడు!

ఒక విచిత్రమైన షరతు తనకు తానే విధించుకున్నాడు.

ఈ అడవిలో ఎక్కడైనా నిప్పు కన్పిస్తేనే కుందేలును కాల్చుకొని తినాలి. లేకపోతే కుందేలును చంపకూడదని నిర్ణయించుకున్నాడు. పొద్దుట్నుంచీ అడవిలో పడి తిరుగుతూవుంటే ఎన్నో చోట్ల నిప్పు కన్పించింది. కాబట్టి నిప్పు కనిపించకమానదు. ఈ చిన్ని కుందేలు తన కడుపులోకి పోకుండా మానదు. పొద్దుగుంకేలోపున తన ఆకలి తీరకపోదు.

జైతు తనకు తాను విధించుకున్న షరతు-తనవైపునుండి బలంగానూ కుందేటిపిల్ల ప్రాణంవైపునుండి చాలా బలహీనంగానూ కన్పించింది. జైతు కుందేలు పిల్లను పట్టుకొని నడుస్తున్నాడు. ఎక్కడా నిప్పురవ్వ కన్పించలేదు. గంటపైనే నడిచాడు. కాని ఎక్కడా నిప్పు జాడేలేదు. ఇదంతా 'పెర్సుపేన్' మాయనే అన్పించింది. అడవిలోకి పోయేటప్పుడు ఎన్ని చెట్లు కాలుతుండగా చూడలేదు తాను. ఒక్కసారి అంటుకున్న చెట్లు వారం, పదిరోజులు కాలుతూనే వుంటాయి. అలాంటిది దారిలో ఎక్కడా నిప్పు కన్పించడం లేదు. కడుపులో ఆకలి మండిపోతూ వుంది. నిప్పు జాడేలేదు!

నిప్పుకోసం వెదుకుతున్న జైతుకు నిప్పు కన్పించలేదు గానీ, ఆకలిని తీర్చే దిరిసిన గడ్డల ఆనవాలు దొరికాయి. కాని అవి భూమిలో నుండి త్రవ్వి తీయాలి. అలా తీసిన గడ్డలు అంతా విషంతో నిండివుంటాయి. వాటిని పారే నీటి ధారకు పదిరోజులు ఉంచి గానీ, మరగబెట్టిన నీళ్ళల్లో అయిదారుసార్లు నీళ్ళు మారుస్తూ ఉడికించితేనే వాటి విషం విరగడవుతుంది. అప్పుడు తినవచ్చు వాటిని.

ఎప్పుడో చిన్నప్పుడు యీ గడ్డలు తినిపించి, కరువునుంచి బతికించినట్లు వాళ్ళ అవ్వ చెపితే విన్నాడు. కానీ ఇప్పటిదాకా బుద్ధి తెలిసిన తర్వాత తినలేదు.

దిరిసెన గడ్డలు ఒక ప్రాణాంతకరమైన ఆహారం. జైతు వాటి జోలికి పోలేదు.

జైతు కుందేలును ఆ చేతిలోంచి, ఈ చేతిలోకి మార్చుకొని నడుస్తున్నాడు. అడవి మెల్లమెల్లగా పలచబడుతున్నది. పొద్దు పడమటి దిక్కుగా పూర్తిగా వాలిపోయింది. అయినా వెలుతురు పగలులానే వుంది.

నడుస్తున్న జైతుకు దగ్గర్లో ఒక ఈత చెట్టు కన్పించింది. దానికి కుండకట్టి కన్పించింది. ఈతచెట్టుకు గీత గీసి కల్లు కుండ కట్టి వుందంటే దగ్గర్లోనే ఏదో ఒక ఊరు ఉందన్న మాట! ఊరు సంగతి తర్వాత! ఊరు వుంటే మాత్రం అక్కడేమైనా చుట్టాలూ బంధువులూ జైతుకోసం ఎదురుచూస్తూ వుంటారా? అయినా ఈ చుట్టుపక్కల ఆకలికి నకనకలాడని గూడెమున్నదా? కరువుతో ఎండని ఊరున్నదా? ముందు కాలే కడుపును చల్లార్చాలని, ఈత చెట్టుకు కట్టిన కుండను కిందకి దించాడు. సగం కుండవరకు కల్లు వుంది.

ఎప్పుడు కట్టారో కుండ! కల్లు పులిసి వాసనకొ ట్టోంది. నురుగు ఇంతెత్తున పొంగివుంది. కళ్ళు మూసుకొని కుండ నోటికి పెట్టి గటాగ టా త్రాగేశాడు. కడుపు నిండిపోయింది జై తుకు.

కొంతదూరం నడిచాక నాగజెముడు పొద కనిపించింది. చెట్టునిండా ఎర్రటి పండ్లు ముళ్ళ తో. ఒడుపుగా ఒక పది పళ్ళు తెంపుకొని తిన్నాడు. కడుపులో కొంత శాంతి కలిగింది. పులిసిన కల్లు నిషా యింకా దిగలేదు. నిషా ఎక్కిన జైతుకు నీరసం పోయింది. ఆకలి దప్పులూ పోయాయి. హుషారుగా అన్పించింది! ఆ హుషారులో బుర్ర వేగంగా పనిచేయసాగింది. జాగ్రత్తగా వెదికితే దూ రంగా నలిగీ నలగని ఒక బాట కనిపించింది.

ఆ పిల్లదారిన జాగ్రత్తగా అడుగులేస్తూ-తూలుతూ ఏదో సగం వచ్చిన బూతు పాట పాడుకుంటూ ముందుకు సాగిపోతున్నాడు.

★ ★ ★

రెండు రోజుల తర్వాత జైతు అల్లిగూడెం చేరుకున్నాడు. ఎటో మునిగి ఏ వైపునుండో తేలి చివరకు చేరుకోగలిగాడు తన వాళ్ళని. జైతు తప్పిపోయిన సంగతినే చెప్పుకున్నారు ఆ గూడెం వాళ్ళు వారం రోజులదాకా.

ఆ రోజు ఇంటిదారి పట్టిన అల్లిగూడెం జనాలకి, జైతు లేడనే సంగతి చాలా సేపటికి గాని గుర్తుకురాలేదు. గుర్తొచ్చాక వాడే వస్తా డు. చిన్నోడా చితకోడా- ఆడపిల్లనా, ఆడే వస్తాడు అని వెళ్ళిపోయారు. ఆ రాత్రి జైతు ఇల్లుచేరలేదు.

తెల్లవారి ఆకు తెంపుతూనే జైతు విడిపో యిన ప్రాంతమంతా వెదికారు. తెంపి పడే సిన జైతుకి సంబంధించిన ఆకు దొరికింది గాని జైతు జాడ దొరకలేదు.

అందరూ పరిపరివిధాల ఆలోచించసాగా రు. అసలే ఈ మధ్య ఈ అడవుల్లో జంతు వుల సంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. శికార్ చేయడం 'ఖానూన్' కాదని చెప్పినాక ఎవరూ ఏజంతువులను వేటాడ్డం లేదు. పులు లూ, జింకలూ, చిరుతపులుల సంఖ్య చాలానే పెరిగిపోయింది.

అడవికి వెళ్ళిన వాళ్ళని పులి చంపే యడం, పశువులని లాక్కెళ్ళడం ఈ మధ్య మామూలయిపోయింది. ఎక్కడ జైతు గూడా పులి బారిన పడి 'వాఘోబా' అయ్యాడోనని అందరి అనుమానం. పులినోట్లో పడ్డవాడు పుణ్యాత్ముడనీ, పులి బొమ్మను రాతితో చె క్కించి, ఆ వూరి శివార్లో ఏ చెట్టుకిందనో వుంచి పూజించడం రివాజు.

'వాఘోబా' అయ్యాడనుకున్న జైతు రెండవ రోజు వచ్చి అందరినీ ఆశ్చర్యపరిచా డు.

జైతు భార్య సంతోషంతో కోడిపిల్లను జైతుమీద తిప్పి దిష్టితీసివేసింది. వచ్చేఏడు వరకు సల్లగుంటే, కేస్లాపూర్ నాగోబా జాతర కొచ్చి, కోడిని కోసి నైవేద్యం పెడతానని మొక్కుకుంది.



**చూ**స్తూండగానే చాక్‌తరస్ అయిపో యింది. తునికాకు తెంపుడూ అయిపో యింది. వాటిలో సంపాదించుకున్న డబ్బూ అయిపోయింది. మళ్ళీ కడుపుకి నకనకనే. యింకా తొలకరి రావడానికి నెలపైనే వుంది. ఎవరి ఇంట్లో మిగిలింది ఏమీ లేదు. డబ్బు లకు కటకటగానే వుంది.

ఎండలు ఇంకా తీవ్రమయ్యాయి.





ఉదయం ఏడెనిమిది గంటలకే ఎండ చిటపటలాడుతోంది. వాగులు, వంకలూ ఎండిపోయాయి.

బావులు అడుగంటిపోయాయి. చేదకే నీళ్ళు అందడంలేదు. బోరింగు బావులు వట్టిపోయాయి. నీటికోసం మైళ్ళదూరం వెళ్ళాల్సి వస్తోంది. మనుషులకు, పశువులకు నీటికోసం అంతదూరం వెళ్ళిరాడంతోనే దినం గడిచిపోతోంది.

పశువులకు తినడానికి మేతలేదు. పోయినేడు వర్షాలు సరిగా కురవక మేత సరిగా ఎదగలేదు. మనుషుల తిండికన్నా నోరులేని పశువుల మేతకే, నీటికే కటకటగావుంది.

తాము తినడానికే సరిగ్గా గింజలు లేవు. చేతిలో నయాపైసాలేదు. పైనుండి ఈ పశువుల పోషణ ఒకటి. ఇంట్లో ఉండే పశువులు అందరికీ భారంగా అయ్యాయి. తాము దూరడానికే కంతలేదు! మెడకోడోలు అన్నట్లుంది.

కడుపునిండా మేత, తాగడానికి నీళ్ళూ ఈయలేని రైతు ఎడ్లను అరకకు కట్టడానికి సాహసించలేకపోతున్నాడు.

కడుపుకింత దానా, కుడితీ పెట్టడానికి లేని రైతు బర్రెలను పితకడానికి సాహసించడంలేదు. పితికితే పాలకు బదులు ఎక్కడ రక్తం స్రవిస్తుందోనని భయం.

దూడలను వదిలితే ఎండిపోయిన పొదుగులను కుమ్మికుమ్మి రక్తసిక్తం చేస్తున్నాయే తప్ప పాలు రావడంలేదు.

పశువుల దీనస్థితి చూడలేక ఎంతోమంది పల్లెప్రజలు తమ పశువులను సంతకు తోలుకెళ్ళి, అయినకాడికి తెగనమ్ముకుంటున్నారు.

ఊళ్ళో చాలామంది తమ పశువుల్ని, గుడిహత్నూర్ అంగడికీ, ఉట్నూర్ క్రాస్‌రోడ్డు అంగడికీ కొట్టుకుపోతున్నారు.

ఎండ నడినెత్తిమీదకు రాకముందే పశువులకు నీళ్ళు తాగించి అలాగే తలమీద ఒక బుంగతో చేతుల్లో రెండు తోలుతిత్తుల్తో నీళ్ళు తేవడానికి సిద్ధమవుతున్నారు జంగు, జైతు.

ఈమధ్యన గళ్ళలుంగీలు, చారల చొక్కాలు ధరించిన బ్రోకర్లు చాలామంది ఊళ్ళో పశువులకోసం వస్తున్నారు. బేరం చేయడం వెంటనే డబ్బు ఇచ్చేయడం, పశువుల్ని తోలుకుపోవడం. ఎన్ని పశువులమ్మినా, ఎలాంటి పశువులమ్మినా కొనడానికి వాళ్ళు సిద్ధం. కొన్న పశువుల్ని కొన్నింటిని కాలినడకనా, కొన్నింటిని లారీలో ఎక్కించుకొని తీసుకుపోతుంటారు.

ఆరోజు పశువులమ్ముకున్నవారు, ఈ రోజుతో జంజాటంనుండి విముక్తి దొరికిందని ఊపిరి పీల్చుకుంటున్నారు.

పశువుల మీద మమకారం తీరని వాళ్ళు, వాటి మేతకోసం, నీటికోసం సతమతమవుతున్నారు. సంధిగ్ధంలో పడుతున్నారు. పశువుల్ని ఉంచుకోవాలా! అమ్మాలా అని చూస్తూండగానే ఒక లారీ వచ్చి ఆగింది. నడవలేని పశువులని, లేగలని, దూడలని అందులోకి ఎక్కిస్తున్నారు. అందులో ఎక్కిస్తున్నపశువులు చాలామటుకు బక్కచిక్కి ఎముకలగూడులా వున్నాయి. మూపురాలు మొనదేలి ఎముకలు కన్పిస్తున్నాయి. డొక్కలు ఎండిపోయి పక్కటెముకలు లెక్క పెట్టుకోవడానికి వీలుగా కన్పిస్తున్నాయి. ఒకప్పుడు రైతు కుటుంబ భారాన్నంతా తమ మెడమీద మోసిన పశువులు- ఈ రోజు రైతుకే భారమై లారీలోకి ఎక్కించబడుతున్నాయి.

లారీలోకి పశువులను ఎక్కించడాన్ని పిల్లలూ పెద్దలూ వింతగా చూస్తున్నారు. లారీ ఎక్కడానికి మొరాయించిన వాటిని నిర్దాక్షిణ్యంగా కర్రలతో బాదుతున్నారు. కొన్నింటిని నాలుగు కాళ్ళు కట్టేసి, పదిమంది కలిసి లేపి లారీలో పడవేస్తున్నారు. తాళ్ళూ కర్రలూ ఒరుసుకొని హృదయవిదారకంగా అరుస్తున్నాయి పశువులు.

దయగలవాని కడుపులో దడపుట్టించేరోదన అది!



మనసుగల మనిషిని కన్నీటి కుండచేయ గల దృశ్యమది!

అక్కడి పశువుల రోదన చూస్తూన్న స్త్రీలు తల్లడిల్లి గుడ్లల్లో నీరు కుక్కుకుంటున్నారు. అంత పెద్ద శరీరాలు కలిగిన ఆ పశువులు, పదిమంది పశుబలానికి తలవంచి చెప్పిన ట్లు నడుచుకుంటున్నాయి.

నిజానికి మనిషి తనకి మచ్చికైన వాటిని పశువులనీ, మచ్చిక కాకుండా తిరగబడే వాటిని జంతువులనీ వర్గీకరించి వుంటాడు. మాంసభక్షణ చేసే వాటిని అడవిలోనే వదిలి, మాంసభక్షణ చేయని వాటిని, చంచలత్వం లేని వాటిని, తనకి అణగిమణగి పడుండేవా టినీ, తన శక్తి సామర్థ్యాలను మనిషి సు ఖంకోసం వెచ్చించే వాటిని ఎన్నుకొని, నాగరి కతా క్రమంలో వాటిని పెంపుడు జంతువుల స్థాయికి మార్చి వుంటాడు.

ఈ పశువులను కావలసినన్ని రోజులు వెట్టిచాకిరీ చేయించుకొని దాని రక్తమాంసాల ను హరించాక వాటిని కబేళాకు పంపి, అమ్మినవాడు డబ్బురూపంగా తింటే, కొన్న వాడు మాంసం రూపంలో తినేస్తున్నాడు.

అలవాటయిన ప్రదేశం వదిలిపోవడానికి పశువులు మొరాయిస్తున్నాయి. అలవాటు లేని వాహనం ఎక్కడానికి జంకుతున్నాయి. బలవంతంగా ఎక్కించడంతో, వాటికి దెబ్బ లు తగిలి రక్తం కారడం కూడా కన్పిస్తోంది. ఆ ప్రదేశమంతా పశుబలి వేదికలా అన్పి స్తోంది.

దేవుబాయి, జంగు, జైతు, లక్ష్మి, కినాకి బాలుతాత, సోము, భీము అంతా చోద్యంగా, బాధగా రకరకాల హావభావాలతో చూస్తున్నా రు.

"ఇన్నేసి గొడ్లూ- గోజలూ కొనుక్కపోయా ఏం జేస్తరు ఈల్లు!" దేవుబాయి అడిగింది జైతును.

"మంచిగున్న దాన్ని ఎక్కువ ధరకు అమ్ముకుంటరు. చాతగాని దాన్ని కోసుక తింటారు!"

"కోళ్ళూ, మేకలను గోసుకతింటరుగానీ, గీ బర్లూ, ఎడ్లూ, కుర్రలను గూడా ఎక్కడన్నా కోసుకతింటరా?" అంది దేవుబాయి.

"అన్నీ తింటరు! పట్నమోల్లు దీన్ని తింట రు, దీన్ని తినరు అని ఫరక్ లేదు. అన్నీ తినుడే! అందరూ తినుడే!" అన్నాడు జైతు ఎకసక్కెంగా.

వీళ్ళ మాటలు వింటూ ఓ మూలన బీడీకాలుస్తూన్న క్లీనరు, "ఇవి మనదేశంల తినేటోళ్ళకోసం గాదు! ఇవన్నిట్లను కోసి మంచిగ డబ్బాలల్ల నింపి, బయటిదేశాలకు పంపుతరు. మేము ఇవ్వన్నీ కార్ఖానాకు దో ల్కపోతం!"

"కార్ఖానా! గదేంది! ఏం కార్ఖానా!"

"గీ గోజుల మాంసం సాపుజేసే కార్ఖానా! హైద్రాబాద్ దగ్గర రుద్రారం లేదా! గాడ 'ఆల్‌కబీర్' అని పెద్ద కార్ఖానా ఉన్నదిలే! గాడ కరెంటు మిషన్లతోటే ఇవన్నిట్లనూ సంపి, బొక్కలు దీసేసి, మంచి మాంసం సాపుజేసి డబ్బాలల్ల నింపుతరు. గట్ల రోజుకు ఆరు నూర్ల గోజల మాంసం డబ్బాలల్ల నింపుతరు. అబ్బా! లవు పెద్దకార్ఖానా అది!"

క్లీనరు చెప్పే విషయాలను వింతగా నమ్మలేనట్లుగా వింటున్నారు.

'ఆ ఫ్యాక్టరీకి మేము నెలకు ఆరు వేయిల గోజల్ని సప్లై చెయ్యాల. గిట్ల గోజలు సప్లై చేసుడు మొదలుపెట్టినంక మా రసూల్ సేర్ కిస్మతే పల్టాయించి పోయింది. పైసనే పైస. రెండు మూడు నెలల్ల యీ లారీ కొన్నడు'' అన్నాడు క్లీనరు.

వింటున్న ఆ పల్లెవాసులు మ్రాన్పడిపోయా రు. వాళ్ళ ఊహకి అందడం లేదు, మాంసం రవాణా వ్యాపారం.

"ఇక్కడ గింత గడబిడ జేస్తున్నయిగని, ఆల్‌కబీర్‌ల యీటిని కరెంట్ షాక్‌తోని సంపు తరు. కట్టెలు గోసే కరెంటు రంపాలతోటి కరకర గోసేసి, తోలు తొక్కలు ఏరేజేస్తరు.





ఆడ అన్ని పనులు మిషన్లే జేస్తయి. మనుషు లు ఉత్తగ బటన్లు ఒత్తుడే! మిషన్ల ఇక్కడికెల్లి గోజలు పోతయి. అక్కడికెల్లి డబ్బాల్ల మాంసంనింపి అస్తది!" క్లీనరు ఆ విధాన మంతా చక్కగా వర్ణించి చెప్తున్నాడు.

అంతదాకా విన్న ఒక ముసలామె, గొంతు పెంచి అరవసాగింది!

"నోరులేని జీవరాసులు! వాటి గోసపుచ్చు కొని సంపుతరట! ఆల్ల తిండి మీద మన్ను వడ! ఆల్ల తిండి చెర్లవోను!" అంటూ శపించు కుంటూ వెళ్ళిపోయింది.

"ఇసుంటివి జూసినా తప్పే! ఇన్నా తప్పే! అసుంటోళ్ళకు మనగోజ లమ్ముడూ తప్పే!" అంటూ ఇక చూడకూడదన్నట్లు వెళ్ళిపో యింది దేవుబాయి.

అందరూ తలో దిక్కు కదిలిపోయారు.

పశువుల నెక్కించుకొని లారీలు ముందుకు వెళ్ళిపోయాయి.

★ ★ ★

మిట్టమధ్యాహ్నం! పన్నెండు గంటలవేళ! అల్లిగూడెంలో ఉన్నట్టుండి కలకలం చెలరే గింది. జైతు బిడ్డ క్రిష్ణ, కాళ్ళు చేతులూ చల్లబడ్డాయి. క్రిష్ణని కిందవేసారంటూ జనం జైతు గుడిసెవైపు పరిగెత్తుతున్నారు.

చూస్తూండగానే జైతు వాకిలి జనంతో నిండిపోయింది. అదృష్టవశాత్తు డాక్టర్ సిద్ధా ర్థకూడా ఉళ్ళోనే ఉన్నాడు. కానీ జైతు బిడ్డను కాపాడలేకపోయాడు. దిరిసెన గడ్డల విషానికి జైతు బిడ్డ బలయిపోయింది. దిరిసెనగడ్డల విషస్వభావం తెలియని సిద్ధార్థ పెద్దగా ఏమీ చేయలేకపోయాడు. జైతు బిడ్డ విలవిలలాడు తూ ప్రాణం వదిలింది. సిద్ధార్థ నిస్సహాయుడి గా చూస్తూ వుండిపోయాడు. చనిపోయిన క్రిష్ణ పక్కనే సగంతిన్న గడ్డలు పడివు న్నాయి.

తినడానికి కటకటగా ఉండటంతో ఒక పూటకైనా పనికివస్తాయనే ఉద్దేశంతో, పొద్దున ఆ గడ్డలు తవ్వుకొచ్చాడు జైతు. ఉడకబెట్టిన తర్వాత తినొచ్చుననే ఉద్దేశంతో వాటిని చూరులో ముల్లెకట్టి దాచి వుంచాడు. వాటిని పిల్లలు ఎలా చూశారో! ముందుగా తిన్న క్రిష్ణ పడిపోయింది. తినకుండా వున్న చిన్నపిల్ల బతికిపోయింది. లేకపోతే ఆ చాప మీద ఇప్పుడు రెండు శవాలు వుండేవి.

శవంముందు రొమ్ములు బాదుకుంటూ ఏడుస్తోంది పిల్ల తల్లి. నేలకు తలను బాదు కుంటూ ఏడ్వడంవలన తలకి బొప్పి కట్టింది.

కన్నతల్లి గుండెకోతను ఏ మాటలు ఊర డించగలవు.

"ఆడీలకు బొయి అచ్చిన మీ తండ్రికి క్రిష్ణి ఏదంటే ఏంజెప్పనే తల్లీ! కన్నకర్మంకు గింత బుక్కెడంత బువ్వ పెట్టలేదని మమ్ము లని కాదని పోతివా తల్లీ! పాపిష్టిలోకంమీద రోతగల్గిపోతివా తల్లీ! తల్లి నువ్వంటే నాకు కష్టం సుఖం సూస్తవనుకుంటినే తల్లీ! అవ్వాల్ ఈ సారి కేస్లాపురం జాతరకు పోద మంటివిగదనే తల్లీ, ఇగ నేను జాతరకు ఎవల్లను దీస్కొనిపోదునే తల్లీ! అవ్వ నాకు జాతర్ల రంగురంగుల ధండాయి మిఠాయీ' కొనియ్యమంటివే తల్లీ! అవ్వ నువ్వు జాతర కంటేముందే ఎల్లిపోతివే తల్లీ!"

క్రిష్ణ తల్లి లక్ష్మిబాయి తలచుకొని, తలచు కొని ఏడుస్తోంది.

అడవిలోంచి పశువులను తోలుకొని వచ్చిన జైతుకి తన ఇంటిముందు మంది గుమిగూడి వుండటంతో, ఏ దొమ్మరి ఆటనో, గుడ్డెలుగు ఆటనో ఆడుతుండచ్చనుకుంటు న్నాడు. కానీ దగ్గరగా వచ్చి చూస్తే వాకిలిమ ధ్యలో చాపమీద క్రిష్ణిని చూసేసరికి, జైతు చేతిలోని నీళ్లబుంగ జారికిందపడి భళ్లున పగిలి ముక్కలయింది.

క్రిష్ణి పక్కన కన్పిస్తున్న దిరిసెన గడ్డలు చూసి జైతు గొల్లుమన్నాడు.

"తిండిపెట్టలేని ఈ బాబుల్ నీకు దిరిసెన

గడ్డల విషం పెట్టి సంపినగదే'' అంటూ ప్రాణంలేని బిడ్డ శవాన్ని హృదయానికి హత్తు కొని ఏడ్వసాగాడు జైతు.

ఏడ్చేవాడు ఒక్కసారి ఆపేసి, పక్కనేవున్న దిరిసెన గడ్డనందుకుని కసకసా కొరికాడు జైతు. వెంటనే జంగు ముందుకు దూకి జైతు చేతిలో గడ్డలాక్కుని జైతునోరు తెరచి బలవంతంగా కొరికిన ముక్కను బయటకు తీశాడు.

"పిసోడా పోయినోళ్లతోటి మనం గూడా పోతమా! ఏంది? దానికంతే అన్నం బాకి ఉన్నది అనుకోవాల! మనయాల్ల మంచిగా లేదు. ఇసం గడ్డలు తినే రోజులొచ్చినయి. మనసు గట్టిగ జేసుకోవాలి'' కినాక తాత అన్నాడు.

గడ్డ కొరికినందుకే జైతు నాలుక తిమ్మిరెక్కి వాచిపోయింది. వచ్చినవాళ్లు భార్యాభర్తలకు చెరోమాట చెప్తూ ఊరడిస్తున్నారు. అయినా ఆ దంపతుల దుఃఖం ఆగడంలేదు. బాధ, దుఃఖంతో వాళ్ల కన్నగుండెలు ఎగిసి ఎగిసి పడుతున్నాయి.

"ఏడ్వనియ్యుండ్లి. కన్న తల్లిదండ్రులు ఆళ్ళకుండకుంటే దుఃఖం మనకుంటదా! ఏడనీ. ఏడిస్తే మనసు హల్కగవుతది'' అంటూ వాళ్లని ఏడ్వనియ్యండి అన్నట్లు మాట్లాడుకొచ్చాడు బాలయ్య తాత.

"ఈలోగా మనం కావల్సిన ఏర్పాట్లు చూస్తాం రండి'' అంటూ అంత్య క్రియల ఏర్పాట్లకు ఉద్యమించారు కొందరు.

★ ★ ★

తిండికి, నీళ్లకు రోజు గడవడం కష్టమైపోయింది. ఎక్కడా అప్పు పుట్టే మార్గంలేదు. గిరిజనుల ప్రపంచమెంత. అందులో అందరూ సమానమే. ఎవరు ఎవరినీ ఆదుకునేలా లేరు. ఎవరి కష్టాలు వాళ్లవి. అందరి కష్టాలు, అందరి బ్రతుకులు ఒక్కలాగే ఉన్నాయి.

ఒకదినం కైకిలిచేసి రెండురోజులు తినేరోజులు ఎప్పుడో పోయాయి. ఆరోజు కైకిలి డబ్బులు, ఆరోజు ఒకపూటకు సరిపోవడమే కష్టమైపోయింది. ఒకరోజు కైకిలిచేసి ఒకపూటయినా గంజో, అంబలో, గటకో తిందామంటే చేయటానికి పని ఇచ్చే దాతనే లేడు. రెక్కాడితేగాని డొక్కాడని జీవాలు. రెక్కల కష్టం కొనేవాడే లేడు.

నీటిసాగు లేకుండా పంటలు పండించే రోజులు కావివి. వ్యవసాయం జూదమయింది. ముఖ్యంగా మెట్ట వ్యవసాయం. సమస్త శక్తులు ధారవోసి గింజ ఏసింది మొదలు పంట చేతికొచ్చేవరకు రైతు పెళ్లాం పిల్లలవైపు, తనవైపు చూసుకోడు. ఆకాశందిక్కు, మబ్బులదిక్కు చూస్తాడు.

ఒకయేడు అతివృష్టి అయితే మరో రెండేండ్లు వరుసగా అనావృష్టి. రైతులు సమమైన కాలం చూసి ఎన్నేళ్లయ్యిందో.

పది-ఇరవై ఏండ్లకాలంలో ఇంత నీటి కటకట ఎవరూ చూసి ఎరగరు. మంచి మంచి లోతుబావులు ఎండిపోయాయి. వాగులు, వంకలు, బర్రెలు, చెలమలు అన్నీ ఎండిపోయాయి. ఎక్కడో మడుగుల్లో మిగిలిన నీళ్లు తాగి బతుకుతున్నారు.

పొద్దు ఇంకా పైకి పారనేలేదు. వాతావరణం అప్పుడే ఉక్కగా ఉంది. దినమంతా కాగిన నేల రాత్రంతా కూడా చల్లబడతలేదు. మళ్లీ ఎండ, ఉక్క, కడుపునిండా తిని, గడియకిన్ని నీళ్లు తాగుతూ నీడపట్టునుంటేనే అలిసి, సొలసిపోయే కాలం అది. ఖాళీ కడుపులు, చాలీచాలని తిండి, ఒకపూట తింటే రెండుపూటలు ఉపవాసం.

పశువులు, మనుషులు ఎవరిలో సత్తువ లేదు. నోరులేని జీవాల పరిస్థితి మరీ అధ్వాన్నంగా ఉంది.

జంగు పశువుల్లో పెద్దావు గూట దగ్గరే కూలబడిపోయింది. నిన్న మధ్యాహ్నం ఎప్పుడు కూలబడిందో తెలియదు. లేవడంలేదు. పది ఈతలు ఈనిన ముసలి ప్రాణం. మేత నీళ్లు లేక బేజారయి కూలబడిపో




యింది.

కూలబడిపోయిన పెద్దావును చూసి జంగు, దేవుల కళ్లలో నీళ్లు తిరిగాయి.

ఇంతప్పట్నించి తనతోపాటు గటకముద్ద లు, రొట్టముద్దలు పెట్టి పెంచుకున్న ఆవు అది.

ఆ పందిట్లో ఉన్న పశువులు అంతా దాని సంతతే. తమ ఇంటి మహాలక్ష్మి ఈ పెద్దావు. నేడు తన దరిద్రంతో కనీసం కడుపు నిండ నీళ్లు కూడా తాపలేకపోతున్నాడు.

పూటకు ఇంత పచ్చగడ్డి, రెండు బిందెలనీ ళ్లు, ఒక బిందెడు పులిసిన అంబలి, ఉల్లిపా యలు పెడ్తే రెండు రోజుల్లో మళ్లీ లేచి నిలబడుతుందని తెలుసు జంగుకు. కానీ అన్నీ తెలిసివుండి ఏమీ చేయలేని అశక్తత, పెద్దావును అలాగే గూటంకు వదిలేసి, మిగ తా పశువులను తోలుకొని మడుగుకెళ్లాడు జంగు. రోజుకన్న ఒకతోలుబాదల ఎక్కువ పట్టుకొనిపోయాడు. తలమీద నీటికుండ, ఒక భుజంమీద రెండు తోలుతిత్తులు, మరో భు జంమీద రెండు సొరకాయ బుంగలు, ఒక చేతిలో మరో రేకుడబ్బాతో పశువులను తోలు కొని వెళ్లాడు జంగు.

నాలుగుమైళ్లు పోవాలి, నాలుగుమైళ్లు రా వాలి.

రెండు భుజాలపైన రెండు కావళ్లు పెట్టు కున్నట్టుంది. పైన తలమీద నీటికుండ చే తిలో మరోనీటి డబ్బాతో జంగు నిలువునా నీటితో నొక్కబడి నడుస్తున్నాడు. నీటిబరు వుతో నడక ఎసగడంలేదు. అయినా పెద్దా వుకు కనీసం ఇయ్యాలైనా కడుపునిండా నీళ్లు తాపుదామని, అందుకు కష్టమైనా ఓర్చు కుందామని అనుకున్నాడు. అంత కష్టంలో కూడా జంగు కళ్లలో అదో తృప్తి. ఇంటికి వెళ్లగానే పెద్దావు కడుపునిండా నీళ్లు తాగు తుందని నేడు తమ ఇంట్లో పిల్లా జెల్లా అంతా కటిక ఉపవాసం ఉండయినా ఒకపూట తిండి పెద్దావుకే పెట్టాలని నిశ్చయించుకున్నాడు.

ఆలోచిస్తూ నడుస్తున్నాడు. ఏ ఆలోచన లేకుండా నడిస్తే నడక ఎదగడం కష్టం.

జంగు మడుగుకెళ్లి తిరిగి వచ్చేసరికి పెద్దావు కళ్లు నిలేసి ప్రాణాలు వదిలేసింది. పక్కన దేవు, పిల్లలు, కూర్చుని ఉన్నారు.

అంతసేపు ఓపికతో ఉన్న దేవు, జంగును చూసి ఒక్కసారి ఘొల్లుమంది. పెద్దావు ఆ ఇంట్లో ఓ సభ్యుడితో సమానం. పెద్దావు ఈ కరువు కోరల్లో బ్రతికి బయటపడదని జంగుకు తెలుసు. కాని ఇంత త్వరగా పెద్దా వుతో రుణం తీరిపోతుందని అనుకోలేదు. ఇదేమి తెలియని, ఊహించని దేవు స్త్రీ సహజ మైన ఆర్ద్రమైన మనసుతో పెద్దావు మర ణంపట్ల దుఃఖిస్తుంది. తన కన్నపేగే తెంచు కుపోయినట్లు ఏడుస్తోంది.

"ఊకో! మన ఇంట్ల పెద్దావుకు పెట్ట తందుకు ఏం మిగిలిందని ఇంకా మన ఇంట్ల ఉండతందుకు. అయినా పది ఈతలీనింది. ముసలిదయిపోయింది''

"ఏ రోగమో, నొప్పో, ఏ పురుగో కరిసి సస్తే ఇంత కడుపుల మాయ తిప్పకపోను. మేతలేక, నీల్లు లేక మన పెద్దావు సచ్చిందంటేనే కడుపు దేవినట్లవుతున్నది. తాగతందుకు నీల్లు కూడా దొరకని దేశంల మనం బతుకుతున్నం. మన పెద్దావు నీల్లకు, గడ్డికి ఆయిడిసి సచ్చింది'' అంటూ ఏడ్వసా గింది దేవు.

"నువద్దెన. నీల్లు లేక, తిండి లేకనే అది సచ్చింది. ఏం జేస్తం. దానికి తాపతందుకే అగో గా రెండు తోలు తిత్తుల్ల నీల్లు దెచ్చిన. ఇయ్యాల్ల మన మందరం ఒకపూట ఉపాస ముండైన దానికింత కడుపుకు పెడతమనుకు న్న. కాని ఇంతట్లకే దానికి మనకు రుణం తీరిపోయింది. దానికి ఇంక మన అన్నం, నీల్లు బాకీలేమని ఎల్లిపోయింది. ఊకో, నువ్వే డిస్తే పిల్లలు జూడు ఎట్ల పిసపిస అవుతు న్నరో' అంటూ సముదాయించాడు.

ప్రాణం పోయిన పెద్దావును పక్కూరి మాదిగలకు అప్పగించాలని అనిపించలేదు

జంగుకు. వాళ్లు వచ్చి కాలి నరంలకోసి, కాళ్లు కట్టి రెండు కర్రలకు తలకిందులుగా వేలాడదీసి గొర్ర గొర్ర గుంజుకుంటూ తీసుకెళ్లుతుంటే నిన్న కబేళాకు లారీలో పశువులు తరలించినట్లుంటది. పశువును తీసికెళ్లిన మాదిగలు ఊరిబయట దాని చర్మం ఒలుచుకొని కళేబరాన్ని, కుక్కలకు, రాబందులకు, కాకులకు అప్పజెప్తారు. అవి అన్నీ ఆ కళేబరాన్ని పొడుచుకుతింటాయి. తన పెద్దావుకు ఆ దుస్థితి పట్టకూడదనుకున్నాడు. వెంటనే విశాలమైన తన పెరట్లో ఒకమూల నిలువెడు గొయ్యితీసి పెద్దావును అందులో ఉంచి పూడ్చేశాక ఎంతో తృప్తి అనిపించింది జంగుకు.

ఇంట్లో వాళ్లంతా ఆపూట ఏమీ తినలేదు. ఎవరికీ ఏమీ తినాలని అనిపించలేదు.

పడుకున్న దేవుబాయికి ఆకలికి పిల్లలు, మిగిలిన రెండు ఎడ్లు కూడా తమకు దూరమైనట్టు భయంకరమైన కలవచ్చింది. నిదురలోంచి ఉలిక్కిపడి లేచి చూసుకుంటే పిల్లలు హాయిగా నిదురపోతున్నారు. వాకిట్లోకి వెళ్లి రెండు ఎడ్లను చూస్తేగాని దేవుబాయికి మనసు కుదుటపడలేదు. వాకిట్లో రెండు ఎడ్లు పడుకొని మాగన్నుగా , పగలు తిన్నదేదో నెమరు వేసుకుంటున్నాయి. ఎంతకూ నిదురరాని దేవు భర్తను లేపి కల గురించి చెప్పింది. దేవు లేపకముందు జంగుకు కూడా ఏదో కలపడుతూ ఉంది. కలలో తలాతోకలేని భయంకరమైన సంఘటనలు, కలలో తను, తన పిల్లలు, దేవు దిక్కులేని చావు చచ్చినట్టు, మనుషుల ఎముకలకోసం చచ్చినవాళ్లను కూడా నిన్నటి కబేళా బ్రోకరు రసూల్ అందరి శవాలతోపాటు తన, తన భార్యాపిల్లల శవాలను కొని డబ్బులు తన చేతిలోనే పెట్టినట్టు, ఒకపక్క తను శవంగాను, మళ్లీ డబ్బులు తీసుకునే వ్యక్తిగాను తనకు తాను రెండు ఆకారాల్లో పిచ్చి పిచ్చి కల. ఆ కల సంగతేమీ దేవుకు చెప్పలేదు.

దేవు, జంగు గుండెలపై చేయివేసి పడుకుంది. ఎండాకాలం ఆరుబయల నిదుర. వాకిట్లో కట్టేసిన ఎడ్ల మెడలోని గంటలు ఉండీ ఉండీ చిన్నగా లయబద్ధంగా మోగుతున్నాయి.

మేతకు, నీటికి ఇలాగే కట కటగా ఉండే ఈ రెండు ఎడ్లు కూడా దక్కడం కష్టమే. మొండి ప్రేమతో వాటిని తమ గూటాలకు కట్టేసుకొని చంపేబదులు రసూలుకు అమ్మడమే మంచిదనిపించింది జంగుకు. రసూల్ కొన్న అన్ని పశువులు 'అల్ కబీర్'కు పోవుగదా. ఆరోగ్యమైన వాటిని ఇంకా ఎక్కువ ధరకు ఇంకా ఎక్కడో అమ్ముకుంటాడు. అవి ఎక్కడున్నా ఇంత మేతతిని కడుపుకు నీళ్లు తాగి సుఖంగా ఉంటే అంతే చాలు- అనుకున్నాడు జంగు.

నిన్ననే వచ్చారు తమ ఊరికి. మళ్లీ రేపు వస్తారో రారో రసూలు, రసూల్ మనుషులు. అయినకాడికి అమ్మేసి తమ బాధలనుండి కనీసం ఈ ఎడ్లనన్న విముక్తుల్ని చేయాలనుకున్నాడు జంగు. అదేమాట దేవుబాయికి చెప్పటానికి ధైర్యం రాలేదు జంగుకు.

ఉదయం లేచి ఊళ్లో అక్కడా ఇక్కడా కనుక్కుంటే తెలిసింది. రసూల్, రసూల్ మనుషులు పక్కగూడెంకు నేడు వస్తారని, ఎండకాక మునుపే జంగు పక్కగూడెంకు వెళ్లి రసూల్‌ని కలిసాడు. తను తన ఎడ్లబేరం గురించి చెప్పాడు.

"నీ ఎడ్లకేం దాదా! బెహత్రీన్ గున్నయి. రెండు ఎడ్లకు కలిపి నగదుగా వెయ్యిమీద ఇంకొక ఐదునూరు రూపాలిస్తా" అన్నాడు రసూల్.

బేరం కుదిరింది. వెంటనే రసూల్ పదిహేనువందల రూపాయలు లెక్కపెట్టి జంగుకు ఇచ్చాడు. ఈమధ్యకాలంలో పదిహేను వందల రూపాయలు కళ్లజూసి, చేతపట్టి ఎన్నాళ్లయిందో. రూపాయలు చేతిలోకి తీసుకుంటుంటే ఎందుకో సహజంగా అనిపించలేదు జంగుకు. ఇంత కరువులో పదిహేను వందలు చాలా ఎక్కువనిపించాయి. కాని




రసూల్ ఇక్కడ పదిహేనువందలకు కొన్న యీ ఎడ్లజత అల్‌కబీర్‌కు తోలినా మూడువేలు వస్తాయి, కాదని నాలుగంగళ్లు తిరిగి అమ్ముకుంటే ఐదువేలు రాకపోవు- అనుకున్నాడు రసూల్.

డబ్బులు బొడ్లో దోపుకొని ఇంటిదారి పట్టాడు జంగు. కాని ఎట్లెట్ల ఇల్లు దగ్గరవుతుంటే జంగు కాళ్లు అట్లట్ల వేగంగా అడుగువేయలేక పోతున్నాయి. ఏదో అపరాధభావం అతణ్ణి వెంటాడుతోంది. దేవు సాంగత్యం అతడిలో అలాంటి మౌలికమైన మార్పు ఎనాడో తెచ్చింది. కాని కరువు, నీటిఎద్దడి అతణ్ణి ఎడ్లు అమ్మటానికి వివశుణ్ణి చేశాయి.

ఇంటి లోపలకు అడుగుపెడుతుంటే దేవు ఎదురయింది. దేవుబాయితో చూపులు కలపలేకపోయాడు.

గూటాలకు కట్టేసిన రెండు ఎడ్లు తననే కొత్తగా చూస్తున్నట్టనిపించింది. అయిపోయింది. వాటికి తనకు రుణం తీరిపోయింది. రేపో, మాపో రసూల్ మనుషులు వస్తారు, ఎడ్లను తోలుకొని తీసుకుపోతారు అనుకున్నాడు. రసూల్ మనుషులు రాకముందే ఎడ్లను అమ్మిన సంగతి చెప్పాలనుకున్నాడు దేవుకు. కాని ఎలా చెప్పాలో తెలియటంలేదు జంగుకు. చివరకు రోట్లో తలపెట్టి, ఇంతదాకా వచ్చాక రోకటి దెబ్బలకి భయపడుడేంది అన్నట్టు బొడ్లో ధోవతిలో చుట్టిన డబ్బులు తీసి దేవుకిస్తూ.

"ఈ పైసలు పదిలంగ పెట్టు ఎక్కడన్న. రేపు ఇంద్రవెల్లి బోయి తినతండకు నెలగాసం తెచ్చుకుందాం" అన్నాడు గంభీరంగా.

'డబ్బెక్కడిది' అని దేవు అడిగితే ఏ షావుకారు దగ్గరో అప్పు చేశాను అని చెప్పచ్చనుకొన్నాడు అప్పటికప్పుడు.

దేవు అడగనే అడిగింది, "ఇన్ని రూపాలు మనకెక్కడియి'' అని. ఏమయిందో ఎమో! షావుకారు సంగతి మరిచిపోయి "మన ఎడ్ల జతను రసూల్‌కు అమ్మేసిన. నిన్న రాలేఅల్లకు'' అన్నాడు.

"ఆ కసాయి ముండకొడుకులకు ప్రాణంలాంటి ఎడ్లను, ఎంగిలిముద్దలు పెట్టి పెంచుకున్న ఎడ్లను గీ నాలుగు కాగితాలకు అమ్మేసినా! గీపైసలు మన కరువు తీరుస్తయ్. మన పాణాలు నిలవెడ్తయ్'' అంటూ చేతిలోని డబ్బును నేలపైకి విసిరేసింది.

"కన్నపిల్లలసుంటి గా జీవాలను, గా మిషన్‌లతోని కోసే మనుషులకు నీకు ఎట్ల అమ్మబుద్ధయింది. కడుపు చేతపట్టినోడు ఏదన్న అమ్ముకుంటడు. మనం మనిషయి పుట్టినమ్. అది గోజయి పుట్టింది. ఇన్నొద్దులు దినం రాత్రి అవి మనని సాకినయి. ఒక నాలుగొద్దులు మనం అవ్విటిని సాకితే తప్ప'' అంటూ విసవిసా పెరట్లోకి వెళ్లిపోయింది.

"ఒక కాలు లేక కుంటిదాన్నయి ఇంట్లపడి ఉన్న కాని లేకుంటే నేనే ఆటిని సాకుతుంటి. కుంటిముండను ఎటు పోరాదు'' అంటూ ఏడ్వసాగింది.

జంగుకు యింకా విషయాన్ని పొడిగించాలని అనిపించలేదు. అందుకని ఏమీ మాట్లాడకుండ ఊరుకున్నాడు.

అనుకున్నట్టే సాయంకాలం రసూల్ మనుషులొచ్చారు. కాని జంగువారికి ఎడ్లను అప్పగించలేదు. రసూల్ ఇచ్చిన పదిహేను వందల రూపాయలు తిరిగి ఇచ్చేశాడు. డబ్బులు రసూల్ మనుషులకు యిచ్చాకగాని దేవు, జంగుతో మామూలుగా మాట్లాడలేకపోయింది.

ఉదయం మళ్లీ రసూల్ స్వయంగా వచ్చి ఎంతో నచ్చజెప్పాడు. కావాలంటే ఇంకో ఐదువందలు ఎక్కువిస్తా, ఎడ్లను అప్పగించమన్నాడు. కాని జంగు ససేమిరా కాదన్నాడు. వద్దన్నా వినకుండా రెండువేల రూపాయలు జంగు చేతిలో పెట్టాడు. "మా ఇంటిదానికి ఎడ్లమ్ముడు యిష్టంలేదు. అందుకని యీ

పైసలు వాపసు యిస్తున్నా. ఏమనుకోకు రసూల్‌భాయి'' అంటూ చేతులు జోడించాడు జంగు.

డబ్బులు వాపసు తీసుకొని రసూల్ వెళ్లిపోయాడు.

జంగు-నీటికోసం మడుగుకెళ్లాడు. రెండెడ్లను వెంటవేసుకొని ఎక్కడన్న ఇంత ఎండు గడ్డి కనిపిస్తే మేపుకుంటూ మెల్లమెల్లగా మడుక్కుపోతున్నాడు.

వారంరోజులు గడిచాయి.

ఎడ్ల పరిస్థితి ఇంకా దిగజారింది. మేత లేక కండ, కొవ్వు అంతా కరిగిపోయి ఎక్కడ పడితే అక్కడ బొక్కలు తేలాయి.

ఏంచేయాలో తోచనిస్థితిలో ఉన్నారు జంగు. దేవు.

"అప్పుడెప్పుడో తాము యిచ్చే బాకీకింద ఎడ్లు అడిగాడు ఇందరవెల్లి సేఠ్ కిషన్‌చంద్. కాని తాము ఎడ్లు ఇయ్యలేదు. అసలు అట్లనే ఉండే. బాకీ డబ్బులకు వడ్డీ పదేండ్లు కట్టిండ్లు. వడ్డీ కట్టిందే అసలుకు రెండింతలయింది. అంతలోనే పల్లెల్లో, గోండు పల్లెల్లో అన్నలపట్టు ఎక్కువయింది. ఆ సేఠ్ అప్పట్నించి మల్లా వడ్డీ అడగలేదు. అసలు మరిచేపోయిండు.

కిషన్‌సేఠ్ మంచిగ ఉన్నోడే. పది అరకల ఎవసాయం, బట్టల దుకానం, కిరాణదుకాణంలో మంచిగనే ఉన్నడు. పెద్ద కొట్టం, పచ్చిగడ్డి, గడ్డిని సన్నం జేసే మిసిన్. బోరింగ్‌బాయి, అన్నీ ఉన్నయి' అని మనసులో అనుకొని.

'ఇందర్‌వెల్లి కిషన్‌చంద్ సేఠ్, ఇందరవెల్లిలనే ఉంటున్నడా లేక ఎదలాపురంల ఉంటున్నడ" అడిగింది దేవు జంగు భుజంమీద చేయ్యేసి పలకరిస్తూ.

'ఇంద్రవెల్లిలనే ఉంటుండు' అంటూ జంగు బాధతో ముఖం చిట్లించాడు.

దేవు జంగు భుజంమీది బనీను తప్పించి చూసింది. భుజంమీది తోలు తిత్తులతో నీళ్లు మోసి మోసి భుజాలు కమిలిపోయి పుండు పడ్డాయి. దేవు ఇంకో భుజాన్ని కూడా బనీను తప్పించి చూసింది. రెండువైపుల ఒకేలా పుండ్లు పడ్డాయి. ఒకపూట మడుగుకు ఎడ్లను కొట్టుకొనిపోయినా, యింకోపూటకు నీళ్లు తెచ్చి పొయ్యంది కాదు. పరిస్థితి యిలాగే కొనసాగితే ఇంకా కొన్నాళ్లకు ఎడ్లకు గూటాలకు కట్టేసి నీళ్లు పోయాల్సివస్తుంది. మేత లేక రోజూ ఎనిమిదిమైళ్లు నడిచే స్థితిలో లేవు అవి.

జంగు మెల్లగా నిదురలోకి జారుకున్నాడు. దేవు మెల్లగా లేచి అటుకుమీద ఎప్పుడో పడేసి ఉంచిన కర్రకాలును తీసి దుమ్ముదులిపి మూలకు పెట్టింది. దేవుకు ఒక కాలు పోయి, కర్రకాలు వచ్చిన వైనం గుర్తొచ్చింది.

'అప్పుడెప్పుడో ఇందరవెల్లిలో 'జంగ్' జరిగినప్పుడు పోలీసుల బందూకు గోలి తగలి, సర్కారోల్లే దవాఖానాలో షరీక్‌జేసి, గోలి తీయించి, కాలు నరికి, కట్టెకాలు యిచ్చిండ్లు. రోజు యిడుసుడు పెట్టుడు తరాస అని తనే తీసి అటుకుమీద పడేసింది. కట్టె పట్టుకొని నడుసుడే దేవుకు ఇష్టం. కాని దేవు పెట్టుడు కాలు పెట్టుకొని ఇందరవెల్లి పోవాలని అనుకుంది.

ఇందరవెల్లి పోవాలని నిర్ణయించుకున్నాక దేవుకు ఎంతో సంతృప్తి కలిగింది. ఆ రాత్రి హాయిగా నిదురపట్టింది.

తెల్లవారి లేచి చూస్తే జంగు జ్వరంతో మూలుగుతున్నాడు. ఇదీ ఒకందుకు మంచిదే అయింది అనుకుంది దేవు. జంగుకు, పిల్లలకు ఇంత చింతగింజల అంబలి ఉప్పేసి చేసి యిచ్చి, తనూ ఇంత తాగింది.

జంగు జ్వరంతో మూలుగుతూ పడుకున్నాడు.

దేవు కర్రకాలు బిగించుకొని, ఎడ్లు తోలుకొని ఇందరవెల్లి బయలుదేరింది.

ఎడ్లను సరాసరి కిషన్‌చందర్ కొట్టంలోకి






తీసివెళ్లి కట్టేసింది. ఆ పశువుల పాక పశువుల కోసం స్వర్గంలాగుంది. ఇంతెత్తున పేర్చిపెట్టిన జొన్నకర్ర, వరిగడ్డి మిషన్‌లో వేసి కటింగ్‌చేసి గంపలకెత్తి ఉప్పునీళ్లు చల్లిన పచ్చగట్టి, ఇనపగంపలో తడిపి ఉండలు కట్టి తయారుగా ఉంచిన తెలవపిండి ముద్దలు. తాగటానికి సట్టినన్ని చల్లటి బోరింగ్ బావినీళ్లు. పశువుల నాకటానికి వీలుగా వేలాడదీసిన ఉప్పురాళ్లు. అన్నీ చూసిన దేవుకు ఎంతో సంతృప్తి కలిగింది. ఎడ్లను ఒకసారి తనివి దీరా చూసుకొని, కిషన్‌చందర్‌ను కలవటానికి ఇంట్లోకి వెళ్లింది. కిషన్‌చంద్ ఇంటిపక్కన పశువుల పాక.

దేవు వెళ్లేసరికి కిషన్‌చంద్ 'బంగోయిల' కూర్చుని మనమడికి మలాయిపేడ తినిపిస్తున్నాడు.

దేవుబాయిని చూసి కిషన్‌చంద్ ఒక్కసారి ఖంగుతిన్నాడు. దేవుబాయిని ఇందరవెల్లిలో అందరూ ఎరుగుదురు.

ఇందరవెల్లి 'జంగ్'లో చానాళ్లక్రితం ఒక పోలీసును తన కొడవలికిబలియిచ్చి ఆనాటి సంఘటనలో ప్రముఖపాత్ర వహించింది. అందుకని దేవుబాయిని అక్కడ అందరూ గుర్తిస్తారు. గౌరవిస్తారు. కాని దేవు ఇందరవెల్లి 'జంగ్' తర్వాత యివేళ మళ్లీ ఇందరవెల్లి వచ్చింది.

"రాం రాం సేఠ్‌సాబ్!" అంటూ దేవు చేతులు జోడించింది.

బదులుగా కిషన్‌చంద్ లేచి నిలబడి "రాం రాం దేవక్క. ఎంది ఇట్లస్తివి. మాతోని ఏం పనిబడే. పనిఉన్న జంగును పంపకపోయినవ్. నువ్వొచ్చినవ్' అంటూ పలకరించాడు.

"గప్పుడెప్పుడో మీతాట పైసలు తీసుకుంటిమి. కొన్నొద్దులు వడ్డీ కడ్తిమి. మల్ల పైసకు కటకటయి మేం వడ్డి కట్టలేదు. మీలు అడగలే కూడా. అప్పుడు తీసుకున్న వడ్డి కింద, అసలు కింద మా ఎడ్లను మీ కొట్టంల

కట్టేసిన. ఎడ్లను మీరే ఉంచుకోండ్లి. ఇక అవే అసలు అనుకొండ్లి, వడ్డీ అనుకొండి'' ఒంటికా లుమీదున్న దేవు నాలుగు కాళ్ల ధర్మదేవతలా కనిపించింది కిషన్‌చందుకు.

"నేను పైసలెప్పుడు అడగలేదుగద. మా మునీమ్‌గాని, మనిషిగాని మీతాటికి రాలేద్ గద. మల్ల గీ ఎడ్లు మా కిచ్చుడెందుకు. తీస్కున్న బాకీకి పదేండ్లు యాల్ల తప్పకుంట వడ్డీ కట్టనే కడ్తిరి. మల్ల గిదేంది''

"మీలు అడగలే. కాని మా ఇమానం మాకు ఉండాలగద. మందిని ముంచితే మా కేం బర్కత్‌అయితది. అప్పుడెప్పుడో మా ఎడ్లమీద మీకు మనసయింది. కాని అప్పుడు ఏదో మనుసొప్పక మీకియ్యలేదు. ఇయ్యాల్ల మా దినాలు మంచిగ లేవు. ఎడ్ల మేతకు, నీల్లకు కష్టమౌతంది. ఊల్లె మస్తుమంది మిస న్‌మీద కోసెటోల్లకు ఆల్ల గోజలని అమ్ముకు న్నరు. కాని నాకు మనసు సమాధానంకాక ఇట్లచ్చిన. మీ తానయితే పదేండ్లు సుఖం గుంటయి'' అని అంటుంటే దేవు కంఠం రుద్ధమయింది.

దేవు తమ కొట్టంలో కట్టేసిన ఎడ్ల విలువ కిషన్‌చంద్‌కు తెలుసు. ఎంత లేదన్న యీ రోజుల్లో వాటి విలువ ఆరు-ఏడు వేలకు తక్కువుండదు. అలాంటి ఎడ్లజత తన కొ ట్టంలో ఉంటే తన కొట్టంకే అందం అవి. తన దర్పాకు మరో చేరింపు అవి అనుకున్నాడు. ఇన్నాళ్ల వడ్డీ వద్దనుకున్నా, అసలు తీసి మిగతా పైకం దేవుకు ఇద్దామనుకున్నాడు. దేవును కాసేపు ఆగమని చెప్పి తను లోపలి గదిలోకి డబ్బులకోసం వెళ్లాడు.

ఇంతలో ఒక పనిమనిషి వచ్చి దేవుకు ఇంత పెద్ద గ్లాసులో చిక్కటి మజ్జిగ తెచ్చి ఇచ్చింది.

కాసేపటికి కిషన్‌చందర్ రూపాయలు తీసుకొచ్చి దేవు చేతిలో పెట్టబోయాడు.

"వద్దు సేర్‌సాబ్. మిసన్‌లతో కోసే కసా యోల్లకు అమ్ముకోలేక, వాటిని చాదుకోలేక, అన్నం నీల్లున్న తాట యిడిసి పెట్టాలనుకు న్న. దేవుని మారం మీరు గుర్తొచ్చిండు. ఉత్తగిస్తే ఎవలు తీసుకుంటరు. తీసుకున్న అవి సుకంగ ఉంటయని నమ్మకమేంది. నోరులేని జీవాల గోస సూడలేక మీ గూటా లకు కట్టేసిన. అవిటిని మీ కొడుకుల మారం సూసుకొండ్లి సాలు'' అంటూ చేతులు జోడించి, వెనక్కి తిరిగి చూడకుండ వెళ్లిపో యింది.

కిషన్‌చంద్ కళ్లలో ఎక్కడో మూలకున్న కాస్త తడి తన్నుకొచ్చి కండ్లు నిండిపో యాయి.



ఆ గిరిజన గూడెం గూడెమంతా ఆకలితో మలమలా మాడుతోంది. ఇంత కరువు ము నుపెన్నడూ చూడలేదంటున్నారు ఎనిమిదిప దులు దాటిన ముసలివాళ్లు.

అంతా కాలవైపరీత్యం. కాలం ముందటి తీరు లేదు. ఏది వచ్చినా ఎక్కువే.

ఎండాకాలం ఎండలెక్కువ. చలికాలం చలెక్కువ. వానకాలం పడితే అతివృష్టే.

అన్ని కాలాల్లో అన్నీ ఎక్కువే.

పొద్దున లేచింది మొదలు ఒక్కటే ప్రశ్న! ఈ దినం ఎలా గడుస్తుంది? ఎలా గడపాలి? ఏం తినాలి? చేయడానికి పనిలేదు. తినడానికి తిండిలేదు.

మక్కయిత్తులు ఎన్నడో అయిపోయాయి.




జొన్నగటక ఎప్పుడో నిండుకుంది. చిక్కుడి త్తులు తింటానికి ఇంకా మిగల్లేదు. అనుము లు ఈ ఏడు ఎట్లావుంటాయో చూడ్లేదు.

ఆ కాలానికి తినటానికి గింజలు లేక తమకు తెలిసినవన్నీ తినేశారు. గింజలు ఒలుచుకుని తినిపడేసే మొక్కజొన్న కండెల ను దంచి, అంబలి కాచుకొని తాగారు. చింతగింజల అంబలి తాగారు. గునుగు, వెదురు చివుళ్లను వండుకుతిన్నారు. చింతాకు ఉడకపెట్టుకొని తిన్నారు. తికుంటే బలిసాక న్నారు, అదీ చేశారు.

ఉన్న ఎకరా రెండకరాల్లో తోచిన పంటలే సికొని, అనావృష్టితో అప్పుల పాలయ్యారు. ఇంటికి మాత్రం చిన్న గింజ రాలేదు. చేలల్లో పనిలేదు. చేతిలో గవ్వలేదు. దాచుకున్న గింజలేదు. కూడబెట్టిన రూకల్లేవు.

చిన్నా పెద్దా, ముసలీ, ముతకా అందరూ ఏదో ఒక కూలిపని చేయడానికి సిద్ధంగా వున్నారు. కానీ పని ఇచ్చేవాడే లేడు. పని కోసం గూడెం విడిచిపెట్టి కొందరు ఎప్పుడో వెళ్లిపోయారు.

ఎండాకాలం! మూడు పూటలు తిన్నా ఇట్టే అరిగిపోయే కాలం! తీక్షణమైన మధ్యాహ్నం ఎండ తడలు కొడుతోంది. పది గజాల దూరంలో వున్న మనిషి నీళ్లపై బొమ్మలాగా కదిలిపోతున్నాడు. అంత విపరీతమైన ఎండ గా వుంది.

తినడానికి తిండిలేక తాగిన నీళ్లు తాగిన ట్లే చెమటకు ఆవిరైపోతున్నాయి. ఎవరి మొ హంలోనూ, జీవకళ లేదు. కొడికట్టిన దీపా ల్లాంటి కళ్లు.

ఎండుకుపోయి లోపలికంటుకుపోయిన కడుపులు.

పసిపిల్లలు, ముసలివాళ్ల పరిస్థితి మరీ హీనంగా వుంది. ఆ ఎండకు! ఆకలికి తమల పాకుల్లా వాడిపోతున్నారు. చెరుకు గడ ల్లాంటి మనుషులు- చెరువు ఎండిన చేపల్లా గిలగిల లాడుతున్నారు.

దూరంగా పానాదిపొంటి దుమ్ము రేపు కుంటూ ఏదో బండి యమ జోరుగా వస్తోంది.

ఈనాటికీ దుమ్ము రేపుకుంటూ, పొగ చిమ్ముతూ, దడదడమని చప్పుడు చేస్తూ వచ్చే ఏ బండయినా వింతే ఆ గూడెంవాళ్లకి.

చూస్తూండగానే ఆ లారీ వచ్చి గూడెం మధ్యలో ఆగింది. బండి ఆగడంతోనే పిల్లలు బండికి పది గజాల దూరంలో చుట్టూ మూగా రు. కొంతసేపటికి పెద్దలు కూడా బయటకు వచ్చి నిలబడ్డారు. లారీ గూడెంలోకి ఎందుకొ చ్చిందో తెలుసుకుందామని లారీవద్దకు వచ్చారు.

అందరి కళ్లల్లోనూ ఒక్కటే ఆశ!

పెద్దోళ్లు, పెద్దోళ్ల బండ్లు - ఇలాంటి చిన్న గూడేలవైపు ఉత్తినే రావు! ఏదైనా పెద్దపని వుంటేనే తప్ప! పని అంటే ఇక్కడ పైసలు. పైసలతోనే పప్పూ, బియ్యం! డ్రైవరు పక్కన కూర్చున్న మనిషి బండి దిగాడు. అతడే ఆ లారీ ఓనరు. కళ్లకు నల్లటి కళ్లద్దాలు న్నాయి. తలనిండా, బట్టలనిండా లారీ రేపిన ఎర్రటి దుమ్ము వుంది. ఎర్రటి దుమ్ముతో హెూళీ ఆడినట్లున్నాడు అతను.

అక్కడున్న ముసలీ ముతకా మనుషులే కానట్లు మనుషుల జాడకోసం చూస్తున్నట్లు ఒకసారి చుట్టూ పరికించి దూరంగా నిలబడి యిటే చూస్తోన్న ముసలివాణ్ణి ఉద్దేశించి, "అరే ముసలోడా! మీ పడుసు పోరగాండ్లే రిరా? మాదగ్గర సడకు పని ఉన్నది. చే స్తరేమో జర రమ్మని చెప్పు!" అని అన డంతోటే కినాకబాలు తాత ప్రాణం లేచివచ్చి నట్లయింది.

కినాకబాలు అక్కడే వున్న ఒక పెద్ద పోరగాన్ని జబ్బపట్టి పక్కకు తీసుకుపోయి "అరేయ్ సుంగూ! మన మేస్రం జంగుకాకా ఆళ్ల యింటెనక యాపచెట్టుకింద గొడ్డలి నూ రుకుంటున్నడు. జర పోయి తాత రమ్మంటు న్నడని బిరాన పోయి పిల్చుకరా పో! ఇక్కడు న్నట్లే పోయి రావాల! ఆం" అంటూ ఆ

పిల్లాణ్ణి పరిగెత్తించాడు.

ఆ పిల్లాడు సారించి వదిలిన బాణంలా ముందుకు దూసుకుపోయాడు. మేస్త్రం జంగు చాక్‌తరస్ చేసి అరిగిపోయిన గొడ్డళ్లని నున్నగా ధారపడ్తున్నాడు. ఇంతలోనే బాణంపుల్లలాగా ప్రత్యక్షమయ్యాడు తాత పంపిన పిల్లాడు.

"కినాకబాలు తాత రమ్మన్నడు బేగి!" అనడంతో బయలుదేరాడు జంగు.

లారీముందున్న వ్యక్తిని చూడగానే గుర్తించాడు మేస్త్రం జంగు. ఈ కంట్రాక్టర్ శ్యాంపూర్‌లో పెద్ద సేఠ్. రకరకాల వ్యాపారాలు, కంట్రాక్టులు చేస్తాడు. ఇలాంటి సేఠ్‌లు శ్యాంపూర్‌లో చాలామందే వున్నారు. పది, ఇరవై ఏళ్లకింద భుజంమీద తువ్వాలేసుకొని చేతిల సంచి పట్టుకొని నల్గొండ, కరీంనగర్‌వైపునుండి వలస వచ్చిన ఈ మనుషులు నేడు లక్షల్లో వ్యాపారం చేసే షావుకార్లు!

జంగుని చూడటంతోటే "ఏంరా! నువ్వే నా యిళ్ల తరపు మనిషివి. మాదగ్గర రోడ్డు పని వున్నది. లేబర్ కావాల. ఎంతమంది అచ్చినా పని వున్నది. రోజుకు పది రూపాలిస్తం. ఆడదానికంతే మొగోనికంతే! యిష్టమైతే లారీ ఎక్కుండ్రి!" అన్నాడు కంట్రాక్టర్.

"పని లేకనే రికామున్నాం. గూడెంల ఇంటికి ఒకరిద్దరు అస్తరు. కాని కైకిలే తమామ్ పది రూపాలంటే పడది సార్! మొగోనికి 20 రూపాలు, ఆడదానికి 15 రూపాలు మీ పొలంల పని జేసినప్పుడు నువ్వే యిస్తివి!"

"అవురా! అప్పుడు నాకు అక్కెరుండె. మీరు ఆడించినట్లు ఆడిన. పని ఎక్కువుండె. మంది తక్కువుండిరి. ఇప్పుడట్ల కాదు. నా తాన పనున్నది. మీకు పనిలేదు. పది రూపాలకైతే రండ్రి! లేకుంటే లేదు! పది మాటలద్దు! ఖటాఖట్! ఒక్కటేమాట!"

"గట్లంటే ఎట్ల సార్! మీరు పని ఇచ్చెటోల్లు! మేం జేసెటోళ్లం. మీరే మా ఆదరమానం తమామ్ పది అంటే ఎట్ల?" అన్నాడు కినాక బాలు తాత.

"ఆరునెల్లకింద నా అక్కర యాల్లకు మీరు ఇంత ఇస్తే జేస్తమని నన్ను అప్పుడు బొంద వెట్టలేదా? అందరికీ యాల్ల అస్తది!"

మేస్త్రం జంగు ఏమీ అనడంలేదు.

వింటున్నాడు! ఆలోచిస్తున్నాడు! అంతలోకే మేస్త్రం జంగు ఈడు మనిషే జైతు అందుకున్నాడు.

"అప్పటి సంగతి మనుసుల వెట్టుకొని ఇప్పుడు మా కూలి తక్కువ జేస్తనంటే ఎట్లా సేరూ! మేం ఏమీ ఎక్కువడగలేదు. ఇల్లిడిసి పెట్టి రావాలె! ఎండలో పని! తిండికి, నీళ్లకు ఎంత తిప్పలు మాకు. మీరే జర యిచారం జేయుండ్రి!"

"మీరు కాదంటే ఇప్పుడే లారీ బంపి పాలమూరు లేబర్ జన్నారంల ఉన్నారంట! పిలిపిస్త! నాకు పని అర్జంటు కావాల! పది రోజులల్ల సి.యం. ప్రోగ్రామ్ ఉన్నది. ఖటాఖట్ జెప్పుండ్రి!" అని తొందరచేయసాగాడు.

లేబర్‌కోసం కంట్రాక్టర్ వచ్చాడని తెలిసి ఒక్కొక్కరే పోగవుతున్నారు.

"తమామ్ మా పొట్టలమీద గొడ్తే ఎట్ల సార్! జర మా పోరగాండ్ల మొకం జూడుండ్రి. ఎనిమిద్దివసాలవుతున్నది మూడు పూటలా రొట్టె దిని!"

"మా రెక్కల కష్టమే అడుగుతున్నం. గంతకన్న ఏమెక్కువడుగుతాం. పది రూపాయలకు ఇయ్యాళ ఏమస్తది. ధరలు జూస్తే అగ్గితీరుంగున్నయి. చేండ్ల కైకిలి తప్ప ఎన్నడన్న గిట్ల యింకో కూలిపని జేసినోళ్లమా! గని ఏం జేస్తాం. మా కిస్మత్ గిట్లున్నది? ఏం జేస్తం?" అన్నాడు కినాకభీము.

"పది మాటలెందుకు! పంచాయతీ ఎందుకు! నేను పది యిస్త! వస్తే పనికి రండ్లి. లేకుంటే లేదు!" అని తెగేసి చెప్పాడు కంట్రాక్టర్.




"మరీ గంత ఇదయితే ఎట్ల సారూ! నీ మాటగాదు మా మాట గాదు, ఆడదానికి పది మొగోనికి పదిహేను రూపాలియ్యుండ్రి చాలు! ఇంటికిద్దరు అస్తరు!" అన్నాడు కినాకబాలు!

"అందరికీ పదే! వస్తే రండ్రి! లేకుంటే లేదు! పనిగావాలంటే నేనన్న రేటుకు ఉట్నూరుకు రండ్రి! పని జూపిస్త, మీరు రేపటిదాక రాకుంటే నేను ఎల్లుండి జన్నారం బోయి కూలోల్లను దెచ్చుకుంట!" అని చెప్పి "నడు రసూల్! బండి చాల్‌జెయ్యి!" అంటూ డ్రైవర్‌కు చెప్పి బండెక్కాడు.

చూస్తూండగానే బండి దుమ్ములో కలిసి దూరమైపోయింది.

పడుచువాళ్లు, నడియీడువాళ్లు, ముసలివాళ్లు వాళ్లల్లో వాళ్లు తర్జనభర్జన చేసుకుంటున్నారు. చివరకు అందరూ రేపు ఉట్నూరుకు పనిలోకి వెళ్లాలని నిర్ణయించుకున్నారు. పది రూపాయలకే దినమంతా పనికి గతిలేక ఒప్పుకున్నారు.

జంగు ఏమీ మాట్లాడలేదు.

వింటున్నాడు.

చూస్తున్నాడు. ఆలోచిస్తున్నాడు. తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

అతన్ని వెదుక్కుంటూ వచ్చిన దేవుబాయి జంగు భుజాన్నానుకొని నిలబడింది. జంగు మొహంలో మారుతోన్న రంగుల్ని, ఆలోచనలని స్పష్టంగా చదువుకొన్నది. జంగువైపు మెచ్చుకోలుగా చూసి గూడెంవైపు వెళ్లిపోయింది.

జంగు అలాగే గొడ్డలి పట్టుకొని గూడెంనుండి అడివిలోకి వెళ్లే తోవపై సాగిపోతున్నాడు. అతని మొహం పైన నిప్పులు కక్కుతున్న సూర్యుడిలాగుంది!

పొద్దు తల్లి కడుపున పడుతున్న సమయాన జంగు గూడేనికి తిరిగి వచ్చాడు.

  

మేస్రం జంగు తుడుం మోగిస్తున్నాడు!

తుడుం చప్పుడు చుట్టుపక్కల మూడు మైళ్లవరకు స్పష్టంగా విన్పిస్తోంది!

గిరిజన గూడేలు తుడుం చప్పుడుకి తుళ్లిపడి లేచాయి! ఏ ఆపద ముంచుకొచ్చిందోనని అందరూ చేతికందిన బరిశెలూ, ఈటెలూ, విల్లమ్ములూ, కర్రలూ, కత్తులూ అందుకొని తుడుం మోగిన దిక్కుగా కదిలిపోయారు.

అంతసేపూ ఒక్క తీరే తుడుం మోగించినందుకు జంగు తడిసి ముద్దయ్యాడు. చూస్తూండగానే వందల సంఖ్యలో జనం పోగయ్యారు. చుట్టుపక్కల వున్న గిరిజన గూడేలన్నీ బిలబిలమంటూ తరలి వచ్చాయి.

తుడుం మోగించడం వారి రహస్య సంకేతం! తుడుం చప్పుడు విన్న ఏ గిరిజనుడు స్థిమితంగా వుండడు! ఏదో పెద్ద ఎత్తున ప్రమాదం ముంచుకొస్తే తప్ప, లేదా యావత్ గిరిజన జాతి ఒక్కచోట అత్యవసర సమావేశం కావాలనుకుంటే తప్ప తుడుం మోగించరు.

తుడుం ఒక వాయిద్యమే కాని - వినోదానికి కాదు!

తుడుం ధ్వని - ఒక సంకేతం!

తుడుం - ఒక ఉత్తేజం!

తుడుం - ఒక ఉద్రేకం!

తుడుం ధ్వనికి స్పందించని గిరిజనుడుండడు! తుడుం ధ్వనికి, గోండు పరదాను, నాయకపోడు, కొలాం అందరూ ఒక్కటే! గిరిజనులే!

ఎంతో ఆవేశంగా ఆయుధాలతో పరుగెత్తుకొచ్చిన వాళ్లందరినీ ఉద్దేశించి 'అందరికీ రాంరాం!' అంటూ మొదలుపెట్టాడు మేస్రం జంగు.

"చేతుల పనిలేక తిండికి గింజలేక మన అవస్థలు మనం పడుతుంటే ఇయ్యాళ పొద్దుగాల ఉట్నూరుకెల్లి కంట్రాక్టరు వచ్చిండు

మన ఆకలిని, మన దిక్కు లేనితనాన్ని ఆసరాగా చేసుకొని లక్షల పని వేయిలల్ల జేయించుకుందమని చూస్తున్నడు! ఆకిరికి పదిహేను రూపాల కూలికి గూడా ఒప్పుకోలేదు.

ఒకనాడు 'పోడు' జేసుకొని బతికినోళ్లం! రాజ్యాలు గెలిసి, రాజరికాలు జేసినోళ్లం. మనకు గియ్యాళ ఎంత గతి వట్టిందో జూడుండ్లి! అందరూ ఆలోచించుండ్లి! మన భూములేమయినయి? మన పంటలేమయినయి? మనం ఇయ్యాళ ఆళ్ల మోచేతికంద నీళ్లు తాగాల!..." అని ఇంకా చెప్తుండగానే దేవుబాయి అందుకున్నది,

"ఆర్నెల్లకింద 'అక్షరజ్ఞానం'తో మనం సదువు మొదలు బెట్టినం. మనకు అన్యాయం జరిగితే అడగాల. ఎదురు తిరిగి అడగాల. ఆడా మగా అందరం సమానం అని సదువుకున్నం... పని చేస్తం... పని ఈయండి! అని సదువుకున్నం!"

వెంటనే జంగు ముందుకొచ్చి

"పని ఈయరు! ఇచ్చినా ఎంత పనికి అంత కూలి ఈయరు. ఆడ, మగా తేడా లేకుండా కూలి ఇయ్యరట! అందుకని మనందరం రేపు శ్యాంపూర్ బోవాల! అప్పుడే చూసుకుందాం!" అని ఆవేశంగా అన్నాడు.

"రేపెందుకు ఇప్పుడే కదులుదాం! నడిరాత్రికి శ్యాంపూర్‌లో ఉంటం" అంతకంటే ఆవేశంగా అన్నారు కొందరు కుర్రకారు యువకులు.

"వద్దు! ఇప్పుడు వద్దు! రాత్రికి ఊర్లమీద పడేది దొంగలు! మనం దొంగలం కాము! మనమెవరికీ భయపడేది లేదు, పగలే వెళ్దాం! రేపు చుక్క పొడుస్తుంటే మనం శ్యాంపూర్‌కి పోదాం!" అన్నాడు జంగు.

పోదాం! అంటే పోదాం! అవును అంటే అవును! అని అనుకున్నారందరూ!

★ ★ ★

తూరుపు ఆకాశం చీకటిమీద దాడికి వెళుతున్నట్లు జనం చేతుల్లో కత్తులు, ఈటెలు, కొడవళ్లు, కర్రలు.

అన్ని రోజుల ఆకలేమయిందో అందరి కదలికల్లో ఆవేశం!

శరీరంలోని నిస్త్రాణం చేతిలోకి ఆయుధం వచ్చేసరికి తొలగిపోయినట్లుంది.

గూడెంలో పసిపిల్లలు, ముసలివాళ్లు మాత్రమే మిగిలారు!

మిగిలినవాళ్లందరూ చావో, బతుకో తేల్చుకుందామని కదిలారు!

పైస లేక-

పని లేక-

తిండి లేక-

చచ్చేకన్నా ఏదో ఒకటి చేసి ప్రాణాలు నిలుపుకోవాలని అందరి ఆరాటం! మనిషి మనుగడ కాపాడుకోవాలంటే ఏదో ఒకటి చేయాలి!

కదలాలి - కదిలించాలి.

పెనునిద్దర వదిలించాలి!

వందలమంది గోండులు, కొలామ్‌లు, ప్రధానులు, నాయకపోళ్లు, అందాలు, తోటీలు... ఇలా గిరిజనులు ఎందరో మంది కొండలా కదిలిపోతుంటే పగబట్టిన పాము వెంటబడినట్టుంది.

వేసవి ఎండకు వేడెక్కిన ఆ ఊరు ఉదయం వీచే చల్లగాలులకు ఆదమరచి నిద్రపోతోంది. నిద్రలో వున్న ఆ ఊరు!...

ఒక్కసారి గిరిజనుల వేటుతో... ఉలిక్కిపడి లేచింది!

ఆ ఊళ్లో రెండు మూడు వందల ఇండ్లలో మోతుబరి కుటుంబాలే ఎక్కువ. చాలా మంది వృత్తి వ్యాపారం ప్లస్ వ్యవసాయం. కొంతమంది కంట్రాక్టర్లు. కొంతమంది కమీషన్ ఏజెంట్లు.

గుంపులు గుంపులుగా విడిపోయిన గిరిజ





నులు బడా బడా వ్యాపారుల ఇండ్లల్లో ప్రవేశించారు!

ఆరుబయట వాకిళ్లలో డాబాలపై పడుకున్న వాళ్లను లేపి మరీ ఇళ్ల తాళాలు తెరిపించారు. వాళ్లు చూస్తూండగానే తిండిగింజలు, వంటసామాగ్రి అంతా ఎవరికి వారు తమకు తోచినట్లు మూటలు కట్టుకున్నారు.

చూస్తూండగానే గొప్పవాళ్లు, పెద్దవాళ్లు, ధనవంతులు అనుకునేవారి ఇంట్లో ఒక గింజ కూడా మిగలకుండా గిరిజనుల భుజాలపైకి చేరిపోయాయి.

చక్కెర, చాయ్‌పత్తి, కిరోసిన్... ఎవరింట్లో ఏమీ మిగలలేదు. కిరాణా షాపుల్లోనూ ఏమీ ఉంచకుండా ఊడ్చేశారు.

మూకుమ్మడిగా ఆయుధాలతో యింట్లోకి ప్రవేశించిన గిరిజనులను చూడగానే రంగయ్య సేర్ పై ప్రాణం పైనే పోయినట్లనిపించింది. అవాక్కయి చేష్టలుడిగి చూస్తుండిపోయాడు.

ఎవరు ఏం చేస్తున్నారో రంగయ్యకు అర్థంకాలేదు! ఇంట్లో ఎటు చూస్తే అటు జనం.

అందులోనుండి ఎవరు కూడా ఇంట్లోని ఆడవాళ్లపై ఉన్న బంగారంజోలికి వెళ్లడంలేదు. వంటింట్లో స్టోర్ రూములో ఉన్నవాటినే మొత్తం మూటలు కట్టుకున్నారు.

మూటలు కట్టడానికి ప్రత్యేకంగా వాళ్లేం తెచ్చుకోలేదు. ఒంటిపై కప్పుకొచ్చిన దుప్పట్లలో మూటలు కట్టారు.

ఖరీదయిన టీ.వీ., వి.సి.ఆర్., కూలర్, వాషింగ్ మెషీన్ ఇవేమీ ముట్టుకోలేదు. చూస్తూండగానే ఇల్లు ఒక ఇరవై నిమిషాల్లో తినడానికి గింజ లేకుండా దోచుకోబడింది.

ఆడవాళ్లు, పసిపిల్లలు సైతం గట్టిగా మాట్లాడటానికి సాహసించలేకపోయారు. ఏమవుతోందో అర్థమయ్యేలోగా అంతా అయిపోయింది!

ఇది ఏరకం దోపిడో రంగయ్యకు అర్థం కాలేదు! పోలీసులకు ఫోన్ చేయాలనే ధ్యాస కలుగలేదు. ఆరు కిలోమీటర్ల దూరంలోనే పోలీసు స్టేషన్ ఉంది. అక్కడే బి.యస్.యఫ్. బెటాలియన్ ఉంది. కానీ ఎందుకో ఆ సాహసం చేయలేకపోయాడు.

జంగు, దేవుబాయి రంగయ్య యింట్లో చొరబడిన గుంపులోనే వున్నారు.

"మనం బతకతందుకు ఏం గావాల్నో అవ్వే తీసుకోండ్రి. యింకేం ముట్టద్దు!" అంటూ ఒక యువకుడు మధ్యమధ్యన గుంపును హెచ్చరిస్తున్నాడు. చూడబోతే చదువుకున్న వాడిలాగే ఉన్నాడు.

ఆ యువకుడి పేరు కొమురం మహదు. వయసు ఇరవై ఒకటో, రెండో సంవత్సరాలుండొచ్చు. విశాలమైన మందంగా వుండే నుదురు, చప్పిడి ముక్కు, లావుపాటి పెదవులు, పలుచని కనుబొమ్మలు, మోటుగా వుండే బుగ్గల్లోని ఎముక అతడు గోండుయువకుడని స్పష్టంగా తెలుస్తోంది.

మేస్రం జంగు, దేవుబాయి, కోట్నాక భీము, కినాకబాలు, జైతు, సుంగు... అందరి ముఖ కవళికలూ ఇలాగే వుంటాయి.

గోండు యువకుడైనా మహదు కళ్లల్లో చదువుకున్న తెలివి వుంది. మాటల్లో స్పష్టత, గంభీరత వున్నాయి.

ఒక్కో ఇంటికి ఒక్కొక్క దళంగా విడిపోగా రంగయ్య ఇంటికి వచ్చిన దళంలో ముగ్గురున్నారు. జంగు, దేవుబాయి, మహదు.

"కష్టపడి పనిచేస్తాం అంటే పదిహేను రూపాలు ఈయటానికి అంత ఇదయి పోయి పది రూపాలే ఇస్తానన్నది, నువ్వేనా?" అంటూ మహదు రంగయ్యను గద్దించి అడిగాడు. అలా అడుగుతుంటే మహదు కుడిచేతిలోని ఈటె ఎడమ చేతికీ, మళ్లీ ఎడమ చేతినుండి కుడి చేతికి అసహనంగా మారుతోంది.

ఈటె అసహనంగా కదలడం చూసిన

రంగయ్యలో ప్రాణభయం పట్టుకుంది.

ఇంత నిర్భయంగా దోపిడీకి పాల్పడి, దర్జాగా ప్రశ్నలడుగుతూవుంటే వచ్చింది 'అన్నలే' అని నిర్ణయించుకున్నాడు రంగయ్య. అందుకని ఏమీ మాట్లాడలేకపోయాడు.

"కాంట్రాక్ట్ పనులతో, మా చెమటతో నువ్వు ఎంతోడివి అయినవో మాకు దెల్వదా? నువ్వు సంపాదించుకున్న లక్షలు అడగలేదు మేం. న్యాయమైన కూలి మాత్రమే అడిగిండ్రు మావాళ్లు. రోజుకు పదిహేను రూపాలు! గది నీకు ఎక్కువయిందా? ఆ పదిహేను రూపాల్లో ఒక్క పూట గడవడమే కష్టమనుకుంటే యింకా నువ్వు పదే ఇస్తావా? ఈ బంగ్లా, నీ భూములు, నీ వ్యాపారాలు, నీ డబ్బు, నీ బంగారం, నీ కంట్రాక్టులు అన్నీ మా గిరిజనులను దోపిడీ చేసి ముంచి మోసంచేసి, సంపాదించినయని మాకెర్కలేదా?"

"అయింది అయిపోయింది. ఇగ పోనీయుండ్రి! పదిహేను రూపాలిస్తా! ఎంత మందినంటే అంతమందిని పనికి పంపు, నన్నిడిసిపెట్టుండ్లి! మా ఆడోళ్లు, పిల్లలు పరేషానవుతున్నరు. ఇంక మీరెల్లిపొండ్రి! మీకు దండం బెడ్తా!"

"నిన్నటిదాకా మేం దండం బెట్టినము, నువ్వు ఛూ అన్నవు! అంతేనా! ఇప్పుడు నిన్ను పదిహేను రూపాలడగతందుకు రాలేదు! ఒక మనిషికి ఒక రోజుకు కైకిలి ఎంత ఇవ్వాలనో మీరే నిర్ణయించాల! అది ఇరవై అయిదుగానీ, యాభయిగానీ.

"ఇరవై అయిదిస్త! మీరు చెప్పినట్లు జేస్త. నన్నిడిసిపెట్టుండ్రి!" అంటూ అంతవరకూ గంభీరంగా ఉన్న రంగయ్య పసిపిల్లాడిలా ఘొల్లుమన్నాడు.

అతన్ని చూసి అతని భార్యాపిల్లలు అతడికి తోడయ్యారు! పళ్లు తోముకోవడానికి పళ్ల పొడి లేదు. అన్నీ ఊడ్చి పట్టుకుపోయారు.

చూస్తుండగానే పది గంటలయింది.

ఆ వూరు పెద్దదేం కాదు! కాని పెద్దలుండే ఊరు.

కిరాణా దుకాణాలు, బట్టల షాపులు, చెప్పుల దుకాణాలు, చౌకధర దుకాణం అన్నీ ఊడ్చినట్లయినాయి.

వచ్చేటప్పుడు వందల సంఖ్యలో వచ్చారు ఊకుమ్మడిగా పది ఇరవై గూడాలు కలిసికట్టుగా.

వచ్చిన పని అయిపోవడంతో ఎవరి దారిన వారు వెళ్లిపోయారు. అందరికి కొన్నాళ్లకు సరిపడే తిండిగింజలు, బట్టలు, చెప్పులు దొరికాయి.

పదకొండు గంటలు కావస్తూంది.

దోపిడీకి గురయిన ఏ ఇంట్లో కూడా ఇంకా పొయ్యి వెలగలేదు.

పొయ్యి వెలిగించడానికి అగ్గిపుల్ల కూడా మిగలలేదు. అప్పటికే ఒకసారి టిఫిన్, మూడుసార్లు టీ తాగే ప్రాణాలు విలవిల్లాడుతున్నాయి.

దోపిడీ చేసి కూడా ఇంకా ఎందుకు వీళ్లు వెళ్లకుండా ఉన్నారో రంగయ్యకు అర్థం కావడంలేదు.

పిల్లలు ఆకలి, ఆకలీ అని అల్లాడిపోతున్నారు. తినడానికి తిండి లేదు. వండడానికి గింజ లేదు.

"చేతుల్లో సత్తువ తప్ప మాదగ్గర ఎప్పుడు ఏముందని!" అన్నాడు జంగు.

"ఈ టీవీ, కూలర్, ఫ్రిజ్, ఈ వీసీఆర్ నీ కడుపు నింపవా?" అన్నాడు మహదు.

"ఆకలంటే మీకేం ఎరుక! అన్నమంటే మీకేం ఎరుక! మీ పెద్దలోకులకు తెలిసిందల్లా ఒక్కటే! డబ్బు సంపాదించడం! మా పొట్టలు గొట్టి మీ ఇల్లు నింపుకునుడు తెలుసు!" అంది దేవుబాయి.

"నిన్న నువ్వు మాకు యివ్వనన్న పదిహేను రూపాయలు నేను నీకు యిస్తా! చూస్తా మీ యింట్లో నువ్వూ నీ భార్యా నీ యిద్దరు బిడ్డలు 15 రూపాల్లో ఏం గొనుక్కొని







తింటారో!" అంటూ 15 రూపాయలు రంగయ్య చేతిలో పెట్టాడు మహదు.

ఇదేం పరీక్షో అర్థం కాలేదు రంగయ్యకు. అంతసేపూ మౌనంగా ఉన్న రంగయ్య సేర్ భార్య కళ్లు ఒత్తుకుంటూ ముందుకొచ్చింది.

"మీకు దండం బెడత. సేర్‌ను వదిలి పెట్టుండి. కావాలంటే మా ఇంట్లో ఉన్న పైసలు బంగారం తీస్కొని మమ్మల్ని యిడిసిపెట్టుండ్రి!" అంటూ చేతులెత్తి దండంపెట్టి బతిమాలసాగింది.

"మా నాయనను ఏమీ అనకండి! మా పైసలు, బంగారం అన్నీ దీస్కొని ఎల్లిపోండ్రి!" అంటూ తల్లికి వంతపాడారు ఇద్దరు పిల్లలు.

"మీ బంగారం, మీ పైసలు ఎవడిగ్గావాలె! కావాలనుకుంటే అవి ఎప్పుడో తీసుకునేటోళ్ళం. మాకు అవేం వద్దు. ఈ పదిహేను రూపాయల్లో మీరు ఇయ్యాళ నలుగురు వండుకొని, కడుపునిండాగాకపోయినా సగం కడుపుకు అయినా తిని చూపించుండ్రి! చాలు! మేం ఎల్లిపోతం! గంతే!"

పెళ్ళాం పిల్లలు ఎలాగో సేర్‌ను ఒప్పించారు. ఆ పదిహేను రూపాయలు తీస్కొని పక్క ఊరి సంతలకెల్లి సామాన్లు తేవడానికి సేర్ భార్య లిస్ట్ వ్రాసి ఇచ్చింది.

బియ్యం అరకిలో- 5.00
పప్పు పావుకిలో- 4.50
చింతపండు యాభైగ్రాములు- 1.00
నూనె యాభైగ్రాములు-2.00
కూరగాయలు ఏదో ఒక్కటే-5.00
ఉప్పు, కారం, ఎల్లిపాయ, ఉల్లి- 2.00
చిల్లర దినుసులు 2.00

రంగయ్య ఉరుకులు పరుగులమీద 15 రూపాయలు తీస్కొని ఇంట్లోంచి బయట పడ్డాడు. సంత నాలుగు కి.మీ. దూరంలో ఉంది. బస్ ఎక్కిపోయాడు. రూపాయిన్నర

బస్‌కు పోను ఇంకా 13-50 మాత్రమే వుంది.

భార్య చెప్పిన దినుసులు ఎట్లా కుదించి నా అనుకున్నవి రావడం లేదు. కిలో బియ్యానికి బదులు కిలో నూకలు తీసుకున్నాడు. అప్పుడు సరిపోయింది లెక్క. కానీ చేతిలో గవ్వ మిగలలేదు. చాలా సేపు కష్టపడి నడిచి ఇల్లు చేరేసరికి తడిసి ముద్దయ్యాడు.

కాలినడకనే బయలుదేరాడు రంగయ్య కాబట్టి ఆలస్యం అయిపోయేసరికి భార్యా పిల్లలు ఆకలితో నకనకలాడిపోతున్నారు.

అతడి రాక ఆలస్యం కావడంవల్ల రకరకాల ఊహాగానాలు చేశారు అతడి భార్యా పిల్లలు. రంగయ్య ఉట్నూర్ పోలీస్ స్టేషనుకు గాని వెళ్ళాడా? రంగయ్య అలాంటి తెలివితక్కువ పని చెయ్యడని అతడి భార్య తనకుతానే సర్దిచెప్పుకుంది.

రంగయ్యను చూసేసరికి ఆమె ముఖం ఆకలితో వున్నా కొద్దిగా వికసించినట్లనిపించింది. నీరసంగా వున్న పిల్లలూ కొద్దిగా ఉత్సాహం తెచ్చుకున్నారు.

పదిహేను రూపాయలతో తెచ్చిన సరుకులు సంచిలో ఏ మూలకో పోయాయి. సంచిలో బియ్యం బదులు నూకలని చూసిన సేర్ భార్య కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి.

"ఒక రోజుకు మీ ఆయన మాకిచ్చే పదిరూపాయలకు గిసుంటి నూకలు కూడా రావని మీకు ఇప్పుడు తెలిసిందా?" అంటూ దెప్పిపొడిచింది దేవుబాయి.

ఆ నూకలు నలుగురికి రెండు పూటలా సగం కడుపుకి కూడా సరిపోయేలా లేవని కళ్ళతోనే కొలిచి చూసింది దేవుబాయి.

తల్లీ, ఇద్దరు పిల్లలు చకచకా పనిచేస్తున్నారు. ఒకరు నూకల్లోని రాళ్ళను గాలిస్తున్నారు. ఒకరు చింతపండు పులుసు చేస్తున్నారు. యింకొకరు పొయ్యిమీద వెయ్యడానికి పప్పు నానబెట్టి కూరలు తరుగుతున్నారు.

పొయ్యి వెలిగించడానికి అగ్గిపెట్టెలేదు. తేవడానికి డబ్బుల్లేవు.

అర్థం చేసుకున్న జంగు అగ్గిపెట్టె యిచ్చాడు.

మొత్తానికి వంట ముగించారు!

"రండి! మీరు కూడా మాతోనే తినుండ్రి!" అంటూ ఆప్యాయంగానే పిలిచింది సేర్ భార్య.

"ముందు మీరు కానీయుండ్రి! ఆకలికి ఓర్చుకునుడు, ఉపాసముండుడు మాకేం కొత్తకాదు!" అంది దేవుబాయి.

మొహమాటంగానే సేర్, అతని భార్యా, పిల్లలూ ఒక్కసారే భోజనానికి కూర్చున్నారు. ఆకలి మీదున్నారేమో ఆవురావురంటూ తింటూ వున్నారు. అన్నం మధ్యలో ఇసుకరాళ్ళు పంటికింద కలుక్కుమంటూ బాధపెడ్తున్నాయి.

"పప్పు- దాదాపు నీళ్ళలాగే వుంది''

చారు నీళ్ళయినా ఏ గుభాళింపూ లేదు! నెయ్యి లేదు! పెరుగులేదు! పచ్చడిలేదు! అప్పడం లేదు!

అయినా ఆకలి మీదున్నారేమో- బాగానే తిన్నారు.

అందుకే అంటారు- ఆకలి రుచెరుగదు- నిద్ర సుఖమెరుగదని!

నలుగురు తిని లేచేసరికి, అన్నం అంతంత మాత్రమే వుంది. ఒక పసిపిల్లాడి కడుపు నింపుతుందేమో మహా అయితే! పప్పు పూర్తిగా అయిపోయింది. పులుసు కొద్దిగా వుంది. కూర మొత్తం అయిపోయింది.

"మీ భోజనాలు అయిపోతే, ఇగ మాకు పెట్టుండి!" అని కూర్చున్నారు మహదు, జంగు, దేవుబాయి.

వంటలులేవని ఎలా చెప్పాలో సేర్‌కు, సేర్ భార్యకు అర్థం కాలేదు. ఆ వండిన వంట నలుగురికి కూడా సరిపోదని మహదుకు ముందే తెలుసు.





"అర్థమయిందా సేర్! ఇంట్లో ఆడది. మగాడు ఇద్దరూ మీ పనిలో పొద్దంతా కష్టప డితే మీరిచ్చే కూలి వాళ్ళ రెండు పూటలా తిండికే సరిపోతయి. ఇంకా మా కొచ్చేరోగం నొప్పికి, పండుగ పబ్బాలకూ, బట్టలకూ మేం ఎక్కడికెల్లి తెస్తం! జర సోచాయించు సేర్!" అన్నాడు మహదు.

"మేం గుడిసెల్లో వున్నాం! మీరు బంగ్లా ల్లో ఎందుకున్నారని మేం అడగం! మా చమటతో మీరు యింత పెద్దోళ్ళయింద్రని మేము దెప్పిపొడవం. మాకు మీకున్నట్లు సుఖాలు కావాలని అడగం. మేమనేది ఒకటే. మమ్మల్ని కాస్త అటూ ఇటూగా ఇట్ల బతకని చ్చి మీరు హాయిగా బతుకుండ్లి!" అన్నది దేవుబాయి.

"ఒక మనిషి రెక్కల కష్టంలో అతడి ఇంట్లో ముగ్గురు రెండు పూటలా కడుపు నిండి, గటక పప్పో- రొట్టెకారమో ఏదో ఒకటి తృప్తిగా తినేట్టు ఉండాలి, మీరిచ్చే కూలి! కనీసం కడుపు నింపాలి!" అన్నాడు జంగు.

"ఇయ్యాళ జరిగింది రేపు జరగకుండా సూస్కోండి. ఎంత ఇస్తే మంచిదో మీ సేర్‌లు, సావుకార్లు కలసి కూసోని మాట్లాడుకోని రేపు పనికి పిలువుండ్రి! పనికి తప్పకుండా వస్తం!" అంటూ సేర్ ఇంట్లోంచి బయటకు నడిచారు మహదు, జంగు, దేవుబాయి.

సేర్‌భార్యా పిల్లలూ అలాగే చూస్తుండిపో యారు!

సేర్ ఆలోచనల్లోపడ్డాడు!

★ ★ ★

గిరిజన గూడాల్లో జనంలో ఉండే ముఖ్య మైన అవలక్షణం అజ్ఞానం, అవిద్య. తమ మాతృభాష తప్ప మరొకటి రాని, వచ్చినా మాట్లాడని మూర్ఖత్వం. తమ వాళ్ళతో తప్ప యితరులతో అంత త్వరగా కలవని తత్త్వం. అన్నీ వారికి నేడు యీ దీన- హీనస్థితికి తెచ్చాయి.

నిజాయితీ, అమాయకత్వం వాళ్ళ మరో బలహీనత.

కరువు కాటకాలు, దోపిడి- దౌర్జన్యాలు వాళ్ళ జీవితంలో సర్వసామాన్యం. కాని నేటి ఈ సభ్య సమాజంలో వాళ్ళు మనగలగాలి అంటే చాలా నేర్చుకోవాలి. ముఖ్యంగా భాష. నేటి జీవన విధానానికి వారిదైన గిరిజన భాష సరిపోదు. సభ్యసమాజం, బహుళ జనం మాట్లాడే భాష నేర్చుకోవడం అనివార్యం.

అన్ని అనర్థాలకు కారణం వారి అజ్ఞానం. అజ్ఞానంకు కారణం అవిద్య. విద్యనేర్చుకు న్ననాడు వారి జీవితాలు యింత దయనీ యంగా ఉండవు. ఇంతటి దోపిడి దౌర్జన్యాలు ఉండవు. నోట్లో నాలుకుండి, మనసులో భావ ముండి పలకలేని మూగవాడు గోండన్న. ఇవన్నీ గ్రహించిన సిద్ధార్థ వాళ్ళలో విప్లవాత్మ కమైన మార్పును ఆశించి మొదట వైద్యంతో వాళ్ళకు చేరువై, వాళ్ళ భాషలో వాళ్ళ కష్టం, సుఖం అడిగి తెలుసుకొని వాళ్ళలో ఒకడిగా కలిసిపోయాడు.

ఇదేపని చాలా ఏళ్ళక్రితం హైమండార్ఫ్ చేసి సఫలీకృతుడయ్యాడు.

మళ్ళీ చాలా రోజులకు 'పొరకలదొర' ఇదే పని చేసి వాళ్ళ మనసు దోచుకొని 'ఇందరవె ల్లిలో' తుడుం మోయించాడు.

మళ్ళీ యిన్నేళ్ళకు సిద్ధార్థ అదే పని చేస్తున్నాడు.

సిద్ధార్థ యిప్పుడు ఒక్కడు కాడు.

ప్రియాంక కూడా అతడికి తోడుగా ఉంది.

హౌస్‌సర్జన్ పూర్తికావడంతో ప్రియాంక కూడా సిద్ధార్థతోనే ఉంటుంది. ప్రియాంక సిద్ధార్థ నేతృత్వంలో అల్లిగూడం అంతా శ్రద్ధ గా చదువుకుంటున్నారు. రాత్రి నెగడు మంటలో చిన్నా పెద్ద ముసలి ముతకా అందరూ చదువుకుంటున్నారు.

కొందరు అక్షరాలు చూసి రాస్తున్నారు.

కొందరు వాచకం చదువుతున్నారు.

కొందరు లెక్కలు చేస్తున్నారు.

కొందరు పత్రికలు ముందేసుకొని వార్తలు చదువుతున్నారు. తలా ఒక కాగితంముందే సుకొని తోచిందేదో రాస్తున్నారు.

ఇప్పుడు ఆ ఊళ్ళో బడిలేదు.

ఆ బడి చదువులమీద ఆ గిరిజనగూడెం వాళ్ళకు నమ్మకం లేదు. వారానికి ఒకసారో, నెలకు రెండుసార్లో వచ్చే ఆ ఊరి పంతులుని ఏనాడో ఊరినుండి తరిమేశారు.

రాని పంతులుకోసం ఎదురుచూసి మోస పోయేకన్న, తమ పిల్లలకు చదువు అవసర మని తెలిసింది కాబట్టి వాళ్ళే రాత్రి నెగడు ముందు కూర్చుని తమతోపాటే పిల్లల్ని చదివించుకుంటున్నారు.

అక్కడ ఎవరూ పంతులుకాదు.

వచ్చినవాళ్ళు రాని వాళ్ళకు చెప్పాల.

ఆరు నెలలు కష్టపడి డాక్టర్‌బాబు ఊళ్లో జంగు, దేవు, జైతు, బాలుతాతలాంటి పది మందికి చదవడం, రాయడం, లెక్కలు చే యడం నేర్పించాడు.

ఆ గిరిజనులు పూర్వం కూడా అజ్ఞానులు కాదు. విద్య తెలియని వారూ కాదు. వాళ్ళు కేవలం నిరక్షరాస్యులు మాత్రమే.

నిరక్షరాస్యులైన వయోజనులు. వాళ్ళని డాక్టర్‌గారు గుర్తించారు. పిల్లలకన్న ఐదు రెట్లు వేగంగా నేర్చుకునేశక్తి వాళ్ళ కుంటుందని అతడికి తెలుసు. అందుకే పట్టు బట్టి, ప్రేమతో ఆరునెలల్లో వాళ్ళలో నిరక్షరా స్యతను పూర్తిగా నిర్మూలించాడు.

ఇప్పుడు ఆ ఊళ్లో నిరక్షరాస్యుడంటూ లేడు. గిరిజనులందరూ చక్కగా చదువుతా రు. రాస్తారు. నిత్యం ఉపయోగపడే లెక్కలు చేసుకుంటారు.





ఎవరో వస్తారని, ఏదో చేస్తారని ఎదురు చూసి మోసపోయే కన్న తమ అవిద్య, అజ్ఞానమే తమ మూల శత్రువని ఆ గూడెం గిరిజనులంతా గ్రహించారు.

వాళ్ళ ఆకలి- దప్పులు సంగతి పక్కకు పెట్టి ఒక నిషాగా చదువుకుంటుందా ఊరు. ఉన్న సమస్యలు తాము పుట్టినప్పటినుంచి ఉన్నవే అని వాళ్ళు తెలుసుకున్నారు.

రోజూ ఒక తరగతి నిర్వహించబడు తుంది.

ఒకరోజు నల్లగొండ తెలంగాణా రైతాంగ పోరాటంనుంచి నక్సల్‌బరి పోరు వరకు-

ఇంకోరోజు నక్సల్‌బరీ పోరునుంచి ఇంద రవెల్లి 'జంగ్' వరకు రాజకీయ పాఠశాల.

ఒకరోజు ప్రథమచికిత్స.

ఇంకోరోజు ప్రాథమికఆరోగ్యం.

మరోరోజు ప్రపంచదేశాల విద్య అభివృ ద్ధి.

అక్షరజ్ఞానంతో ప్రపంచం ఎంత విశాల మైందో, ప్రపంచ దేశాలు, సమస్యలు ఎంత తీవ్రతరంలో ఉన్నాయో వాళ్ళు గ్రహించగలి గారు.

సంవత్సరం క్రితం సిద్ధార్థ గదిలో దొంత ర్లుగా పేర్చి ఉన్న పుస్తకాలు నేడు ఆ ఊరి ప్రజల చేతుల్లో ఉన్నాయి.

అక్షరాలు ఆ ఊరి మెదళ్ళలో మొలకెత్తు తున్నాయి.

ప్రియాంక పూర్తికాలం వాళ్ళ చైతన్యం కోసం వెచ్చిస్తోంది. ఇటీవలే వాళ్ళ కాలేజీకి సెలవు లియ్యడంతో మళ్ళీ వచ్చింది. వచ్చింది మొదలు వారి చైతన్యం కోసం కృషిచేస్తోంది. ఆ ఊళ్ళో ఉండేది చాలా తక్కువ రోజులు కాబట్టి నిమిషం తీరిక లేకుండా పనిచేస్తుంది.

గిరిజనుల సాంప్రదాయిక పద్ధతిలో రూ పొందించి మరిచిపోయిన 'రాయి సంటర్ల'ను తిరిగి జాగృతం చేసాడు సిద్ధార్థ.

గిరిజన స్త్రీల ఆరోగ్యం సంక్షేమం గురించి

తెలుసుకునేందుకు, తెలిపేందుకు 'అవ్వల్ కమిటీ'లు ఏర్పాటుచేసి తరగతులు నిర్వహించింది ప్రియాంక.

చిత్తశుద్ధి ఉంటే రాయిలో కూడా చైతన్యం కలిగించొచ్చని నిరూపించారు సిద్ధార్థ-ప్రియాంక.

ఇప్పుడు ఆ ఊరి ప్రజలు డంకెల్ ప్రతిపాదన గురించి మాట్లాడగలరు. శ్రీలంక సమస్య గురించి చెప్పగలరు. 'ఆల్‌కబీర్' ఫ్యాక్టరీ వలన కలిగే నష్టాల గురించి వివరించగలరు. ఆదిలాబాదు జిల్లాను రెండుగా విభజించాలో, వద్దో సహేతుకంగా వాదించగలరు.

వాళ్ళ సమస్యను చక్కగా ధరఖాస్తు రూపంలో రాసి యివ్వగలరు. తీసుకున్న అప్పుకు వడ్డీ రేటు ఎంత అని అడిగి నెలకు, సంవత్సరానికి అయ్యే వడ్డీ కట్టగలరు.

నేడు పాఠశాలలో చెప్పే పనికిరాని పాఠాలు తప్పించి, నిత్యజీవితంలో ఎదురయ్యే సమస్యల సాధనకు విద్య ఎలా తోడ్పడుతుందో సిద్ధార్థవాళ్ళకి బాగా చెప్పగలిగాడు.

ఇప్పుడు ఆ ఊళ్ళో ఓటు గలిగిన ప్రతి పౌరుడు ఒక చైతన్యవంతుడైన దివిటీ.

ఆకలి దప్పులతో, కరువు కాటకాలతో, నీటి ఎద్దడితో పోలీసుల, భూస్వాముల జులుంతో ఒక ఎన్నికల కాలం ముగిసిపోయింది. మళ్లీ ఎన్నికలొచ్చాయి. ఎటు చూసినా ఎన్నికల హడావుడి, రంగు రంగుల జెండాల పార్టీలు.

రెండు రూపాయల కిలో బియ్యం ఇస్తానని వాడొకడు.

రెండు రూపాయలకు పది కిలోలిస్తా, మీ పిల్లల్ని మా సర్కారు బడిలో చేర్పించితే చాలు అనేవాడు ఒకడు.

రాజకీయ లబ్ధికోసం సారాని పూర్తిగా నిషేధిస్తామనే వాళ్లందరూ.

రోజులాగే ఆరోజుకూడా సాయంకాలం అందరూ ఒకచోట గుమిగూడి ఎన్నికల గురించి నిలబడిన నాయకుల గురించిమాట్లాడుకుంటున్నారు.

అంతలోకే హడావుడిగా అన్నలొచ్చారు. ఎప్పటిలాగే రాంరాంతో పలకరింపులయ్యాయి. ఏర్పాట్లన్నీ మామూలుగానే ఉన్నాయి. పెరిగిన నిర్బంధం కారణంగా నాలుగు దిక్కుల నలుగురు సెంట్రీ డ్యూటీ చేస్తున్నారు. ఎక్కువసేపు ఆ గ్రామంలో ఉండడం ప్రమాదం అనుకున్నారేమో వచ్చిన వెంటనే అసలు విషయానికి వచ్చారు.

పేరు పేరున పెద్దలను పలకరించాడు నారాయణ. ఆ వెంటనే అసలు వచ్చిన విషయంలోకి దిగాడు.

"గోండు దాదాలందరికి రాం రాం. ప్రజలను మోసగించి, మభ్యపెట్టి ఓట్ల డబ్బాలు నింపుకొని, కోట్లు సంపాదించుకునే ఎలక్షన్లు మళ్లా వచ్చాయి. ప్రతిసారి ఓటేసి, ఆశతో అనుకున్నయి చేస్తారని మోసపోవడం మీకు మామూలయిపోయింది. ఈ రిజర్వ్ సీటుకు మీ కులం మనిషే మీ ఓట్లతో గెలిసి మీ మంచిచెడు, ఆకలి-దప్పుల గురించి మర్చిపోయి అక్కడ పట్నంల ఒక బంగ్లా, ఇక్కడ ఉట్నూరుల ఒక బంగ్లా మీద బంగ్లా, ఉన్న ఊర్లె ఒక బంగ్లా కట్టుకొని లక్షల డబ్బుతో, తొండయి వచ్చి ఓటు అడిగినోడు నేడు నీలల్ల మొసలయి కూసున్నాడు. మల్లీ ఆశపడి ఓటు వేస్తే యిప్పుడు మొసలి మారం ఉన్నోడు రేపు రాకాసి బల్లయి మిమ్మల్ని తింటడు. ఏం జెయ్యాలో ఆలోచించుండ్లి.

ఇక్కడ ఓటు జేసుకన్న మనిషి యింకోడు మంచోడే గావచ్చు. కాని అనికి టికిటిచ్చి నిలబెట్టిన పార్టీకి మీ గురించి పట్టదు. ఇప్పుడు కార్చేవన్నీ మొసలి కన్నీళ్లే. అందుకని యీ దేశంలో ఓటు వేయడం అంటే తెలిసి తెలిసి యింకోన్కి అధికారం కట్టబెట్టి అని ఇల్లు నింపటానికే. అందుకని ఎవరూ కూడ ఈసారి ఎన్నికల్లో ఓటు వెయ్యద్దు. ఓటు వేయకుంటే ఈ కల్లె సర్కార్ ఎట్ల ఏర్పడతదో చూద్దాం. అందుకని మల్లా ఓసారి చెపుతున్న

ఎవరూ ఓటు వెయ్యొద్దు' అంటూ తన ఉప న్యాసం ముగించాడు నారాయణ.

"మీరు ఓటు వేసింది లేంది మాకు తెల స్తది. మీ చేతికి చుక్కఉంటే మంచిగుండది. అప్పడు మీకూ మాకు రాం రాం" అంటూ బెదిరింపు ధోరణిలో అన్నాడు దళ సభ్యుడు నర్సయ్య.

"ఇంకా మేము యీ రాతిర చాలా గూడా లు తిరిగాలి. అందుకని అందరికి మల్లా ఒకసారి రాంరాం" అంటూ వచ్చినవాళ్లు వచ్చినట్లు క్షణంలో మాయమయ్యారు. ఎవరో వెంటపడి తరుముతున్నట్లే వెళ్లిపోయా రు. వాళ్ల వెళ్లినగంటకు పోలీసులు వచ్చారు. అప్పటికి ఎవరి గుడిసెలకు వాళ్లు వెళ్లిపోయా రు.

"అరేయ్ అందరూ ఇండ్లల్లకెల్లి బయటకు రండ్లిరా'' అంటూ పోలీసులు వ్యాను దిగి తలో గుడిసె తలుపులు బాదసాగారు.

కొందరు గుడిసె తలుపు బూటు కాళ్లతో తన్నితే, కొందరు తుపాకిని వెనకకు తిప్పికొ డుతున్నారు దబదబా.

గుడిసెల్లోంచి అందరూ బయటకొచ్చారు. కాసేపట్లో గూడెమంతా పిల్లాపాపలతో గుమి గూడిపోయారు.

"ఏందిబే! అప్పుడే పెండ్లాల పక్కజేరి పన్నరా ఏంది, తలుపు లేసుకున్నారు'' అన్నా డు ఎస్.ఐ.జైతును చూస్తూ.

వెంట ఉన్న సి.ఆర్.పిలు కిసుక్కున నవ్వారు.

పోలీసుల మాటలకు ఆడవాళ్లు సిగ్గుతో చచ్చినట్టయి, తలలు పక్కకు తిప్పుకున్నా రు.

జంగు రక్తం ఒక్కక్షణం గుండెలోంచి మెదడుకు, మెదడు నుంచి కళ్లల్లోకిపాకింది.

జైతు పిడికిళ్లు ఆవేశంతో బిగుసుకు న్నాయి.

దేవు ముక్కు పుటాలు కోపంతో ఎగిసిప డుతున్నాయి.

కినాకబాలు తాత పెద్ద ఉచ్ఛ్వాసంతో గాలి పీల్చుకొని, రెండు నిమిషాలు కళ్లు మూసు కొని తననితాను సంభాళించుకున్నాడు.

"గంటకింద ఇక్కడికి అన్నలచ్చిరంట నిజమేనా'' అన్నాడు ఎస్.ఐ.

ఇదే అడగడం కొన్ని నెలల క్రితమైతే జవాబు చెప్పకుండ మౌనంగా ఉండేవాళ్లు. కాని యిప్పుడు వాళ్లు మౌనంగా ఉండదలచు కోలేదు. మౌనం ఒకసారి అర్థాంగీకారం అయితే, చాలాసార్లు చేతకాని తనమవు తుందని ఈమధ్యే తెలిసింది వాళ్లకు. అందు కని తెగించి జవాబిచ్చాడు బాలు తాత.

"అవ్... అచ్చిండ్లు గంటకింద. ఎవల్లకు ఓటు ఎయ్యద్దని చెప్పి పోయిండ్లు'' అన్నా డు.

"ఏందిబే, లమిడికొడక, మాటకి మాటిస్త న్నవ్. ఇప్పపువ్వు కల్లు నెత్తికెక్కిందా ఏంది'' అంటూ బాలు తాత జుట్టు పట్టుకొని ముందుకీడ్చాడు ఒక పోలీసు.

అందరూ ఒక్కసారి సముద్ర కెరటం వెనక్కు మళ్లినట్టు ఎవరి గుడిసెలవైపు వాళ్లు పరుగులంకించారు పోలీసుల ధాటికి భయప డి.

దెబ్బకు భయపడి పారిపోయారనుకున్నా రు.

'అరె లంజకొడుకుల్లారా ఎటు ఉర్కుత ర్రా. ఇటురండ్లి లేకుంటే బొక్కబొక్కకు సు న్నం పెడతం' అని ఒకరంటే,

" అరేసాలే కిదర్ బాగతే. తుమారీ మాకో కుత్తేమారో ఇధర్ ఆవో' అంటూ ఇంకోడు అరిచాడు.

"అన్నలమాట ఇన్నప్పుడు అల్లకు అన్నంబెట్టి, యింట్ల ఉంచుకున్నప్పుడు ఏమ యిందిరా యీ బుద్ధి. దెబ్బకు జడిసి ఉచ్చవో సుకునేటోల్లు...'' అని ఎస్.ఐ. ఏదో అనబో తుంటే తుఫానుకు లేచిన సముద్రకెరటంలా గూడెం గిరిజన స్త్రీలు పురుషులు ఒక్కొక్కరు





ఒక్కో ఆయుధంతో మెరుపు వేగంతో పోలీసు లను క్షణంలో చుట్టుముట్టారు.

అందరి చేతుల్లో ఏదో ఒక ఆయుధం ఉంది.

ఒకరిచేతిలో గొడ్డలుంటే యింకోరి చేతిలో కొడవలుంది.

ఒకరి చేతిలో ఈటె ఉంటే యింకోరి చేతిలో కర్ర ఉంది.

ఒకరి చేతిలో బరిసె ఉంటే యింకోరి చేతిలో కత్తి ఉంది.

పోలీసులు ఊహించని పరిణామం అది. ఖాకీలు పసికట్టని చైతన్యం అది.

పోలీసులు పదిమంది పది గన్‌లు.

గిరిజనులు సుమారు వందమంది వంద ఆయుధాలు.

కినాకబాలు తాత ఒంటిమీద చెయ్యేస్తే అన్ని ఆయుధాలు ఒక్కసారి లక్ష్యాన్ని ఛేదించటానికి సిద్ధంగా ఉన్నాయి.

"ఏది మొగోడివైతే మల్లా మా బాలుతాత ఒంటిమీద చెయ్యివెయ్యి చూస్త'' అంటూ దేవు, యీటెను బాలుతాత జుట్టు పట్టిన వాడి గుండెకు అన్చి సవాలు చేసింది.

"దినాం మా ఆకలి దప్పులతో, కరువు కాటకాలతో దినాం ఒక చావు సస్తూ ఉంటే, నడుమ మీజులుం లేంది, జబర్దస్తీ ఏంది. మేమేమన్న దొంగలమా! లంగలమా! నీకు పెండ్లాం పిల్లలు లేర్రా, అక్క చెల్లెలులేర్రా? ఆల్లతోని గూడ గిట్లనే మాట్లాడ్తలా మీలు. తలుపులేసుకొని పెండ్లాల పక్కల్నె పోయి పంటలా మీలు. అన్నం తింటున్నం కొంచమన్న సిగ్గూ శరం ఉండాల. మనిషై పుట్టినంక ఒక పారి కాకున్న ఒకపారి మనిషి మారం మాట్లాడాల. చేతుల బందూకున్నదని ఎవల ను బడితే అల్లను నోటికెంత అస్తె అంత అనుడేనా!" అంటూ ఈటెను గుండెకానించి సవాల్ చేసింది దేవుబాయి.

"కానీ చూస్తరేంది. బందూకులు లేవుండ్లి. కాల్చుండ్లి మమ్ముల్ని, గుట్టకొక్కన్ని పారేసి ఎన్‌కౌంటర్ అని చెప్పుండ్లి, ఇది మీకేం కొత్తకాదు. దినాం మీలు చేస్తున్నదే. మీ పెద్దొల్ల మెప్పుకోసరం, పైసలకోసం, పదువులకోసం కానీయుండ్లి, ఎత్తుండ్లి మీ బందూకులు. పులినైన కట్టెతోనే కొట్టిసంపుడు మాకెరుక'' అన్నాడు జైతు.

"పోట్లాడ్తే పొయ్యేవి పాణాలు. అంతకన్న ఏం పోతయి. పానమంటే మాకు లెక్కలేదు. మేం మనుసులమని మాకు మంచి చెడు, కష్టం సుఖం, మంచీ మర్యాదా ఉంటయని మీకు తెల్వదు. ఎవలచ్చినా మాకే సావు.. అన్నలస్తరు, అన్నం తింటరు, రాత్రంత పంటరు మంచోచెడో చెప్తరు, ఇనుకుంటం. అది మాదే తప్పా. నువ్వారా నీకూ తిండిపెడ్తం, మాకున్న కారం గటక్. తిను. నీకు తోచింది చెప్పు ఇంటం. రాత్రంత ఉంటమంటే నీకు యిల్లిచ్చి మేముసూరు కింద పంటం. మనిషిని మనిషి మారం జూస్తం. గోజనన్న ప్రేమగ జూసే మనుసులు మేము. అన్నలకు మీకు జాతివైరం ఉంటే మైదానంల జూసుకొండ్లి, మా గూడాలమీదవడి మమ్మల్నెందుకు సంపుతరు, కొడతరు'' అన్నాడు జంగు.

కష్టమొచ్చిన మనిషి తండ్రి దగ్గరికి పిల్లడు ఉరికినట్టు పోలీసు దగ్గరికి ఎల్లి కష్టం చెప్పుకోవాలి. తండ్రి మారం పోలీసు ప్రజల మంచి చెడుసూడాల. అది ఇడిసిపెట్టి మీలు చేస్తున్న పనేంది. పైసలున్నోనికి కావలిగాస్తూ మా అసుంటోల్లను మన్ను జేసుడేనా! మనం మనిషయినందుకు ఒకసారి కాకున్న ఒకసారి సోచాంచాల. ఎవలు ఆల్లు, ఏం జేస్తున్నరు. ఎవరి కోసం జేస్తున్నరు అని. అప్పుడు సమజయితది'' అన్నాడు కినాకబాలుతాత.

"మీ రెందుకచ్చిండ్లు, ఆల్లు అచ్చి ఎలక్షన్ల ఎవల్లకూ ఓటు ఎయ్యద్దని చెప్పి పోయిండ్లు, మీలేమో ఓటు ఎయ్యాల. ఓటు ఏసినట్టు ఏలిమీద మచ్చలేకుంటే మా ఊరి మీద ఏ అపరాత్రో జిట్టకుర్ర పడ్డట్టు పడి దొరికినోల్లను

దొరికినట్టు కొట్టి సంపుతరు. చెయ్యని తప్పులకు కేసులుపెట్టి కోరట్లు, కచేరీలు తిప్పుతరు. మా ఉల్లె బడి మూపిస్తరు. కరెంటు తీసేస్తరు. మా రాషన్ పానీ బంద్ చేపిస్తరు, అంతెగద"

"ఆల్లు బంద్ చేసేదేంది మన ఊల్లె కంబలున్నయిగాని బుగ్గల్లెవు. మన ఎవరింట్ల కరెంటులేదు. బడి ఎప్పుడో బంద్‌వడ్డది. మా పోరగాండ్లకు మేము నెగడు ముంద సదువు సెపుకుంటున్నం. ఇంక రాషన్ పానీ ఆ దుకాన మోడు ఆర్నెల్లకొకసారి కోట ఉల్లెకు తెస్తడు. నెలనెల ఇందరవెల్లిలనే మా రాషనంత అమ్ముకొని బంగ్ల మీద బంగ్ల కట్టిండు, బండిమీద తిరుగుతుండు. మాకు ఏం సౌలత్‌లు ఉన్నయని మేం ఓట్లెయ్యాల"

"ఓట్లేసుడు, ఎయ్యకపోవుడు మా యిష్టం. మేమేమన్న ఏలుపట్టుకొని నడిసే పోరగాండ్లమా. ఎవలు చెప్తే యిప్పుడు మీ మీద తిరగవడ్డం, మా మనుసుకాలింది మేము మర్లవడ్డం"

"ఓటెయ్యద్దని అల్లు చెప్పిరి. ఇనుకున్నం. ఎయ్యమని మంచిగ మీలు చెప్పుండ్లు ఇనుకుంటం, మల్ల మా ఇష్టమైంది మేం చేస్తం"

మనిషొక మాట అంటున్నరు. చేతుల్లో కత్తులు, కొడవళ్లు, కర్రలు, ఈటెలు పట్టుకొని తూటాలాంటి మాటలు పేలుస్తున్నారు.

గోండు గ్రామంలో యింత చైతన్యాన్ని వాళ్లు కలలో కూడా ఊహించలేదు. మహా మహా నగరాలల్లో, పట్టణాల్లోనే తమ మాటకు ఎదురులేక మనుషులను మాటలతో చేతలతో ఒక ఆట ఆడించేవాళ్లు అక్కడ బొమ్మలైపోయారు.

ఎవరి కళ్లల్లో భయంలేదు.

ఎవరి చేతల్లో బెణుకులేదు.

అక్షరాలు వెలిగించిన జ్యోతి వెలుగు అది.

అక్షరాలు కలిగించిన చైతన్యం అది.

అక్షరం పక్క అక్షరం పేర్చి రాయడం నేర్పి, పదాలు కూర్చి, వాక్యాలతో పరిచయం చేసి ఆ వాక్యాల వెంట నడిపించిన చైతన్యమూర్తి సిద్ధార్థ. ఈ గొడవలన్నింటికి అతీతంగా ఆదమరిచి నిదురపోతున్నాడు.

"నేడు బందూకు మా ఛాతికి పెట్టి ఓటు ఎయ్యాల అన్నోల్లు. ఎల్లుండి ఈ మనిషికే ఓటు ఎయ్యమంటరు. ఆ దినాలు ఎంతో దూరంలేవు. మా మంచి కోసం లేసే బందూకులు మాకు కావాలగాని ఓటేసిన సర్కారే మా గుండెల్ల గోలీలు దించవట్టె. అసుంటి సర్కార్ మాకెందుకు, ఈ ఓట్లెందుకు'' అన్నాడు జంగు.

ఏ మాటకు సమాధానం లేదు. కట్టేసి కొడ్తె పిల్లికూడ ఒక దశలో ఓపిక నశించి పులి అవుతుందని విన్నారు, కాని యిప్పుడు చూస్తున్నారు.

★ ★ ★

అడవిలో ఎక్కడో దూరంగా చెట్టుకొట్టిన చప్పుడు రావడంతో అల్లిగూడెం గోండులందరూ బిలబిలమంటూ అడవి దిక్కు ఉరకసాగారు. వాళ్ల గోండు ఆనవాయితీ ప్రకారం ప్రతి ఒకరి చేతిలో ఏదో ఒక ఆయుధం ఉంది. పొయ్యేది అడవి, ఇంట్లకెల్లి కాలు బయటపెడ్తే గొండోనికి ఉండేది అడవే. అడవి అన్నాక పురుగుపుట్రా ఏదో అడ్డు తగలచ్చని ముందు జాగ్రత్తగా చేతిలో ఏదో ఒక ఆయుధం లేనిదే గిరిజనుడు యింట్లోంచి కాలు బయటపెట్టడు. అది వాళ్ల ఆచారం, సంప్రదాయం. ఆటవిక న్యాయం కూడ. ఉత్త చేతులతో ఉంటే కుందేలు కూడా కవ్వించొచ్చు. చేతిలో కర్ర ఉంటే కుబుసం విడిచిన పామైనా, కోరలు తీసిన పులైనా గిరిజనుడి గుండె దిటవుముందు బలాదురు కాక తప్పదు.

చెట్టుకొట్టిన చప్పుడు వచ్చిన దిక్కు ప్రవాహంలా కదిలి పోతున్నారు జనం.

అడవి నడిమధ్య ఆకాశాన్నంటే టేకు




చెట్లను అటవీశాఖాధికారులు, కంట్రాక్టర్ కలిసి నరికిస్తున్నారు. అడవిని రక్షించేవాడే నరుక్కొని అమ్ముకోసాగే. ఎవరైనా అడిగితే అన్నల ప్రోత్సాహంతో గిరిజనుల పేరు చెప్పడం ఆనవాయితీ అయి కూర్చుంది.

ఏటా లక్షలు, కోట్లు ఖరీదు చేసే కలప స్మగ్లర్ల చేతిలో పడుతుంది. ఉన్న అడవంతా అంతరించిపోయి, అడవిలోపల జంగల్ అంతా మైదానమయి పోయింది. అందుకే యింత ఎండలు, అనావృష్టి అని గిరిజనులు గ్రహించారు. కాని అందరూ కంచే చేనుమేస్తుంటే ఎవరికి చెప్పుకుంటారు అని ఊరుకున్నారు.

కాని అల్లిగూడెం గిరిజనులు గిరిజన సేవా సమితి పేర అటవీ రక్షణకు పూనుకున్నారు. వ్యవసాయదారుడు వ్యవసాయ పని ముట్లకు, వంట చెరకుకు తప్ప ఎట్టి పరిస్థితిలో యింకొకరుకాని, యింకోదానికి కాని అడవిలో చెట్టుమీద చెయ్యి వెయ్యటానికి వీల్లేదని శాసించి తామే కలిసికట్టుగా అడవికి కాపలా కాస్తున్నారు.

ఎక్కడ అడవిలో యింత కలపపోయినా, కలప కదిలినా అట్టి నేరాలు చేసిన వాళ్లను పట్టి బంధించి అటవీ శాఖాధికారులకు అప్పగించి కేసు బుక్ చేయించి జుర్మానా వసూలు చేయించాలి అని నిర్ణయించుకున్నారు.

గిరిజన జనం చేరుకునేసరికి అప్పటికే నాలుగు టేకుచెట్లు నేలకూలి ఉన్నాయి. అప్పుడెప్పుడో 'చాక్‌తరస్' చేయించినప్పుడు వెంట ఉండి చెట్టు కొమ్మలు కొట్టించిన ఫారెస్టుగార్డ్‌గారు స్వయంగా నిలబడి కంట్రాక్టర్లకు నాణ్యమైన చెట్లు ఏరి కొట్టిపెడుతున్నాడు.

"ఏంది గార్డ్‌సాబ్. మీరే టేకు చెట్లు కొట్టియ్యవట్టిరి. ఇట్ల కొట్టుడు ఖానూన్ ఖిలాప్‌గద- మరి'' అన్నాడు సోము.

"అరే సువ్వర్‌కే బచ్చే నాకు కానూన్ జెప్తర్రా'' అంటూ సోము పైకి ఉరికాడు గార్డు.

సోము ఒక్కతోపు తోశాడు. వెళ్లి వెల్లకిలా పడ్డాడు గార్డు.

"బందూకులోల్లకే మేం ఇనకుంటయిమ్. నీదొక లెక్కన బందూకులేని గార్డువి. అడవి దొంగ. నీకే అంత టెంపర్ ఉంటే యీ అడివికి కాపలా కాసెటోల్లం మాకెంత ఉండాలి''

"ఈ అడివి నీ తాతదా! తండ్రిదా!"

"కాదు మా ముత్తాతలది. అడివి మాది. ఈ అడివిల కాసే కాయ మనది, పండు మనది, గడ్డి మనది. ఈ అడవి తల్లిని గొడ్డలి పట్టి నరకనంతవరకు యీ తల్లి అందరిది. ఈ అడివిల కాసే పండ్లమీద, అందరికి హక్కుంది. ఇకముందు గొడ్డలి పట్టి మా ఇజాజత్‌లేంది చెట్టుమీద చెయ్యేస్తే మల్ల తినతందుకు చేతులుండవు. సమజయిందా'' అంటూ గద్దించాడు భీము.

"ఇది మొదటి తప్పు అని యిడిసి పెడుతున్నం. మల్లా ఇంకోసారి యిసుంటి తప్పు జరిగితే మంచిగుండది'' అంటూ వార్నింగ్ ఇచ్చి గార్డును వదిలేశారు.



ఒకప్పుడు పోలీసులకు భయపడి గుట్టకొకరు, చెట్టుకొకరు, పుట్టకొకరుగా చెల్లాచెదరయి, భయం భయంగా బ్రతికిన ఊరు, ఎవరితోనైనా సరే నిలబడి, నిదానంగా పోరుచేయ సంకల్పించింది.

తమ హక్కులకన్న బాధ్యతలను గుర్తించి మసలుకోదలిచింది. దేశపౌరులుగా యీ వారసత్వ సంపదను కాపాడుకుంటూ బాధ్యతాయుతంగా ప్రవర్తిస్తూ తమ హక్కులను సాధించేమార్గంలో ముందుకు పోవాలని నిర్ణయించుకుందా ఊరు.

పనికిమాలిన, బూజుపట్టిన చదువుల బడిని ఆ ఊరు బహిష్కరించింది.

అడవిలో పుట్టి, అడవిలో పెరిగిన పిల్లలు

గా ఆ అడవి సంరక్షణ భారాన్ని స్వచ్ఛందంగా తమ భుజాలపై వేసుకుంది ఆ ఊరు.

ఎవరి సహాయం లేకుండా సంపూర్ణ అక్షరాస్యతను సాధించిందా ఊరు "రాయి సెంటర్ల' ద్వారా కోర్టులను కాదని తామే తీర్పు చెప్పేస్థాయికి ఎదిగిన ఊరది.

నేడు ఆ ఊళ్లో ప్రతి మనిషి వెలుగుతున్న దివిటి.

నేడు ఆ ఊళ్లో ప్రతి మనిషి కదులుతున్న చైతన్యం.

తమ సంప్రదాయ వృత్తిని, పల్లెను వదిలి పట్టణానికి వెళ్లటానికి ఇష్టపడని యీ దేశం వెన్నముకలోని ఒకపూస ఆ ఊరు.

ఆ ఊరు మేల్కొంది. ఆ జనం మేల్కొన్నారు.

తుపాకిగొట్టంతో రాజ్యాధికారం చేజిక్కించుకోలేదన్నవారికి, తుపాకి గొట్టంతో మీరు రాజ్యాధికారం చేయలేరని చెప్పిన ఊరది.

రాష్ట్ర రాజధానిని, ఢిల్లీ గద్దెను తమ దీక్షలో వదిలించే ఊరది.

ప్రతి ఊరు ఒక అల్లిగూడెం అయితే ప్రస్తుత కుటిల రాజకీయాలు తలవంచి దిగిపోకతప్పదని చెప్పే ఊరది.

మానవ పరిణామదశలో మనిషి భూమిపై వ్యవసాయం చేయడం ఒక గొప్ప పరిణామదశ. ఆ పరిణామదశలో, భూమి సాగులో నిష్ణాతుడైనవాడే రైతు. వాడు హరిజనుడు కావచ్చు. గిరిజనుడు కావచ్చు. గిరిజనేతరుడు కావచ్చు. వాడికే భూమిమీద హక్కు. ఎప్పుడూ సారవంతమైన భూమిని ఆశించే గిరిజనుడు ప్రకృతివైపరీత్యాలకు, క్రూరమృగాలకు భయపడి ఎప్పటికప్పుడు సాగుచేసే భూమిని వదులుకొని కొత్త భూమికోసం అన్వేషించేవాడు. తను సాగుచేసే నేలమీద ఏనాడు తన హక్కును ఆశించలేదు.

ఆ అవకాశం అందరిది. కాని ఈ నేల కొందరిదే అయింది.

కొండవాలును, సారవంతమైన నేలను, తాగునీటి వసతిని కోరే గిరిజనుడు అందులో ఏది కొరవడినా ఆ భూమిని అలాగే వదిలి మరో మజిలీలో మరో భూమిని సాగుచేసుకునేవాడు.

భూమినే నమ్ముకొని బతికే గిరిజనుడికి నేడు భూమిలేదు.

నిన్న, మొన్న పోడు సాగుచేసిన భూమి నేడు గిరిజనేతరుడి చేతుల్లో ఉంది.

నిన్న ఏ నేలమీద యజమానిగా చెమటోడ్చాడో, నేడు అదే నేలమీద కూలికి నిలబడ్డాడు.

అడవితల్లి ముద్దు బిడ్డ గిరిజనుడు.

భూమి పుత్రుడు గిరిజనుడు.

ఇద్దరమ్మల మురిపాల పొంగు గిరిజనుడు.

నేడు అడవి తల్లినుండి గిరిజనుడిని దూరంచేసి, అడవిని చెరపట్టారు.

భూమితల్లినుండి కూడ గిరిజనుడిని దూరంచేసి, నేలను చెరపట్టారు.

చెమట పట్టని చేతులలో నేడు నేలతల్లి నలిగిపోతోంది.

కన్నకొడుకు రెక్కల కష్టానికి సరిపడ తిండిలేక విలవిలలాడుతుంటే, నేలతల్లి గుండె బీటలు వారుతోంది.

కన్నకొడుకు ఆకలితో అనాధగా ఏడుస్తుంటే...

చెరపట్టినవాడు రొమ్ముకొట్టి రక్తం త్రాగుతుంటే...

నేలతల్లి విముక్తికోసం వేయి కళ్లతో ఎదురు చూస్తోంది.







# చతుర కథలు

## అసలు దోషి

యమధర్మరాజు సింహాసనం మీద కూర్చున్నాక, చిత్రగుప్తుడి వంక చూశాడు. "చిత్రగుప్తా! నిన్న తాజాగా నరకానికి వచ్చిన పాపులను ప్రవేశపెట్టు. వారికి శిక్షలు విధించెదను'' అన్నాడు.




"చిత్తం ప్రభూ'' అంటూ చిత్రగుప్తుడు కనుసైగ చేయడంతో యమభటులు ఓ ఇరవై సంవత్సరాల కుర్రాడిని యమధర్మరాజు ముందుంచారు.

యమధర్మరాజు ఆ కుర్రాడివంక అదోలా చూసి, "ఈ కుర్రాడు చేసిన పాపం ఏమిటి?'' అని ప్రశ్నించాడు.

"ఆత్మహత్య అనే మహాపాపం చేశాడు ప్రభూ''

"వివరించుము''

"ప్రభూ! ఇతను డిగ్రీ చదువుకుంటున్న యువకుడు. పరీక్షల సమయంలో ఇతడు పుస్తకం తెరిచేసరికి కరెంట్ పోయేది. అప్పటివరకూ కరెంట్ వెలుతురులో చదువుకునేవాడు, కొవ్వొత్తి కాంతితో చదవలేకపోయేవాడు. ఫలితంగా పరీక్షలలో ఫెయిలయ్యాడు. అందుకని తండ్రి తిట్టాడు. తిట్టాడన్న ఉక్రోషంతో ఈ యువకుడు ఆత్మహత్య చేసుకు

న్నాడు''

యమధర్మరాజు తలాడించాడు. యమభటులు ఆ కుర్రాడిని పక్కనపెట్టి, మరో నలభై సంవత్సరాల మధ్యవయస్కుడిని యమధర్మరాజు ముందు నిలబెట్టారు.

"ఇతడి పాపం ఏమిటి?"

"చాలా ఘోరపాపం యమధర్మరాజా!..." చిత్రగుప్తుడు భారంగా నిశ్వసించాడు "ఒక పెళ్లయిన ఇల్లాలి శీలం చెరిచాడు''

"ఎలా జరిగింది?"

"ప్రభూ! అదో అపార్ట్‌మెంట్. అందులో పన్నెండు కుటుంబాలు కాపురం చేసేవి. ఎండాకాలంలో కరెంట్ కోతవల్ల ఆ ఇరుకు గదులలో ఉక్కకు, కారే చెమటకు భరించలేక టెర్రస్‌మీద పడుకునేవారు వారంతా. ఆరోజు ఈ మహానుభావుడు ఆఫీసునుండి పదింటికి ఇంటికి వచ్చాడు. అప్పటికే ఈయన భార్యగారు పడక టెర్రస్‌మీదకి మార్చేసింది. ఈయన భోంచేసి ఉండడంతో బట్టలు మార్చుకుని టెర్రస్‌మీదికి చేరాడు. తాము ఎప్పుడూ పడుకునేచోటుకి వెళ్ళి నిలబడ్డాడు. అక్కడంతా చీకటిగా ఉంది. అయినా అక్కడ పడుకునేది తామేకదా అన్న ఉద్దేశంతో ఆమె పక్కన చేరాడు. ఆమె కూడా తన భర్త 'డ్యూటీ నుండి తిరిగి వచ్చేశాడేమోనని దగ్గరకు తీసుకుంది... జరగకూడనిది జరిగింది... తెల్లారి లేచి చూసుకుంటే, తాను మరొకరి స్థలంలో పడక వేసినందుకు ఏం జరిగిందో అర్థమయింది. అపార్ట్‌మెంట్‌లోని వారందరికీ ఈ విషయం తెలిసిపోయింది. అందరూ ఆమెను చూసి నవ్వుకోసాగారు. ఆ అవమానం భరించలేక ఆ ఇల్లాలు ఆత్మహత్య చేసుకుంది. ఇది జరిగి రెండు నెలలయింది. ఇప్పుడు ఈ పాపి స్కూటర్ యాక్సిడెంట్‌లో..."

యమధర్మరాజు ఆలోచనలో పడ్డాడు.

అంతలో యమభటులు మరో ముప్ఫయ్ సంవత్సరాల వ్యక్తిని ఆయన ముందుంచారు.

చిత్రగుప్తుడు ఆ వ్యక్తి గురించి చెప్పసాగాడు "ప్రభూ! ఇతడు రోడుపక్క తిరిగే జులాయి. రాత్రి కరెంట్‌పోతే చాలు ఇతడిలోని నేరగుణం బయటకు వచ్చేది. జేబులు కొట్టేవాడు. అమ్మాయిలను రకరకాలుగా వేధించేవాడు..."

యమధర్మరాజు అంతా విన్నాక, మౌనంగా ఉండిపోవటం చూసి "ఏమిటి ప్రభూ ఆలోచిస్తున్నారు?" అడిగాడు చిత్రగుప్తుడు.

"చిత్రగుప్తా! ఆ కుర్రాడు ఆత్మహత్య చేసుకునేందుకు, ఈ మధ్యవయస్కుడు మరో ఇల్లాలి శీలం చెడగొట్టేందుకు, ఆ జులాయి చీకటి నేరాలు చేసేందుకు 'అసలు కారణం' ఏమిటో చెప్పు చూద్దాం?"

చిత్రగుప్తుడు అరసెకను ఆలోచించి చెప్పాడు. "కరెంట్‌కోత ప్రభూ''

"తప్పు చేసినవారినే కాదు, ఆ తప్పు చేసేందుకు కారకులయినవారిని శిక్షించడం ధర్మంకదా చిత్రగుప్తా! అందువలన మనం ఈ ముగ్గుర్ని శిక్షించడమే కాదు, వీళ్లచేత ఇలాంటి పాపాలు చేయించిన ఆ 'కరెంట్‌కోత కు కారకులయినవారిని కూడా శిక్షించాలి..."

"వారింకా ఆంధ్ర రాష్ట్రంలోనే ఉన్నారు ప్రభూ''

"వారు ఈ లోకంలోకి వస్తే చెప్పు ఇంతమందిచేత ఇన్ని రకాల పాపాలు చేయిస్తున్న వారికి ఇప్పటివరకూ ఏ పాపికి వేయని ఘోరమయిన శిక్ష వేద్దాం"

"అలాగే ప్రభూ'' ఆనందంగా పలికాడు చిత్రగుప్తుడు.

-జె.వి. బాబు





# సంఘటన

ముడతలు పడ్డ శరీరం. లోతుకుపోయిన కళ్లు. నెరసిపోయిన జుట్టు. ఆ వ్యక్తికి తొంభై దాటింది. ఆయన ఓ కేసు విషయమై సాక్ష్యం చెప్పేందుకు న్యాయస్థానానికి హాజరయ్యాడు.

ఆ ముసలాణ్ణి తికమకపెట్టే ప్రశ్నలడిగియిన రాజారాం "ఓహో అలాగా..." అంటూ చిరునవ్వు నవ్వి ఇలా అడిగాడు.

"అలా అయితే ఉదాహరణగా ఓ సంఘటన క్లుప్తంగా చెప్పండి చూద్దాం"

గత స్మృతుల్లోకి వెళ్ళిన ఆ ముసలాడు, "నేటికి పదిహేను సంవత్సరాల క్రితం 'లా'




లాంగదీసుకోవడానికి మకతిక అవుతున్నాడు వకీలు రాజారాం.

"తమ వయసు తొమ్మిది పదులు దాటిందకదా... మరి ఐదేళ్లక్రితం జరిగిన సంఘటన ఎలా గుర్తుపెట్టుకోగలిగారు? మీ జ్ఞాపకశక్తిమీద నాకు సందేహంగా వుంది'' అన్నాడు రాజారాం.

దానికా ముసలాడు తన లోతుకుపోయిన కళ్లతో రాజారాంను పరిశీలనగా చూసి, "అలా అనకండి. ఐదు సంవత్సరాలేం ఖర్మ- ఇరవై సంవత్సరాల క్రితం జరిగింది కూడా వివరంగా చెప్పగలను'' చెప్పాడు.

ఆ కంఠస్వరంలోని దృఢత్వానికి విస్తుబోఎగ్జామినేషన్‌కి మీరు చదువుతున్నారు. మీకారోజులు గుర్తున్నాయా?" అంటూ ప్రశ్నించాడు.

"గుర్తుంది'' మెల్లగా తలూపుతూ అన్నాడు రాజారాం.

"ఆ సంవత్సరం సెప్టెంబర్ 6వ తేదీ సోమవారం పరీక్షఫీజు కట్టేందుకు డబ్బు కావాల్సివచ్చింది అవునా?"

"అవును''

"దానికి ముందురోజు రాత్రి మీ నాన్నగా

రు నా ఇంటి తలుపు తట్టి, నిద్రపోతున్న నన్ను లేపి చాలా అవసరమంటూ లా కాలేజీకి కట్టాలంటూ చెప్పి నా దగ్గర యాభై రూపాయలు చేబదులు తీసుకున్నారు. ఆ సమయంలో మీరు మీ తండ్రిగారి వెనుక నిలబడి వున్నారు. జ్ఞాపకముందా?"

"అ...వు...ను... వుంది"

"ఆ యాభై రూపాయలు ఇంకా నాకు చేరలేదన్న విషయం నాకు బాగా గుర్తుంది" అంటూ సాక్షి బోనునుండి దిగాడు ఆ ముసలా యన.

పాపమా వకీలు రాజారాం మొహంలో రంగులు ఈస్టమన్‌కలర్‌లోకి మారాయి.

-కె.ఎస్.ఎస్.రెడ్డి

# ఫైర్‌స్టేషన్

అదో చిన్న ఊరు. నివసించేది రెండువందల మంది జనాభా అయినా, ఈ నియోజకవ ర్గంనుండి ఎన్నికైన అభ్యర్థి రాష్ట్రానికి ముఖ్య మంత్రి కావడంతో ఆ నియోజకవర్గానికీ, ఆ ఊరికి కూడా ప్రాముఖ్యత ఏర్పడింది.

గుడిసెలు తీయించి పక్కాఇళ్లు నిర్మిస్తా మని ఎన్నికల్లో చేసిన వాగ్దానాలకి నాలుగేళ్లు పూర్తి కావొస్తున్నా, ఫలితం పూజ్యం. ఎదురు చూసి చూసీ ఆ ప్రాంత వాసుల గుండె ల్లో 'ఆశ' ఆ గుడిసెల్లోనే మరణించింది.

ఉన్న సమస్యల్లోకెల్లా పెద్ద సమస్యను వారు వేసవికాలంలో ఎదుర్కొంటారు. వే సవి వచ్చిందంటే చాలు వాళ్ల గుండెల్లో రైళ్లు పరిగెడతాయి.

ఎక్కడ భానుడి ప్రతాపానికి పిచ్చుక గూళ్లలాంటి తమ గుడిసెలు భస్మీపటలం అవుతాయోనని వారికి ఒకటే బెంగ. చెప్పా లంటే ఆ నియోజకవర్గంలో ఎండలు మరీ ఎక్కువ.

ఈ విషమ పరిస్థితినుండి బయటపడటా నికి ఆ ప్రాంత పెద్ద శేషయ్య ఓ నిర్ణయానికి వచ్చాడు. ఆ ప్రాంతవాసుల అందరి దగ్గర సంతకాలూ, వేలిముద్రలు తీసుకొని ఒక వినతిపత్రాన్ని తయారుచేసి రాజధాని వెళ్ళి ముఖ్యమంత్రిగారికి సమర్పించాడు.

గుడిసెలు తీయించి గృహాలు నిర్మించక పోయినా, కనీసం ఎండల బారినుండి రక్షణ గా 'ఫైర్‌స్టేషన్' ఏర్పాటు చేయాల్సిందిగా దీనంగా వేడుకున్నాడు.

ముఖ్యమంత్రిగారిచ్చిన సంతృప్తికరమ యిన 'హామీ'ని తీసుకొని తిరిగి ఊరిదారి పట్టాడు శేషయ్య.

ఎలాగైతేనేం సంవత్సరం తిరక్కుండానే ఫైర్‌స్టేషన్ వెలిసింది. ప్రాంతవాసుల గుండె ల్లో గుబులు కుదుటపడింది. నిశ్చింతగా వూపిరి పీల్చుకున్నారు.

కాలం దొర్లుతూవుంది. అది మే నెల చివరిరోజులు. భాస్కరుడు తన ప్రతాపాన్ని తీవ్రంగా చూపుతున్నాడు. నేలమీద పేపరుప డితే క్షణాల్లో కాలి బూడిదయ్యేంత తీవ్రంగా.

మధ్యాహ్నం రెండు గంటల సమయం. బయట ఎండకి గుడిసెల్లో జనం బిక్కు బిక్కుమంటూ అల్లాడుతున్నారు. ప్రతి అయి దు నిమిషాలకొకసారి బయటకు వస్తూ, గుడి సె పరిస్థితిని చూసి, వాటిపై నీళ్లు జల్లుతూ వెళ్తున్నారు.

ఎప్పటిలాగానే చింతచెట్టు కింద నులక మంచంపై నిద్రపోతున్న శేషయ్యని ఎవరో ఒకకొశాల్తీ వచ్చి లేపి పక్కగ్రామసర్పంచ్‌గారు అర్జంట్‌గా రమ్మన్నారంటూ చెప్పి వెళ్లిపోయా డు.




అర్జంట్ అన్నారంటే ఏదో వుండివుండా లని అనుకుంటూ గుడిసెలోంచి తన డొక్కు సైకిల్‌ని బయటకుతీసి, తలకి తడిగుడ్డ కట్టు కొని ప్రయాణమయ్యాడు శేషయ్య.

పనిముగించుకొని తిరిగి తన ప్రాంతానికి వస్తున్న శేషయ్య గుండె ఒక్కసారిగా గుభే లుమంది. ఆ మండుటెండలో సైతం వెన్ను ల్లో సన్నటి వణుకు ప్రారంభమయ్యింది.

ఎదురుగా మంచినీటి చెరువు దగ్గర సుమా

వున్నారా, వాళ్లకేం కాలేదుకదా'' అంటూ కంగారు పడిపోతూ అడిగాడు. శేషయ్య కంగా రు చూసి ఆశ్చర్యపోతూ, "వాళ్లకేంరా, హాయి గా గుడిసెలో నిద్రపోతుంటే'' తాపీగా అన్నా డు రాజయ్య.

అంతే ఒక్కసారిగా పీకమొయ్యా కో పంతో ఉగ్రుడయ్యాడు శేషయ్య. "ఒకపక్క గుడిసెలు తగలబడిపోతుంటే, నిద్రపోతున్న నా వాళ్ళని లేపకుండా, చూసి వూరుకుంటా




రు వందమందిదాకా జనం బిందెలతో, కావి ళ్లతో నీళ్లు తీసుకొని హడావిడిగా పరుగులు పెడుతూ కన్పించారు. తల ఎత్తి చూస్తే ఆ ప్రాంతమంతా పొగలు కమ్ముకుంటున్నాయి. అయిపోయింది. ఏదైతే జరుగుతుందని భయపడ్డానో ఆ విపత్తు కాస్తా జరిగిపో యిందని గుండెలు బాదుకుంటూ లబోదిబో మంటూ వస్తున్న శేషయ్యకి, హఠాత్తుగా భార్యాపిల్లలు గుర్తుకు రావడంతో సైకిల్ పడేసి చెరువు దగ్గరకి పరిగెట్టాడు.

అక్కడున్న తన పక్కింటివాడు, స్నే హితుడైన రాజయ్యా దగ్గరకు వెళ్లి "ఒరేయ్ రాజయ్యా! నా భార్యాపిల్లలు క్షేమంగానే

వురా వెధవా! నీకేం ద్రోహం చేశానురా'' అంటూ కోపంతో వూగిపోతూ రాజయ్యా పీక పట్టుకున్నాడు. శేషయ్య.

ఆ చేతుల్ని విదిలించుకుంటూ రాజయ్యా అన్నాడు, "చత్ నోర్మూయ్! అపశకునం మా టలూ, నువ్వూనూ! అంటుకున్నది మన గుడిసెలు కాదురా..."

"మరి''

"ఫైర్‌స్టేషన్''

-ఆముదాల అజయ్‌బాబు

# పఠన ముత్యాలు

★ నాకు ఏ విషయాలు తెలియవో ఆ సంగతి ఒక్కటే నాకు తెలుసు

-సోక్రటీసు

★ సంస్కారమనే పదానికి అర్థం ఇతరులలో క్షమించదగ్గ లోపాల్ని అర్థంచేసుకోగల విశాలత్వం

-చలం

★ పొగడ్త సుగంధంవంటిది. దాన్ని పీల్చేందుకే ప్రయత్నించాలికాని మింగేందుకు కాదు

-శరత్

★ లోకంలో నాకంటే పిరికివాడు లేడు. నేను ఒక్క చెడుపనీ చేయడానికి సాహసించలేను.

-జెనోఫెక్స్ సూక్తి

★ ఏళ్లు పైబడ్డకొద్దీ ఋషులుకారు, ముసలివారవుతారు.

-అనీసోఫీ

★ అధికమైన ఆశ ఎవడినైతే పట్టి పీడిస్తూవుంటుందో అతను ఎంతటి పాపకార్యానికైనా ఒడిగడతాడు

-స్వామి రామతీర్థ

★ ప్రవర్తన అనే అద్దంలో ప్రతివాడి నిజరూపం ప్రతిఫలిస్తుంది

-గేథే

★ నాలుకపైవున్న తేనె చూసి మోసపోకు. హృదయంలో వున్న విషాన్ని గుర్తించు

-అగ్రిగియో

★ మనిషి పరిపూర్ణత అతని ఆస్తులలో కాదు, అతని స్వభావంలో వుంది

-స్వామీ వివేకానంద

★ కోపం ఆవహిస్తే వివేకం విడాకులిస్తుంది

-థామస్ వుల్లర్

★ ఇవ్వడం నేర్చుకో తీసుకోవడం కాదు. సేవ అలవరచుకో పెత్తనం కాదు

-రామకృష్ణ పరమహంస

★ ప్రతి చిన్న అభిప్రాయభేదాన్ని రాద్ధాంతం చెయ్యకపోవడం పెద్దమనిషి లక్షణం

-ఆస్కార్‌వైల్డ్

★ మనిషి ప్రవర్తన, చేతలు, అతని జీవితానికి ఇండెక్స్‌లాంటివి.

-థామస్

---

సేకరణ: అంగర శ్రీదేవి

# జో.ధ.లో.పై సమీక్షలు



> ఆగస్ట్ చతురలో ప్రచురితమైన, నవలల పోటీలో సాధారణ ప్రచురణకెన్నికయిన కాకాని చక్రపాణి నవల జో.ధ.లో (జోషువా గారి ధర్మలోగిలి)పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఐదింటిని ఈ దిగువ ప్రచురిస్తున్నాం.

## నవ్వుల మధ్య విషాదం

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

**తె**లుగు నవలా సాహిత్యంలో హాస్యం అపహాస్యం అవుతున్న తరుణంలో చతుర ప్రచురించిన ఈ నవల నవ్వుల పువ్వులు పూయించింది. చాప్లిన్ చిత్రంలా, హాస్యం వెనుక ఉన్న అసహాయతను, దుఃఖాన్ని అందంగా ప్రతిబింబించింది.

జో.ధ.లో. వాసుల దినచర్య మనుషుల స్వార్థాన్ని, బలహీనతని, ముసుగులని (ఏడ్వలేక) నవ్వుకునే విధంగా తెలుపుతూ రక్తికట్టించింది. ఖరం వడ్డీలు కట్టుకోవటానికి అప్పులు చేయటం బాధాకరమైన విషయమైతే అతడు ఆ లోగిలిలోనే వుండేట్లుగా ప్రయత్నించే ప్రహసనం హాస్యం. జోషువాగారు అతణ్ణి యిల్లు ఖాళీ చేయించటంలో తిట్లు హాస్యం అయితే, ఖాళీ చేయించకపోతే అతడి పరిస్థితి దారుణం అని తెలిసీ ఆ పని చేయించటం హాస్యం వెనుకవున్న అసలు విషాదం. రామచిలుక పెళ్లి విషయంలో కట్నం విషాదం అయితే జోషువాగారి దౌర్జన్యం హాస్యం. అందులో ఆయన ముందు చూపు అతడి సొల్యూషన్. యిలా ఎన్నో సంఘటనలు... నిజజీవితంలో (లా) దుఃఖాన్ని, అసహాయతను కూడా హాస్యంగా తీసుకుని జీవితాన్ని ఆనందంగా మలచుకోవటం జోధలో వాసుల ప్రత్యేకత. అందుకే నవల ఆద్యంతము రక్తమాంసాలతో కళకళలాడే ఆరోగ్యవంతమైన మానవ దేహంలా పరిపుష్టంగా సాగింది. బులేరావు, కాంగోరెడ్డి, రాచిప్పచెట్టి వీళ్లు వేసుకున్న రాజకీయ ముసుగులలోపల దుఃఖభరితమైన వాళ్ల అంతరంగం సతమతమవ్వటం జోషువాగారికి, మనకు వినోదం. సమకాలీన రాజకీయాలపై వ్యంగ్యాతి వ్యంగ్యంగా సాగిన కాకామం, ససలాంటి కార్యక్రమాలు గురిచూసి ఎక్కుపెట్టిన విమర్శనాస్త్రాలు. రాజకీయాలు జీవితంలో ఒక భాగం కావటం జో.ధ.లో.లో స్పష్టంగా తెలుస్తూ వాటి పరిణామాలు

ఈనాటి ప్రపంచాన్ని హెచ్చరించక మానవు. యిలాంటి ఎన్నో జో.ధ.లో.లు కలిసి మన ప్రపంచం అన్న విషయం అర్థమై మనకు నవ్వుకల్గకపోతే మనకేదో జబ్బు వున్నట్లే లెఖ! చాటుగా ఏడ్చుకోకపోతే మనం మను షులం కాదన్నమాటే!!

వింత వింత సంఘటనలతో చిత్రవిచిత్ర సన్నివేశాలతో కూడిన జో.ధ.లో. ఒక సహజ సమాజం, హాస్య రసాస్వాద చిత్తు లకు అది ఒక మాయాబజార్, సామాజిక వాదులకు అదొక సెటైర్, విషాదజీవులకు అదొక స్మృతి.

**-జంగా మంజువాణి**
మంగళగిరి

# పెద్ద హృదయం

*(గెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

**ఆ**మధ్య ఒక వ్యాసంలో హాస్యం అరుదైపో యిందా? అని ప్రశ్నించిన చలసాని ప్రసాదరా వుగారు, 'జీవితమే హాస్యాస్పదంగా అభివృ ద్ధి చెందివుంది. మనకు నవ్వు పుట్టించాల్సిన హాస్యాస్పదాంశాలన్నీ ఈనాడు మనకు అత్యంత సహజ విషయాలయిపోయాయి. నవ్వించగల శక్తిని అవి కోల్పోయాయి. అందుకే వాటిని ఒక కొత్త కోణంనుండి దర్శించి, మధనపడి, వేదన చెంది వాటిలోని హాస్యాస్పదత్వాన్ని బలంగా ఎత్తి చూపగల కొత్తతరం హాస్య రచయితలు కావాలిప్పు డు...' అన్నారు.

శ్రీ కాకాని చక్రపాణిగారు హాస్య రచ యిత అవునో కాదోగానీ 'జో.ధ.లో మంచి హాస్య రచన!

దీంట్లో సమకాలీన రాజకీయాలమీద కావా ల్సినంత వ్యంగ్యం వుంది.

'జోధలో'కి ప్రవేశించిన తర్వాత కాంగోరె డ్డి వర్గంలోనో, బులేరావు వర్గంలోనో చేర కుండా, పోట్లాడుకోకుండా వుండటం చాలా కష్టమైన విషయం. సిపిఐశర్మ, హరబాబు, లెబా, రాచిప్పచెట్టి, జైన్, కూగాశాస్త్రి... యిత్యాదులు రకరకాల కులాలకు, మతా లకు చెందినవారు. మత సామరస్యమూ, కులసామరస్యమూ అవిచ్ఛన్నంగా రాజ్యమే లుతున్న లౌకిక భారతానికి మంచి ప్రతీక ఈ లోగిలి... జోషువాగారి ధర్మలోగిలి!

ఈ లోగిలిలో దుర్మార్గులెవరూ లేరు. మామూలు మనుషులు. డబ్బు కక్కుర్తితో నాటకమాడే మనుషులు. వీళ్ల రాజకీయాల న్నీ స్వప్రయోజనానికి వేసుకున్న వేషాలే! నిజానికి పొలిటికల్ కన్విక్షన్, కమిట్‌మెంట్ వున్న వాళ్లెవళ్లూ లేరు. అందుకే ఈ లోగిలి మంచి హాస్యాన్ని పంచి హాయిని, ఆనందా న్ని కల్గించింది. యిలా సమాజాన్ని ప్రతి బింబించేట్లుగా ఒక లోగిలిని తీసుకుని ఆ లోగిలిలోని అన్ని స్వార్థాలను, కుతంత్రాల ను, ప్రేమలను, ఆప్యాయతలను, కులమతా లను, రాజకీయాలను, వ్యంగ్యాత్మకంగానూ, హాస్యభరితంగానూ ప్రదర్శించిన ఈ నవల రాయటం ద్వారా రచయిత మిక్కిలి చతు రత ప్రదర్శించేరు. ముఖ్యంగా జోషువాగారి పాత్ర చిత్రణ మిక్కిలి రసభరితంగా వుంది. తను సృష్టించుకున్న వాతావరణంలో రిటైర యిన తర్వాత జోషువాగారు కాలక్షేపం చేసిన తీరు ఆయన టేస్టుని తెలుపుతుంది. అదీ ఆయన జీవితంలో హాస్యం, దాన్ని గుర్తించగల సున్నితత్వం! స్పందించే ఆర్ద్రతా హృదయం!

ఖరం విషయంలోనూ, రామచిలుక పెళ్లి విషయంలోనూ ఆయన మంచితనం అర్థమై మనసు ఆర్ద్రమౌతుంది. పైకి ఎంతో దుర్మా ర్గుడిలా కన్పించే ఆయనలోని మానవతా దృష్టిని తెల్సుకున్నప్పుడు హృదయం అంతా పులకరించి ఆయన పెద్ద హృదయా నికి చేతులెత్తి మొక్కాలనిపిస్తుంది. ఆయన నిష్క్రమణకు మనం ఏడుస్తుంటే ఆయన అనే మాటలు మనకు ఖచ్చితంగా నవ్వు తెప్పిస్తాయి "ఏంటయ్యా ఏడుస్తారు? ఎవరు




మాత్రం యిక్కడ శాశ్వతం? అక్కడ ఆపైన యిల్లు కట్టి ఆ భగవంతుడికి అద్దెకివ్వాలి. మహా రాజకీయాలవాడు వాడు."

-ఎ.ఆర్.సి.హెచ్.ఎస్.రెడ్డి
శ్రీనగర్

## నిజస్వరూపాలు

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**ఆ**గస్ట్ నెల కాకాని చక్రపాణిగారి జో.ధ.లో. ఆద్యంతం వ్యంగ్య పూరితంగా నడిచింది. ఒక లోగిలిలో కాపురం ఉండే మనుష్యుల వింత ప్రవర్తనలను, స్వార్థపూరిత ఆలోచనలను రచయిత నవల్లో ప్రతిబింబించారు. మనుష్యులతో నిండిపోయి జనారణ్యాలుగా మారిన నగరాల్లో అద్దె ఇళ్ల ప్రహసనాన్ని రసవత్తరంగా చిత్రీకరించారు.

నవలంతా ప్రత్యక్షంగా అద్దె ఇళ్లల్లో ఉండేవారి వింతవింత మనస్తత్వాలు గురించే అయినా అంతర్లీనంగా పటిష్ఠమైన మానవ సంబంధాల ఆవశ్యకత గురించి చెప్తుంది. మనుష్యుల మధ్య అంతరాలు తొలగి, భేద భావం నశించిననాడే మానవ సంబంధాలు బలపడతాయి. అటువంటి బలమైన మానవ సంబంధాలు ఏర్పడిన నాడే అద్భుతమైన సమాజం ఏర్పడుతుందని రచయిత నవల ద్వారా పరోక్షంగా చెప్పారు.

మనిషి స్వార్థపూరితుడు, ఆలోచనా రహితుడైతే జరిగే దారుణాలు అనేకం. ఆ దారుణాలకు పోనీబాబులాంటి సహృదయులు అవస్థల పాలవ్వక తప్పదు. నవల్లో అక్కడక్కడా రచయిత కుళ్లి కంపుకొట్టే నేటి దేశ రాజకీయాలను ప్రస్తావించారు. కమ్యూనిష్టునని చెప్పుకుంటూ గోడమీద పిల్లిలాగా ఉండే సిపిఐశర్మ నేటి కుహనా రాజకీయ నాయకులకు ప్రతీక.

నవల్లో వాడిన ఇంగ్లీషు ఓ స్థాయి పాఠకులకు మాత్రమే అర్థం అవుతుంది. కొన్ని ఇంగ్లీషు మాటలను తెలుగులో చదువుకోటానికి ఇబ్బంది కలిగింది. జైన్ పాత్ర పూర్తిగా ఉర్దూలోనే మాట్లాడింది. హైదరాబాదీయులకు మాత్రమే ఉర్దూ పరిచయం ఉందిగానీ కోస్తా జిల్లాల వాళ్లకి ఆ భాషతో సంబంధంలేదు. జైన్ ఏం మాట్లాడింది అర్థం కాలేదు. ఆ పాత్రకి కొంచెం యాసతో కూడిన తెలుగుని వాడితే బాగుండేది. జోషువాగారి పాత్ర సరిగ్గా ఎస్టాబ్లిష్ కాలేదు. ఏదో వెలితి కనబడుతూనే ఉంది. నవల్లో పాత్రలు ఎక్కువయ్యాయి. అన్ని పాత్రలు ఉండటంవల్ల కొంచెం గజిబిజిగా ఉంది.

అయినా, కొత్త ఇతివృత్తంతో, చిత్రమైన పేర్లతో, మనుష్యుల నిజస్వరూపాలను బట్టబయలు చేస్తూ, అనేక మలుపులతో నవలను నడిపించిన రచయితకు అభినందనలు.

-శివప్రసాద్
విజయవాడ

## గుర్తుండే జోషువా

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

'**జో**'ధలో ఒక మినీ భారతదేశం. ఆ విషయాన్ని అడుగడుగునా గుర్తు చేస్తాయి నవలలోని పాత్రలు, సంఘటనలూను.

వర్తమాన రాజకీయాలమీద, ట్రేడ్ యూనియన్ కార్యకలాపాలమీద, కులమత వ్యవస్థలమీద చక్కని విసుర్లూ, చురకలూ, వ్యంగ్యపు వ్యాఖ్యలు జార్జ్ఆర్వెల్ నవల 'ఏనిమల్‌ఫాం'ను గుర్తుకు తెస్తాయి.

ఏ ఆదర్శాలు, నినాదాలు ఏకరువు పెట్టకుండానే రచయిత తన నవలద్వారానే సందేశాన్ని వినిపిస్తారు. మత సహనం అవసరాన్ని, వర్ణాంతర వివాహాల ప్రోత్సాహాన్ని, కులవ్యవస్థలోని కుళ్లును ఎంతో సరదాగా, ఎవరిని నొప్పించని రీతిలో వివరిస్తారు.

అన్నింటినీ మించి మానవత్వానికి అగ్రాసనం వేయబడింది ఈ నవలలో. జోషువా

మానవత్వం ఆయన రాసిన వీలునామా ద్వారా బయటపడుతుంది. నవల ముగింపులో 'పోనీ' తన పేరిట వచ్చిన డబ్బును వర్ణాంతర వివాహం చేసుకొన్న రెండు కొత్త జంటలకు చెరిసగం ఇవ్వడంద్వారా మానవతా విలువలకు, నిస్వార్థానికి పరమార్థం చూపుతారు.

నోట సిగార్, అది లేనపుడు అందరినీ ఆంగ్లంలో తిడ్తూ, ఇంగ్లీష్‌వాణ్ణి మెచ్చుకుంటూ, తోటివారికి సహాయం చేస్తూ, ఎప్పుడూ సూటు బూటుతో తెలుగు సాహిత్యంలో గుర్తుంచుకోతగిన పాత్రగా మిగిలిపోతాడు జోషువా.

మంచి పాత్రను సృష్టించిన రచయితకు అభినందనలు.

**-వింధ్యారాణి**
నాగార్జునసాగర్

## వ్యక్తిత్వం లేని పాత్రలు

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

'**జో**.ధ.లో నవలలోని పాత్రలకు సొంత వ్యక్తిత్వం, సొంత ఆలోచనలులేవు. ఏ ఒక్క పాత్రా మెదడుతో ఆలోచించదు, హృదయంతో స్పందించదు. అంటే పాత్రలకి అంతరంగం అనేదిలేదు. కాంగోరెడ్డి, బులేరావు, సిపిఐశర్మ, లెబా, నవలలోని ముఖ్య పాత్రలైనటువంటి పోనీబాబు, జోషువా ఇలా అన్ని పాత్రలకి ముఖాముఖి సంభాషణలే తప్ప వారివారి అంతరంగిక ఆలోచనలు గాని, అనుభూతులుగాని, స్పందనలుగాని పాఠకులకు తెలియవు.

రచయిత చేతిలో సృష్టించబడ్డ పాత్రలైనప్పటికీ, వాటికీ ఓ సొంత వ్యక్తిత్వం ఉండాలి. అప్పుడే అవి సజీవమైన పాత్రలు అవుతాయి. అనవసరమైన ఎన్నో పాత్రల సృష్టి కూడా జరిగింది ఈ నవలలో.

పోనీబాబు మనుషులు ఎదుటపడి అడిగినప్పుడు సలహాలివ్వడమే తప్ప, అసలు సమస్య ఏమిటి? ఎందువలన ఈ అరాజకీయం జరుగుతోంది? దీని మూలమేమిటి? అసలైన పరిష్కారమేమిటి? అని తన మేధతో ఆలోచించి తనకు తానుగా ఇచ్చిన సలహాలేమీలేవు.

అలాగే జోషువాగారి మంచితనాన్ని త్యాగ స్వభావాన్ని చూపాలనుకున్న రచయిత, ఆ మేరకు జోషువా పాత్రకి న్యాయం చేకూర్చి విజయం సాధించలేకపోయాడు. తన లోగిలిలో బాడుగకున్న వారికి తక్కువ అద్దెకిచ్చినప్పటికీ, ఒకరిద్దరికి ఆర్థికంగా సహాయపడే ఉదారస్వభావముగల వాడైనప్పటికీ, జోధలో వాసులందరూ చిన్న పిల్లలేం కాదు, ఉన్నతోద్యోగాలలో ఉన్న వాళ్లే. పిల్లలకి తండ్రులైనవారే! అటువంటి వారిని వెధవలు, గాడిదలు, రోగ్స్, స్కౌండ్రల్స్,రాస్కెల్స్ అని ముద్దుముద్దుగా తిట్టటం, జంతువుల పేర్లతో పిలవటం వారి వారి వ్యక్తిత్వాలను కించపరచటమే.

ఈ లోపాలన్నింటినీ ప్రక్కనపెడితే మధ్యతరగతి జీవుల రాజకీయ అవగాహన, అల్పత్వం, నీచత్వం, బాధలు, భయాలు, స్వార్థం, ద్వేషం, ఉదాత్తత, అనురాగం, పిసరంత త్యాగం కనిపిస్తాయి ఈ నవలలో.

కేవలం రాజకీయాల్ని దృష్టిలో పెట్టుకొనే రచయిత ఈ నవల రాసినట్లయితే, ఆమేరకు బయటి రాజకీయ వాతావరణాన్ని, రాజకీయ (కు) తంత్రాల్ని, కుట్రల్ని, నీతిని, అవినీతిని 'జోధలో వరకు సృష్టించి కొంత వరకు కృతకృత్యుడు కాగలిగారనవచ్చు.

**-బి.రత్నకుమారి**
ఎమ్మిగనూరు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel: 290328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 318181, 399444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

CHATURA Telugu Monthly Hyderabad 500 482 Regd. No. H/HD/402

# కొందరికి కారం అంటే మమకారం!




ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు...
మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.







**priya**

**Pickles**

**ఏ పచ్చడంటే**

**ఆ పచ్చడి సంసి**

**ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్,** (ప్రియ ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ 500 482